

# ండియాలో జీసస్

ర్వ చారిత్రక - జ్యోతిష - ఆధ్యాత్మిక - పరిశోధనా గ్రంథము

-జాతకం', తో సహా! "యోగి - 'ఈశా' రహస్య జీవితం"- పై

ప్రాచీన తాళపత్ర గ్రంథం లోని హిమాలయాల్లోని

'జీసస్' - ఆధ్యాత్మిక రహస్యాలతో

డా॥ వేదవ్యాస IAS., Ph.D

"యోగమిత్రమండలి"

భారతీయ ఆధ్యాత్మిక, సంస్కృతి, సముద్ధరణసంస్థ

USCEFI

హైదరాబాదు – 500 033.

వెల : 50/-

"శంబల-సద్గురువు" - "మాస్టర్ - జీసస్" ఆశీస్సులతో

"సద్గురువు" - మాస్టర్ జీసస్ నేటికీ సజీవుడే!

ప్రథమ ముద్రణ - 1996
ద్వితీయ ముద్రణ - 1999





★ 'క్రైస్తవ-చర్చి' లకూ, 100-కాపీలూ ఆపైనా కొన్న క్రైస్తవ సోదరులకూ 10%-తగ్గింపు-కమిషన్ లభించును.

# సూచిక

ఆధ్యాత్మికసోదరులకూ - యోగమిత్రులందరికీ ఇవే!

# 'శంబల' - సద్గురువు మాస్టర్ - "జీసస్" అనుగ్రహ ఆశీస్సులు!

యుగయుగాలుగా మానవజాతికి, నిజమైన వెలుగు బాటని చూపించే పనిమీద "శంబల" నుంచి, "పరమగురు మండలి" - దేవదూతలను పంపిస్తూనే వున్నది...

...'అహింసాజ్యోతి' బుద్ధ దేవుడూ ప్రవక్త "జొరాస్టరూ", 'కరుణామయుడైన' "యోగి-ఈశా", 'పరమ-గురువు షిరిడీ సాయినాథుడూ, ఇలా అనేక మంది ద్వారా విశ్వమానవ సోదరత్వమూ (Brotherhood of Man) "విశ్వాత్మ" యే "పరబ్రహ్మ పరమాత్మ" అయిన 'బ్రహ్మ - పిత' (Father in Heaven - అని జీసస్), "పితాని-లోకస్య" - అని "భగవద్గీత" లోనూ - ఒక్కడ్నే (Fatherhood of God) ఉద్బోధించడం కోసమే !!!

'జీవాత్మ' (1) "పరమాత్మ" - (Father in Heaven)ల యొక్క 'అబేద'త్వాన్ని (One-ness) తెలపటం కోసమే - "I and My Father in Heaven - Are ONE - అని, 'జీసస్ తెలిపినట్టుగా! ఇలా యుగ - యుగానికీ 'పరమాత్మ' అంశభూమ్మీద అవతరిస్తూనే, మానవాళికి, విశ్వప్రేమనూ, అహింసనూ, యోగజ్ఞానాన్ని వెదజల్లుతూనే వున్నారు! ఇలాంటివారినే "ఈశ్వర-కోటి" అని శ్రీ రామకృష్ణ పరమహంస అభివర్ణించాడు. అలాంటి - దివ్య పురుషులలో "ఈశపుత్రుడు'

' అని "భవిష్య-పురాణం"లో వేదవ్యాస మహర్షి భవిష్యత్తులో వర్ణించారు - జీసస్ యొక్క చరిత్రను.

ఆయనయే "జీసస్" అని (Jesus) ఇంగ్లీషు - 'వికృతి'లోనూ 'యోషువాయేశువా' 'యోషూ' (Jeshuva, Jeshu) అని యూదుల భాషలోనూ పిలిచే "యోగి-ఈశా" యొక్క రహస్య చరిత్ర హిమాలయ పర్వతాలలోని "హిమ్మస్" ఆశ్రమంలోని 'తాళపత్ర-గ్రంథం' (తాటియాకుల పురాతన గ్రంథం) లో భద్రపరిచి వున్నదాన్ని 'రష్యన్ రాయబారి' 'అలెగ్జాండర్-నోటోవిచ్ (Alexander Notovitch) స్వయంగా దర్శించుకున్నాడు. ఆయన - 'యోగి-ఈశా' యొక్క అసలు చరిత్ర మరుగునపడి - కల్పిత ప్రచారంతో ఆయన పేర, బిషప్‌లూ, ఫాదరీలో పొట్టలు పెంచుకోటం ఎక్కువ కాగా జర్మన్ క్రైస్తవ-సన్యాసి 'మార్టిన్-లూథర్ (Marttin Luther) **16**వ శతాబ్దంలో క్రైస్తవ మతసంస్కరణకై పోరాటం ఆరంభించాడు. అది, ఇంకా పూర్తిగా అమలుకావలసి వున్నది.

'మత - ఛాందస' వాదుల సంకెళ్ళ నుంచి 'జీసస్-యదార్థ చరిత్రను వెలికి తీయ్యాలని ఎంతో కష్టపడి "చర్చి (Church) మతాధికారుల సంకెళ్ళనుంచి బైటకు తీసి విముక్తి కోసం నిజమైన "జీసస్ - జీవితం" లోని ఆధ్యాత్మిక రహస్యాలను వెలికి తీసినవారు :

"ఎందరో, మహానుభావులు!' - అందరికీ, వందనములు"

అలెగ్జాండర్, నోటోవిచ్ అనే రష్యన్ రాయబారి; "లూయీ జకోలియో" (Louis Jacolliot) ; మేడం బ్లావెట్స్కీ (Blavatsky); Holger Kersten - 'హోల్గర్‌కెర్‌స్టన్' అనే జర్మన్ బైబుల్ పరిశోధకుడు "జీసస్ - ది - మ్యాన్" (Jesus The Man by Barbara Thiering) రచయిత్రిబ్బారరా, అభాస క్రైస్తవం రాసిన శ్రీ కోట వెంకటాచలంగారూ ఫ్రెంచి రచయిత "ఎర్నెస్ట్ రేనాన్" వంటివారు వెలికి తీసిన నిజాలను ప్రపంచం దృష్టికి తేవాలని నేను పడ్డ శ్రమను గుర్తించగలిగితే - ధన్యవాదాలు!

ఇది, కేవలం -చారిత్రక జ్యోతిష, ఖగోళ, పరిశోధనా గ్రంథము మాత్రమే! మత ప్రచారకుల - 'మతోన్మాదం' 'మతపిచ్చి' (Fundamentalism) వంటి విషవాయువులనుంచి, "యోగి-ఈశా" - జీసస్" - పవిత్ర జీవితంలోని మరుగుపడి పోయిన యదార్థ సత్యాలను అందరి ముందూ వుంచాలని నేను చేసిన పరిశోధనా ఫలితాల్ని పాఠకుల ముందుంచుతున్నాను.

"ప్రచారం" - కన్నా 'యదార్థ - సత్యాన్నే' మేలని యూరప్, అమెరికాలోని విదేశీయుల వెలికి తీసే హృదయ వైశాల్యం ఎప్పటికైనా మనదేశీయులకీ కూడా కలగాలని దానికి వారందరికీ - విశాల మనస్సునూ సత్యాన్వేషణను గ్రహించే వివేకాన్నీ - ప్రసాదించాలని, ఆ 'యోగి-ఈశానే' లేక జీసస్ మహాశయునే ప్రార్థిస్తూ - ఈ గ్రంథాన్ని యదార్థ - సత్యానికై పాటుపడే నిజమైన క్రైస్తవ సోదరులకు అంకితం చేస్తూ - మంగళా శాసనములు చేస్తూ

6-12-1996 మీ

హైదరాబాద్ డా. వేదవ్యాస

# 1

# జీసస్ - సమాధి కాశ్మీర్‌లో!

ఇది జరిగి ఇప్పటికి 36 సంవత్సరాలు కావస్తున్నది! అది 1960 - సంవత్సరం డిసెంబర్ - జనవరి మధ్య కాలం! ఢిల్లీ నుంచి కొత్తగా పోటీపరీక్షలో 'సెలెక్టు' (Select) కాబడిన ఒక IAS ఆఫీసర్ల బృందంలో ఒకడిగా వినోద యాత్రను, భారతదేశమంతా దేశానుభవం కోసం చేస్తూ, మన భారత ప్రభుత్వం ఏర్పాటు చేసిన టూర్‌లో నేనూ చేరాను! నా వయస్సు అప్పట్లో సుమారు 24 - 25 కంటే వుండదు! మనదేశంలోని అన్ని రాష్ట్రాలూ తిరిగి చూడటంతో రంగు రంగుల తివాచీలోని వేరు వేరు డిజైన్లను ఒక గొప్ప రంగుల కలలాగా దేశాన్ని చూసిన భావం కలిగింది! దక్షిణాది టూరు తగ్గించుకొని, బీహార్ ఉత్తర్‌ప్రదేశ్ రాజస్థాన్, మధ్యప్రదేశ్‌లు పర్యటించి చివరికి కాశ్మీర్ చేరాము.

అది శ్రీనగర్ సుందర దృశ్యం! విపరీతమైన చలి వణికించేస్తోంది! పొగలు గ్రక్కే 'టీ'ని నెమ్మదిగా 'సిప్' చేస్తూ విహారయాత్రలో రోడ్డు ప్రక్కనే మా యువ ఆఫీసర్లబృందం ఒక చిన్న విశ్రాంతి తీసుకుంటూండగా...

"ఇంకేం చూద్దాం?"

"శ్రీనగర్ అంతా చూశాం కదా? 'లెటజ్ - ఎన్‌జాయ్!' (Let us enjoy!)

"ఇంకా ఏం చూడవచ్చు?" అన్నాను.

మాతో 'టూరు' లో గైడులా అనుసరిస్తున్న ఒక ముసలి కాశ్మీరీ పండితుడు అన్నమాటలివి!

"జీసస్ - సమాధి వున్నది - చూడరా?"

ఒక్కసారిగా నా మెదడులో వెయ్యి 'వోల్టు'ల కరెంటు 'షాక్'లా మెరుపులా వెలిగింది! ఏమిటి? 'జీసస్ సమాధి'యా? సరిగ్గా విన్నానో లేదో అనుకుంటూ అతడిని మళ్లీ అడిగాను.

"అవున్సార్! ఇక్కడి కొచ్చిన ప్రతీవారూ కాస్తోకూస్తో అక్షరజ్ఞానం ఉన్నవారు తప్పక 'జీసస్ సమాధి'ని చూడకుండా వెళ్లరు! మీకు గనుక ఇంటరెస్టు ఉంటే తీసుకువెళతాను.

ఒక పెద్ద బాంబు వేసినట్లు అతడి సమాధానం ఒక్కసారిగా నాకు తెలిసిన చరిత్రను, నేను విన్న బైబుల్ గాధనూ, భూకంపంలా పట్టి కుదిపేసింది! ఉండబట్టలేక అప్పటికే అడిగేశాను!

"నేనూ కాస్తో కూస్తో బైబుల్ చదువుకున్నవాడినే! పైగా 'రోమన్ కేథలిక్' కళాశాలలో 'లయోలా కాలేజీ'లో పని చేశాను! బైబుల్ ప్రకారం జీసస్ ఎప్పుడో ఎక్కడో శిలువపై మరణించినట్లు అందరికీ తెలిసిన సంగతి! బహుశా కాశ్మీరీలకు తప్ప! అయినా "జీసస్ సమాధి" అని ఇంత 'ఖచ్చితంగా' ఎలా అంటున్నారు? ఇంకేదైనా పేరు దీనితో పొరపాటున

కలిపేసి గల్లంతు పడిపోతున్నారేమో!"

నా ప్రశ్నలోనే అతడి సమాధానానికి తావు ఇవ్వకుండా నా ఆదుర్దానీ, అనుమానాన్నీ రంగరించి - కాస్త అసహనంగా మాట్లాడినందుకు నాకు నేనే నివ్వెరపోయాను, 'అతడేమన్నా బాధపడ్డాడేమో?' అనుకుంటూ...!

అతడంత పండుముసలి వయస్సులోకూడా గులాబీ పువ్వులా రంగుతో నిగనిగలాడుతున్న కాశ్మీరీ పండితుడు; చిరునవ్వుతో ప్రసన్నంగా నావంకే చూస్తూ, నిదానంగా అన్నాడు.

"నాకిది నిత్యమూ అలవాటే! ప్రతీవారూ ఇలానే అడగటమూ మేమూ బదులు చెప్పడమూ, మామూలైపోయింది! అందుకు నేనేమీ అనుకోను! మీకే కాదు ఎవరికైనా వచ్చేవే ఈ ప్రశ్నలు! అందరూ అదే అడుగుతారు, కొద్దిపాటి తేడాతో! అంతేగాని ఈ సమాధి కాశ్మీరులో కనీసం 1800 సంవత్సరాల నుంచే ఉన్నట్టు మా తండ్రి తాతల కాలంనుంచీ సాంప్రదాయంగా అందరికీ తెలిసిన విషయమే!

అంతేకాదు ఇక్కడ మాలో ఎవరూ వేరే మత సంబంధమైన దృష్టితో ఒక "క్రైస్తవుని గోరీ"లా ఎవరూ చూడరు! వెళ్లిచూస్తే మీకే ఆశ్చర్యం కలుగుతుంది! హిందువులూ, ముస్లింలూ, పార్సీలూ, ఒకరేమిటి ఇలా చాలామంది భక్తితో ఈ సమాధిని దర్శిస్తారు! కొందరు పూజాభావంతో ఊదువత్తులు వెలిగించి గులాబీలను ఉంచితే, మరికొందరు సాగిలపడి హిందూ పద్ధతిలో మ్రొక్కి నమస్కరిస్తారు! ఇంకా కొందరు ఆ సమాధి సమీపంలో కూర్చుని ధ్యానం చేస్తారు! ఇక్కడ కాశ్మీరీల సంస్కృతి చూస్తే మీకు చాలా చిత్రం కలుగుతుంది! 'యోగి - ఈశా సమాధి' 'ఈశా-నబీ - కా - దర్గా!' అని లేక 'యూష్ అసఫ్ ఖబర్" అనీ ఇలా రకరకాలుగా పిలిచే దీన్ని ఒక పవిత్రవ్యక్తి మహాసమాధికి చెందిన స్థానంగానే పూజిస్తారు అందరూ - అన్ని మతాల వారూ! నిజానికి క్రీస్టియన్లే ఇక్కడకు వచ్చేవారిలో చాలా తక్కువమంది! నిజం చెప్పాలంటే 'క్రిస్టియన్ల'లో చాలా మందికిది ఇక్కడ వున్నట్టే, తెలీదు గదా?"

సన్నగా గులక రాళ్లపై శబ్దంచేస్తూ మా బస్సు ఆగింది.

"ఇక్కడే దిగండి! ఇదే 'యోగి ఈశా' సమాధి" అన్న కేకతో త్రుళ్లిపడి నా ఆలోచనలనుండి మేల్కొన్నాను!

ఎదురుగా సుమారైన మందిరంవంటి, 'స్మారకకట్టడం', ఎంతో ప్రశాంతంగావున్నది. ఉండటం అయితే శ్రీనగర్‌లోని రద్దీ అయిన ప్రాంతంలోనే వున్నప్పటికీ దానిపై మెట్లు, ఆవరణ లోపలి వరండాలు ఆ వెనుక వైపున వున్న సమాధిమందిరం గురించి చెపుతున్న అతడి ఆ మాటలు నా చెవికి ఎక్కనే లేదు! ఆతృతగా చూస్తూ, ముఖ్యమైన నాలుగుమూలలా నా కళ్లు అతి ముఖ్యమైన సాక్ష్యాల కోసం అన్వేషించాయి!

## పాద - ముద్రలు :

"ఇవి ఏవేమిటి?"

అని 'ఆత్రంగా' కేక పెట్టినట్టు అడిగాను! ఆ పండితుడు తాను వివరిస్తున్న చిన్న గుంపును తోసుకుంటూ నావద్దకు వచ్చి -

ఇవి "యోగి ఈశా పాదాలకు నమూనా" - అంటూ రాతిపై పెట్టిన రెండు పాదాలను నాకు చూపించాడు. ఇవి జీసస్ పాదముద్రలని ఎలా నమ్మటం? అని అడిగేలోగా అతడే -

"ఇదిగో చూడండి!" అరికాలిలో మేకులు దిగవేసిన గుంటలు! అవి ఈ ఇతర యూదుల పాదముద్రల మీద మీకు కనిపిస్తాయా? కనిపించవు! ఎందుకంటే "అవి జీసస్‌ను శిలువ వేసినప్పుడు కొట్టిన శీలలు మానినా పూర్తిగా పోని గాయాల మచ్చలు" అందుకే యధాతథంగా పాదముద్రలపై ఉన్నాయి! అంటూ చూపించాడు. అరికాలి మధ్య స్పష్టంగా గుంటలు, గాయాల మచ్చలవలే వున్నాయి! అవి ఈ పక్కన (ఫొటో) చిత్రాలలో కూడా కనిపిస్తున్నాయి!

నా తల గిర్రున తిరగిపోయింది! - నిజంగా ఇవి, జీసస్ కాలిముద్రలే!

"మరి జీసస్ భారతదేశం వచ్చాడా?"

"కాశ్మీర్‌కు ఎప్పుడు వచ్చాడు? బైబుల్‌లో ఎక్కడా లేదే ఈ సంగతి?"

ఇటువంటి లెక్కలేనన్ని ప్రశ్నలు తేనేటీగల పుట్టలా దాదాపు 30-ఏళ్లపాటు నా మెదడును తొలిచేశాయి!!

రెండేళ్లు క్రిస్టియన్ కాలేజిలో పనిచేసిన నా ఆలోచనలకు ఇది ఒక గొప్ప ఆలోచనా తుఫాను లేక "అయస్కాంతం తుఫాను" (Magnetic Storm) గా పనిచేసింది! ఎక్కడికి పోయినా 'జీసస్ సమాధి' గురించి ఎవ్వరికీ ఏ స్పష్టమైన సమాధానాలూ, తెలియవు!"

ఇలా ఉండగా....!

## న్యూయార్క్‌లో - సమాధానం :

అది **1985** సంవత్సరం. న్యూయార్క్‌లో నేను అంతర్జాతీయ సభ 'యునైటెడ్-నేషన్స్' (UNO)లో ఉపన్యాసం చేయడానికి నన్ను ఆహ్వానించగా **23-10-1985** తేదీన నా చుట్టూ చేరివున్న మిత్రులతో ఉల్లాసంగా వారి, ప్రశ్నలకు సమాధానమిస్తున్నాను!

"మీరు 'శంబల' గురించి విన్నారా? రానున్న అవతారమూర్తి కల్కిభగవానుడు జన్మించే స్థానం?" అంటూ ప్రశ్నించాడొక రష్యన్ మిత్రుడు!

మన హిందువులకే చాలామందికి తెలియని ఈ "శంబల" అన్న పేరు వీళ్లకెలా తెలిసిందో? అనుకొంటూ విస్తుపోయాను! దానికతడు నా అనుమానాన్ని పసిగట్టి - "రష్యన్ చిత్రకారుడు నికోలాస్ రోరిక్ **1903**లో హిమాలయాలలో పరిశోధనకై టూర్ చేశాడు; శంబల కోసమే!!" అంటూ అతడు ఒక రహస్య గ్రంధాన్ని తరువాత నాకిచ్చాడు!

ఉన్నట్టుండి, ఆ విదేశీయులతో, UN - లెక్చర్‌హాల్ వద్ద నిలిచి వున్న వారినో ప్రశ్నవేశాను - ఆకస్మాత్తుగా!

"జీసస్ భారతదేశం వచ్చాడని మీరు ఎక్కడైనా విన్నారా?" అంటూనే గొప్ప సస్పెన్స్ భోగట్టాను మిగిల్చాననుకుంటూనే అడిగాను! వాళ్లేమీ ఆశ్చర్యపోలేదు!

"అవును ఈ విషయం, మాలో అందరికీ తెలుసు! మీరు చూడలేదా?

ఇప్పుడు అమెరికా అంతటా అట్టుడికి పోతున్నట్టుగా ప్రతీవారూ చూస్తున్నారొక 'వీడియో' చిత్రాన్ని (Video - Film) దాని పేరు - "Hidden Life of Jesus Christ in the East." - "The Missing Years" అన్న వీడియో షో గురించి! చూపిస్తున్నారు!

ఈసారి ఆశ్చర్యపడటం నా వంతు అయింది! "జీసస్ - జీవితంలో రహస్య సంచారం చేసినట్లు వీడియోకూడా తీశారా? ఈ అమెరికాలో ఇంత మంది విరగబడి చూస్తున్నారా?

- అంటూ దిమ్మెరపోయిన నాకు ఆ మర్నాడే నా అమెరికన్ శిష్యురాలు ఎలిజబెత్ (Elizabeth) తన ఇంటిలో ఆ 'వీడియో షో!' ను ఏర్పాటుచేసింది భోజనాంతరం! అందులో జీసస్ - తన 13వ సంవత్సరం తర్వాతనుంచే కాలినడకన 'జెరూసలెమ్'ను విడిచి 'సిల్క్ - మార్గం' (Silk Path) గుండా మధ్య ఆసియాకూ, అక్కడినుండి  కైబర్ - కనుమ దాటి, అక్కడి నుండి హిమాలయ పర్వతాలలో కాశ్మీర్ - లద్దాఖ్‌ల మధ్య ఆగి; అక్కడ - బౌద్ధ భిక్షువులతో ఆయన చేసిన "యోగ - సాధనలు" **'లామాసరీ'** (Lamasary) ఆశ్రమంలో జపధ్యానాలు చేసి క్రమక్రమంగా హిమాలయాలు దాటి 'బుద్ధగయ', వారణాశి, సార్‌నాద్, వంటి అనేక బౌద్ధక్షేత్రాలని దర్శిస్తూ అక్కడి రకరకాల మతాల, సాధువులను, సిద్ధగురువులనూ దర్శిస్తూ, పాదయాత్ర చేయడం ఎంతో అందంగా, చాలా ఆశ్చర్యంగా "వీడియో"లో చూపించారు!

అలా శ్రీనగర్‌లో 1960 లో అలా పేలిన బాంబువంటి పై ప్రశ్నలకు సమాధానం కాలమే ఇలా 1985 లో "యునైటెడ్-నేషన్స్"లో అమెరికన్ల నుంచి లభించిందా?

జీసస్ ఇండియా రావటం విషయం వింటే వీరందరికీ ఏమీ ఆశ్చర్యం కలగలేదుసరిగదా, ఇక్కడ మనదేశంలో ఇందులో ఆవంతైనా ఏమీ పట్టని హిందువులకంటే - పుట్టుకతో 'క్రిస్టియన్లై'నా సరే, ఈ అమెరికన్లకే - ఆధ్యాత్మిక విషయాల గురించి ఎక్కువ తెలుసా ? - అని ఆశ్చర్యపోయాను.

దీనికి కారణం తర్వాతగాని బోధపడింది కాదు! అది ఈ తెల్లవారిలో

హిందూమతంపై వ్యతిరేకతగాని, లేక భారతదేశంపై ద్వేషంగాని ఏ మాత్రం లేదు సరికదా - వీరికి "యోగం" అన్నా, 'జ్యోతిషం' అన్నా 'జపం' - 'ధ్యానం' అన్నా విపరీతమైన ఆసక్తి! ఆసక్తే కాదు, వీళ్లలో చాలామంది గొప్ప 'సాధకులు'! మాంసాహారం విడిచివేసి సాధనచేస్తారు! పూర్తి శాకాహారులై! (పాలూ, పెరుగుకూడా ముట్టరు). మన భారతీయ క్రైస్తవులవలే వీరికి పరమతం అంటే ద్వేషం, లేక 'కక్ష' వంటి తీవ్ర కఠినభావం ఏమీ లేదు. అందుకే వీరికి ఆశ్చర్యం కలగలేదు నేను భావించినట్లు వీరికి కోపమూ రాలేదు. "జీసస్ నిజంగా శిలువపై మరణించలేదు" - అని నేను అంటే!

ఇది రెండవ మజిలీ - శ్రీనగర్‌లో 'జీసస్ - సమాధి' చూసిన నా అన్వేషణలో! జీసస్ భారతదేశం రావడం వీరందరికీ, క్రొత్త విషయమేమీ కాదు!

మరి నా మనస్సు ఊరుకోలేదు. బైబుల్‌లోని జీసస్ జీవితంలో శిలువపై మరణించినట్టు ఉన్నదని - ఆయన మరణించిన నాటి నుండి మూడో రోజున తిరిగి లేచుట గురించి ప్రతి క్రైస్తవుడు ప్రచారం చేస్తారే - వారికెవ్వరికీ 'జీసస్' యొక్క రహస్య జీవితం గురించి ఏమీ తెలియదా?.. అని, ఆశ్చర్యం అనిపించింది! ఇంత పెద్ద "సెన్సేషన్" అనుకున్న 'వార్త' వీరికి ఎప్పుడో తెలిసిన చరిత్రే, అంటే!

## జీసస్ - 'శిలువ'పై మరణించలేదా?

జీసస్ శిలువపై మరణించలేదా? అసలు ఎవరైనా జీసస్ జీవితంలో నిజంగా ఏం జరిగిందో తెలిపే, సాక్ష్యాధారాలపై పరిశోధన ఏమైనా చేశారా? అంటూ తీవ్రంగా అన్వేషించిన నా దృష్టికి ప్రఖ్యాత ఖగోళ శాస్త్రజ్ఞుడు (Astronomer) జోహాన్స్ కెప్లర్ (J. Kepler) వ్రాసిన "జీసస్ క్రీస్తు - జాతకం' ' అన్న రచన మరింత ఆశ్చర్యం కలిగించింది! క్రమంగా 'జీసస్' జీవితంలోని చారిత్రక, సమకాలిక, సాక్ష్యాధారాలకోసం అన్నిచోట్లా అన్వేషించాను!

## బైబుల్ - చరిత్ర :-

"నేటి 'బైబుల్' - చరిత్ర ఏమిటి? ఇప్పటి బైబుల్ గ్రంధానికి మాతృక, ఎక్కడిది? దీని 'మౌలిక' రచన ఏకాలం నాటిది? 'దేవుని వాక్యం" (Word of God)గా ఇప్పటి 'బైబుల్' గ్రంధంగా ఒకరూపం ఎప్పుడు దాల్చింది?' అన్న నా అన్వేషణ, అమెరికాలోని 'యూనివర్సిటీలు', వాటి లైబ్రరీల వరకూ నన్ను లాక్కెళ్లింది! ఎన్నో ఆశ్చర్యాత్మక సాక్ష్యాధారాలు లభించాయి! వాటి ఫలితమే ఈ గ్రంధం! గతముప్ఫై ఆరేళ్ల నా చారిత్రక అన్వేషణా ఫలితమే ఇది ఈనాడు, ఒక రూపం దిద్దుకొంది, ఈ గ్రంధంగా తనంతట తానే, పెరుగుతూ.. కేవలం, యాదృచ్ఛికమైన అనుభవాల ద్వారా... కొత్తకొత్త విషయాలు లభించటం - వాటి వెలుగులో క్రొత్త 'రహస్యాలు' గ్రంధాలు లభించి, బైబుల్ పరిశోధకుల్ని కలవటం, జరుగుతూ అదే - ఎన్నో మజిలీలు చేసి ఈనాడు ఈగ్రంథంగా జన్మించింది!

## 'జీసస్ - మేరీ'ల సమాధులు - ఇండియాలో :

ఇందులో చరిత్ర పరిశోధనకంటే అత్యాశ్చర్యకమైన ఏ 'డిటెక్టివ్' నవలా పరిసోదు! 'సస్పెన్సు'లో కల్పితం కన్న గొప్ప 'సస్పెన్సు'! అన్న సామెత విషయమే దీంట్లోనూ ఋజువైంది!

ఇందులో అడుగడుగునా... అనుకోని మైలురాళ్లుగా లభించిన సాక్ష్యాధారాలు, ఈ అన్వేషణను ఎన్నో మలుపులు తిప్పింది! అందులో ఎదురైన ఆశ్చర్యాలు కొన్ని మీముందు వుంచుతున్నాను :

1. మేరీమాత (Virgin Mary) సమాధి

2. మోసెస్ (Moses) 'మంత్రదండం' (యోగదండం)

3. ఈనాటి బైబుల్‌లో నుంచి తొలగించబడ్డ బైబుల్ గ్రంధాలు

4. దాదాపు 1000 సం॥రాలుగా క్రైస్తవ ఫాదరీలు మార్పులు చేర్పులూ చేస్తూ ఈనాటి బైబిల్‌ను ఎలా రూపొందించారో అదంతా-ఒక విచిత్రగాథ!

బైబుల్‌ను "దేవుని" వాక్యంగా వీరు భావించినట్టు కనిపించదు. బైటి - ప్రచారం కోసం తప్ప! లేకపోతే దీనిని ఒక ఇంటర్మీడియట్‌కో లేక డిగ్రీ పాఠ్యగ్రంథం లోనికో అనేక 'పాఠాల' సంకలనంగా 'సిలబస్' వారు రూపొందించినట్లుగా "దేవుని వాక్య"మని వీరు గనక భావిస్తే ఈ ఫాదరీలు ఆ పవిత్ర గ్రంధాన్ని ఆపరేషన్ చేసి అవయవాల మార్పిడిలాగా ఇలా ఖండించి, రూపొందించగలరా? వారికా భయంవేయదా?

వీటిలో - అన్నిటి కన్నా ఆఖరి ఆశ్చర్యం 1947లో - జెరూసలెం వద్ద "ఖుమ్రాన్- గుహల" లో అతి పురాతనమైన 'హీబ్రూ' (Hebrew) వ్రాతప్రతులు లభించడం! ఇది బైబుల్‌ను, జీసస్ చరిత్రను, ఒక్కసారిగా ఓ పెద్ద భూకంపంలా ప్రేలుడుతో బైబుల్ పునాదులనుకూడా కూల్చివేసింది!

బైబుల్ గురించిన నా పూర్తి పరిశోధనా వివరాలతో ఈ గ్రంధానికి అనుబంధంగా రెండవ భాగంలో మీకు విడిగా పూర్తివివరాలతో అందిస్తున్నాను.

ఇందులో 'జీసస్ - జీవితంలోని చారిత్రక - ఆశ్చర్యాలు', అనుకోకుండా నాకు తారసపడ్డ యదార్థ అనుభవాలు, మీ ముందుంచుతున్నాను! ఇవి చదివిన మీకు 'బైబుల్' గురించి, జీసస్ గురించి, 'హీబ్రూ' మతం గురించి విదేశీయుల కంటే మన భారతీయులం ఎంత వెనకబడి ఉన్నామో తెలుస్తుంది! కనీసం వెయ్యేళ్లు వెనకున్నామేమో కాలంలో కాదు, విషయపరిజ్ఞానంలో!



2

# చరిత్రలో - జీసస్!

కాశ్మీరులో పేలిన టైంబాంబువంటి ఆశ్చర్యం - ఇండియాలో జీసస్ సమాధి నా మనస్సులో రైళ్లు పరిగెట్టించనంత సంచలనం రేపింది! ఒకటే ఊహ - రాత్రీపగలూ మనస్సు కాల్చుకుతింటూ - "ఇండియాకు జీసస్ రావడం ఏమిటి? కాశ్మీరులో సమాధి కావడమేమిటి?" అసలీ విషయాన్ని చరిత్ర ఏమాత్రం పట్టించుకోకపోవడమే మరింత ఆశ్చర్యం!!!

**జీసస్ - కాలము : -**

అసలీ జీసస్ ఏనాటివాడు? - అతడి చారిత్రక కాలం ఏమిటి? కేవలం మతగ్రంధాలలోని 'నమ్మకం' ఆధారంగావున్న కొద్దివాక్యాలేనా? అసలు చరిత్రలో ఆయన గురించి అతడి జననతేదీ గురించీ, అతడి సమకాలికులు ఆయన పూర్వీకులు ఆయన తర్వాతవారి గురించీ నిర్దుష్టమైన చారిత్రక ఆధారాలు ఏమి లభిస్తున్నాయి? ఇవి తేలితేకాని జీసస్ ఎక్కడ పుట్టిందీ ఎక్కడ మరణించిందీ, ఎలా మరణించిందీ ఇవి

సైంటిఫిక్‌గా యదార్థ నిర్ణయంచేయడం సాధ్యపడదు!

జీసస్ జాతకంగాని, అతడి జనన సమయంకాని కనీసం పుట్టిన నెలకాని, తేదీకాని కరెక్ట్‌గా రికార్డు చేసి లేకపోవడంతో ఈ సమస్యను గతంలో నేను **"మహాభారతయుద్ధ కాలనిర్ణయం"** కాలాన్ని నిర్ణయించడానికి పనికివచ్చిన గణితం (Mathametics) ఖగోళం (Astronomy) ఫలానారోజున నెల, తిథి, - ఆధారంగా వారం నక్షత్రంతోసహా మహాభారత ప్రధానపాత్రలు, జన్మతేదీలు వ్యాసమహర్షి భారతంలో రికార్డు చేసినట్టుగా బైబుల్‌లో అలాంటి భోగట్టా ఏమాత్రం కనిపించలేదు! ఈదృష్టితో సువార్తలు ఈ పక్కనుంచి ఆపక్కకి జల్లెడపట్టి వెతికినా ఫలితం శూన్యం! కనీసం నెలకూడా కరెక్టుగా రికార్డు చేసిలేని సువార్తలవల్ల చారిత్రక పరిశోధనకే ఏమి ఆధారం లభిస్తుంది? లభించదు! దీనిని విడిచిపెడితే బైబుల్‌లోని జీసస్ జీవితం గురించిన అంశాలూ, అతడి సమకాలికుల చరిత్రా జీసస్ కాలాన్ని పట్టుకోవడానికి ఉపయోగిస్తాయేమో చూద్దాం!!

## "సువార్త"ల సాక్ష్యం :-

"సువార్తలలో జీసస్ చరిత్రకు ఆధారాలు ఏమి కనిపిస్తాయి" అన్న దృష్టితో వెతికితే ముఖ్యంగా కనిపించేవి ఈకింద పట్టికలో చూపించాను!

**1.** జీసస్ హెరాడ్ రాజు కాలంలో జన్మించినట్టూ అతడి జననాన్ని ముందే తెలుసుకున్న ఆరాజు జీసస్ పుట్టినరోజున జన్మించినే పసిపిల్లలను నరికివేయమని ఆజ్ఞాపించాడు అని వ్రాసివుంది గదా? దేవుని వాక్యమైన సువార్తలలో! మరి ఈ హెరాడ్‌రాజు కాలం ఎప్పడిది?

## హెరాడ్ కాలం :-

దీనికి ప్రాచీన హీబ్రూచరిత్ర, రోమ్‌చరిత్రా, తెలిపే ప్రమాణ గ్రంథాలను అన్వేషించాలి. ఈచరిత్రను తెలిపేది, గిబ్బన్ (Gibbon) రాసిన రోమ్ "సామ్రాజ్యవినాశము పతనము" అన్నదొకసాక్ష్యాధారం. దీనికన్నా ప్రాచీనమైనవి సమకాలిక రచనలు. ప్లీని (Pliny the elder and Pliny, younger) చేసిన రచనలు ఇంకా సెనికా (Seneca) సోక్రటీస్... ప్లేటో (Plato)

వంటివారి రచనలు ప్రాచీన రోమన్ గ్రీకు చరిత్రను తెలిపేవి! ఇందులో జీసస్‌కన్నా ఎంతో ప్రాచీనమైనవారి జనన కాలము తేదీ నెలా అన్నీ లభిస్తున్నాయి! ఒక్క జీసస్‌కే ఇవి, లభించటంలేదు! ఉదాహరణకు అలెగ్జాండర్ అనే గ్రీకు సేనాని జీసస్ కంటే 356 సంవత్సరాలు ప్రాచీనమైనవాడు! అయినప్పటికీ ప్లూటార్క్ (Plutarch) మహాశయుడు - 'అలెగ్జాండర్ పుట్టింది 22, జూలై, 356 B.C. అర్ధరాత్రి 10-12 మధ్యన' - అనీ ఇతడి తండ్రి ఫిలిప్ అనీ! నిర్దుష్టంగా చారిత్రకమైన రికార్డుతో నమోదు చేశాడు!

అలానే ఎంతోమంది రోమన్ చక్రవర్తుల జనన మరణ కాలాలు కూడా, పక్కా చారిత్రక రికార్డుతో లభిస్తున్నాయి! యాంటిపేటర్ (Antipater) రాజు మరణించిన 34 ఏళ్లకు జీవించాడనీ, అది రోమనుల ఒలింపియాడ్ సంవత్సరం 184వ ఏడుకు సరియైన 37 B.C. లో మరణించాడని చరిత్ర రాస్తున్నది!

## జీసస్ పుట్టక ముందే - హెరాడ్ మరణం :-

జీసస్ పుట్టకముందే హెరాడ్‌రాజు మరణించినట్టు చరిత్ర చెపుతుంటే - సువార్తలలోని కథలు - హెరాడ్ పసిపిల్లలను చంపించినట్టు రాయబడినది - అబద్ధమని దీనివల్ల తేలుతోంది!

యూదుల చరిత్రకారులైన జోసఫస్ (Life of Josephus, Book 17 - 13 Book 18. C C.I. Sec-1) హెరాడ్ రాజు జీసస్ పుట్టడానికి చాలాకాలం ముందే మరణించినట్టు నిర్ధారణచేశాడు!

## ల్యూక్ (LUKE) 'సువార్త' సాక్ష్యం :

దేవుని వాక్యం అని నమ్మే సువార్తలో ల్యూక్ (Luke) రాసిన సువార్తలో జీసస్ కాలంలో అగస్టస్ సీజర్ శాసనం ప్రకారం సైరీనియస్ (Cyrenius) సిరియాకు గవర్నరుగా పాలిస్తూ పన్నులు విధించమన్న ఆజ్ఞను అమలుచేసినట్టు సువార్త ఈక్రింది వాక్యాలలో రికార్డు చేస్తున్నది!

"And it came to pass in these days, that there went out a decree

from Ceasar Augustus, that all the world should be taxed and this tax, was first made where Cyrenicus was the Governor of Syria"

–Luke (II1-2)

పై చారిత్రకాధారబట్టిచూడగా ఆకాలంలో సైరీనియస్ అనే గవర్నరు అసలు సిరియాలో లేనేలేడు! అంతేకాదు సాటర్నియస్ (Saternius) వలూమియస్ (Volumius) అనేవాళ్లే సిరియాకు పాలకులుగావున్నారు! వీరితర్వాత ఎంతోకాలానికిగాని సైరీనియస్ గవర్నర్‌గా రాలేదు! అప్పటికి హెరాడ్ కాలమూ జీసస్ పుట్టినట్టు రాసిన చరిత్రా దాటిపోతాయి! కాబట్టి ల్యూక్ సువార్తలలోని పై విషయం కూడా చారిత్రకంగా అసత్యమైందని ఋజువైంది! ఇలాంటి చారిత్రక సాక్ష్యాలకోసం సువార్తలను గాలించిన బైబుల్ పరిశోధకులు చివరకు ప్రాణం విసిగి -

## 'సువార్త'లు చరిత్రకాదు :-

"నిజం చెప్పాల్సివస్తే 'సువార్త'ల్లో చారిత్రక సత్యం ఉందని నమ్మేవారికన్నా నమ్మనివారే యూరప్‌లో ప్రస్తుతం కాన్‌స్టైంటైన్ రాజు కాలంనుంచీ పెరుగుతూ వస్తున్నారు!"

"The truth of the Gospel history is now more widely doubted in Europe that at any time since the conversion of Constantine."

పై సువార్తలలోని అంశాలు చారిత్రకంగా బెడిసికొట్టాయి! జీసస్ సమకాలికులు జస్టస్ టైబిరియస్ (Justus Tiberius) ఇంకా పోంటియస్ (Pontius) ఫిలోజుడేరియస్ (Philo Judareous) అనేవారు ఎక్కడా జీసస్ అనేవ్యక్తి ఒకడు, ఎక్కడా జన్మించినట్టుగాని, అతడిని చంపడానికి హెరాడ్‌రాజు ప్రయత్నించినట్టుగాని వ్రాయలేదు; లేదా అలాంటి వ్యక్తి జనన మరణాలు రిజిస్టరులోగానీ, ఎక్కడా నమోదుకాలేదు. ఈ విషయాన్నే ఈక్రింది వాక్యాలలో తేల్చారు!

"The Chronology of the kings of Judah, which succeeded one

another." this (Jesus) comes out of the city of Tiberius in Galilee. He begins his history from Moses and ends it not till the death of Agrippa (A.D. 43) the seventh Ruler of the Jews; who took the Government under Claudius, had it augmented under Nero, and still more augmented by Vespasaion. He died in the 3rd year of Trajan, where also history ends. He is very concise in his *description* to be insisted on : and being under the Jewish prejudices, as indeed he was also a Jew by birth, *he makes not* the *least mention* of the *appearance of Christ* or what things happened to him, or of the wonderful works that he did."

- Life of Josephus (Sec. 65 Note)

పై మాటలకి అర్ధం "పోంటియస్" రాసిన జోసఫస్ జీవితచరిత్ర గ్రంథంలో ఇలా రాస్తున్నాడు!

"నేను జస్టస్ టైబీరియస్ రాసిన చరిత్ర వంశావళిని చదివాను; అందులో జూడాను పరిపాలించిన రాజులు ఒకరితర్వాత ఒకరుగా వర్ణించబడ్డారు. ఈ జస్టస్ గెలీలిలోని టైబిరియస్ నగరంనుండి వచ్చినవాడే! ఇతడు తన చరిత్రను మోసెస్‌తో ప్రారంభించి అగ్రిప్పా (43. AD) వరకూ 7వ రాజుదాకా కూడా రాసి నీరోకాలంతో పూర్తిచేశాడు! ఇతడు ట్రాజిన్ తర్వాత మూడేళ్లవరకూ జీవించాడు! ఇతడు జన్మత: యూదీయుడు! వారి సాంప్రదాయాలూ మత విషయాలూ తెలిసినవాడు! అయినప్పటికీ జీసస్ జన్మించడం గురించిగాని, అతడి ఊసేమీకాని కొంచెమైనా ఎత్తుకోలేదు! జీసస్ చేసిన మహిమలవంటివి కాని, అతడికి జరిగిన ఏ విషయంగురించి గాని ఇతడి చరిత్రలో మచ్చుకైనా రాయబడలేదు!"

- జోసఫస్ జీవితచరిత్ర (65 పేజీ నోట్సు)

ఇది జీసస్ సమకాలికులైన యూదీయుల రోమనుల చారిత్రక సాక్ష్యం! దీనివల్లనే యూరప్‌లో అనేకమంది అసలు జీసస్ అనేవ్యక్తి

చారిత్రకంగా నిజంగా జీవించి ఉన్నవాడేనా? లేక సువార్తలు పుక్కిటి పురాణాలా? లేక, జీసస్ కల్పిత గాథలలోని అవాస్తవికవ్యక్తియా? అన్న సందేహం చరిత్రలో నిర్ధారణ అవకపోవడానికి కారణం!

## జీసస్ ఊసే లేదు:-

ఇకపోతే జీసస్‌ను శిలువవేశారని ఈనాటి క్రైస్తవ ప్రపంచమంతా నమ్మబలికే గాథలో ప్రధానవ్యక్తి రోమన్ గవ్నరర్ పోంటియస్ పిలాతు (Pontius Pilate) బైబుల్ ప్రకారం "ఇతడు జీసస్ సువార్తలు లభించిన రాష్ట్రములను పరిపాలిస్తుండేవాడు" అని సువార్తలు చెప్తున్నాయి. ఇతడు చరిత్రలో రోమన్ చక్రవర్తికి పంపిన రిపోర్టులన్నీ ఒక రిజిస్టరులో రాయించేవున్నాడు! ముఖ్యమైన తీర్పులు శిక్షలు అన్నీ అందులో విధిగా ఒక ప్రభుత్వ అధికారిగా రోమన్ జడ్జిగాతాను ఇచ్చిన తీర్పులన్నీ రిపోర్టుగా పంపేవాడు!

అన్నిటికన్నా ఆశ్చర్యం!!! ఈ రిపోర్టులో "జీసస్"అనే పేరుగాని, జీసస్ అనేవ్యక్తి ఒకడు అసలు తనకాలంలో జీవించివున్నట్టు ప్రసక్తిగాని, అలాంటి మతబోధకుడొకడు ఉన్నట్టు భోగట్టాగాని, అతడు మహిమలు చేసినట్టుగాని, చివరకు జీసస్‌ను తానే శిలువవేసి మరణించే శిక్ష విధించాననే మాటగాని, ఎక్కడా కనిపించదు! చారిత్రకంగా జీసస్ యొక్క ఉనికి ఋజువు చేసే సాక్ష్యాల విషయంలో సువార్తలు ఘోరంగా విఫలమై, చారిత్రకంగా నిరాధారమైనవని పై విధంగా ఋజువైనాయి!!!

సువార్తలలోని జీసస్ గాథలో కనిపించే ఆఖరి విషయం శిలువవేయబడటం. ఆ సమయంలో మహిమలు కనిపించటం, పట్టపగలే చీకటి వ్యాపించిందనీ, భూమి కంపించిందని ఇలాంటివెన్నో సువార్తలలో బైబుల్‌లో కనిపిస్తాయి! ప్రత్యేకంచి, జాన్, ల్యూక్, మత్తై సువార్తలలో!

సమకాలిక చారిత్రక రచనలలో సరిగ్గా అదే సంవత్సరంగాని దానికి

ముందువెనుకలుగా గాని, ఇలాంటివేవీ జరిగినట్టు కనిపించే సాక్ష్యం మందులోకికూడా ఎక్కడా లభించలేదు! ఈవిధంగా జీసస్‌యొక్క ఉనికికి, ఋజువులో చారిత్రకంగా ఘోరంగా విఫలమైంది! ఈ కారణంచేత యూరప్ వంటి దేశాలలో జీసస్‌కథను ఒక చారిత్రకసత్యంగా అంగీకరించనివారే మెజారిటీ!

## జీసస్‌ను నమ్మనివారు :

దీనికితోడు యూరప్ అంతటా జీసస్ అనేవ్యక్తి నిజమైన చారిత్రక యదార్థం కాదని క్రైస్తవఫాదరీలచే కల్పించబడిన కట్టుకథల వంటి కల్పితవ్యక్తి అని అరేబియన్ నైట్స్‌లోని అల్లాద్దీన్ కథలోలాగా చదివి ఆనందిస్తారే గాని, దాన్ని ఒక చరిత్రకింద జమకట్టరు! ఇలా నమ్మేది ఒక్క భారతీయ క్రైస్తవులే!!!

ఇన్ని విషయాలు చారిత్రకంగా నిరాధారంగా కనిపిస్తూవుంటే ఒక్క జీసస్ సమాధి గురించే బైబుల్‌లో ఎందుకు రాయలేదు అని ఆశ్చర్యపడటం వ్యర్థం! ఇకపోతే జీసస్ శిలువపై మరణించాడా? లేదా? మరణించివుంటే ఆయన సమాధి కాశ్మీరులో ఎలావుంది? జీసస్ అసలైన జీవిత చరిత్ర ఎక్కడైనా రహస్యంగా సువార్తలలోని కల్పితకథలు లేకుండావున్నది లభిస్తోందా? ఈ ప్రశ్నలన్నీ రానున్న అధ్యాయాలలో పరిశీలిద్దాం! చరిత్ర సమాధానాలకై!!



# 3

# జీసస్ జాతకంలో 'బెత్లెహెం - నక్షత్రం' - ఖగోళ పరిశోధన !

బైబుల్‌లో సువార్తల ప్రకారం జీసస్ పుట్టేముందు ఒక కొత్త నక్షత్రం కనిపించింది! దానిని చూసి మహాత్ములైన ఏడుగురు జ్ఞానులు (Seven Wise men - Magi) జీసస్‌ను దర్శించటానికి బెత్లెహెం వచ్చి బాల జీసస్‌ను దర్శించి వెళ్లినట్టుగా వున్నది!

ఆధునిక సైన్సు ప్రకారం సూర్యుడు గ్రహ మండలం (Solar System) నియమితమైన కక్ష్యలలో పరిభ్రమిస్తూవుంటాయి! నక్షత్రమండలంలో మార్పులు-అందులోనూ కొత్త నక్షత్రం కనిపించటం అనేది ఒక అపూర్వమైన విషయం! బైబుల్ పరిశోధకులైన పాశ్చాత్య జ్యోతిష్కులు సెఫీరియల్, (Sephariel) కెప్లర్, (Kepler) సిరిల్‌ఫేగన్ (Cyril Fagan) వంటివారు ఈ నక్షత్రాన్ని గణితం చేయడానికి ప్రయత్నించారు! వారి పరిశోధనల్ని

ఏమంటున్నాయో చూద్దాం!

సెఫేరియల్ (Sepharial) లెక్క ప్రకారం "ఉత్తరాభాద్ర" (Antromeda) నక్షత్ర మండలంలో (galaxy) ఒక కొత్త నక్షత్రం **400** B.C. సంవత్సరంలో కనిపించి వుండవచ్చుననీ ఈ నక్షత్రం ఆకాశంలో కనిపించిన రోజునుంచీ వెలుగు, మరింత హెచ్చుతూ చివరికి ఆర్ద్రా నక్షత్రం కంటే కూడా హెచ్చు వెలుతురుతో ప్రకాశించిందనీ చెప్పాడు! ఈ నక్షత్రం మాయమై, తరువాత కాలంలో కూడా మళ్లీ కనిపించింది!

## 'కొత్త' నక్షత్రం :-

గతంలో టైకో బ్రాహె (Tycho Brahe) **1572** A.D. సంవత్సరంలో కనిపించిన ఈ "కొత్త నక్షత్రాన్ని" గుర్తించాడు. ఇదే జీసస్ పుట్టినపుడు గతంలో కనిపించి మాయమైన నక్షత్రం అని కూడా అభిప్రాయపడి ("Star of Bethlehem") అని ఈ నక్షత్రానికి ప్రసిద్ధనామం అతడి వల్నే ఏర్పడింది! (Tycho brahe) ఈ నక్షత్రం 'కదలిక'లను గణితం చేసి ఇది గతంలో కూడా **1264** A.D. సంవత్సరంలో కనిపించి, అలానే **945** A.D. లోనూ కూడా కనిపించిందని ఆయన నిర్ధారించాడు! టైకో కాలంలో కనిపించిన ఈ నక్షత్రం అంతకంతకు మరింత ప్రకాశంగా వెలుగుతూ చివరకు పట్టపగలే కనిపించిన చుక్కవలే ప్రపంచ దృష్టి నాకర్షించింది!

ఆ తర్వాత కాలంలో ప్రఖ్యాత ఖగోళ సైంటిస్ట్ 'సర్-జాన్ హెర్షెల్' (Sir John Herschel) ఈ నక్షత్రం తిరిగి **1872** A.D. లో కనిపిస్తుందని చెప్పాడు! కాని, ఆ సంవత్సరంలో ఈ నక్షత్రం కనిపించ లేదు! సైన్సు వారి పరిశోధన విషయం ఇలా వున్నది! ఇక బైబుల్‌లోని వర్ణనను బట్టి చూస్తే జీసస్‌ను దర్శించడానికి వచ్చిన జ్ఞానులు (Wise men)

**"We have seen his Star in the East, and have come to worship Him."**

అన్నారని వున్నది! ఆకాశంలో నక్షత్రమైతే చూడవచ్చు! కాని ఆ నక్షత్రం వారిని జీసస్ పుట్టిన 'బెత్లెహెం' గ్రామానికే సరిగా వచ్చేలాగా వారిని తీసుకొచ్చేలాగ వెలిగి కనిపించిందని "సువార్త"లలో రాసిన విషయం

ఎలాగ సాధ్యం? ఆకాశంలోని నక్షత్రం తాలూకు మహాత్ముడు ఎక్కడో జన్మించి వుండాలని ఊహించవచ్చు.

ఇది ఒక సమస్య! దీనిని సమన్వయం చేసే ప్రయత్నంలో (బ్రిటిష్ జ్యోతిష్కుడు సెఫేరియల్ (Sapherial) ఈ నక్షత్రం కనిపించిన 'అక్షాంశము' లనుబట్టి అది $32^0$ N లో సరిగ్గా జ్యూడియా (Judea) పైన వెలిగిందని ఈనాటి భూగోళిక గణితంలో 'బెత్లెహెం' గ్రామంయొక్క అక్షాంశంలో $31^0$-43' N నార్త్‌తో సరిగ్గా వుందని టైకో (Tycho Brahe) కనుగొన్న నక్షత్రంతో ఇది సరిపోతున్నదని కనుగొన్నాడు!

దీనినిబట్టి జీసస్‌ను దర్శించడానికి వచ్చిన 7-గురు, 'జ్ఞానులు' (Wisemen) జ్యోతిషంలో గొప్ప ఉద్దండులై వుండాలి! అంతేకాదు జీసస్‌కి **1500** B.C. సంవత్సరాల ముందువాడైన గౌతమ బుద్ధుడు భారతదేశంలో వైశాక శుద్ధ పూర్ణిమనాడు జన్మించాడనీ - ఆయన జన్మించేముందు ఆకాశంలో ఒక పెద్ద నక్షత్రం ప్రకాశవంతంగా వెలిగిందని పురాతన తాటియాకుల గ్రంథాల్లో వున్నది!

దీనిని హిమాలయాలపై తపస్సు చేసుకునే సాధువులు చూసి - "మహాత్ముడైన బుద్ధదేవుని జననం జరిగిందని గుర్తించారు! చైనాలోని యోగులుకూడా ఈ నక్షత్రం హిమాలయ శిఖరాలకు దక్షిణంవైపు లోయ ముఖంపైగా వంగి 'దక్షిణరేఖ అక్షాంశంపై (Lat. S) వెలిగిందని - కాబట్టి ఆయన భారతదేశంలోనే అవతరించబోతున్నాడనీ గ్రహించారు!

గౌతమ బుద్ధుని జననానికి చారిత్రకమైన రికార్డు సమకాలికమైన సాక్ష్యాధారాలు లభిస్తున్నాయి! గౌతమ బుద్ధుడు జన్మించిన తిథి కూడా "వైశాఖ శుద్ధ పూర్ణిమ' అని 'విశాఖా-నక్షత్రం'లో అని, సింహ లగ్నంలో బుద్ధదేవుడు అవతరించాడని టిబెట్, చైనా, నేపాల్‌దేశాలలోని ప్రాచీన గ్రంథాలలో రికార్డు లభిస్తోంది! ఆరోజు సరిగ్గా ఖగోళ సైన్సు పరిశోధన

**Note :** గౌతమబుద్ధుని కాలం - బ్రిటిష్ చారిత్రకులు కావాలని తగ్గించారని అసలైన కాలం - అని నా డాక్టరేట్ 'తీసెస్' లో నిరూపించాను

చేసి నేను 10-మార్చి-1887 B.C.** లో జరిగిందని కనుగొన్నాను.

కాని జీసస్ జననం మాత్రం సరిగ్గా ఏ సంవత్సరంలో జరిగిందో ఏ నెలలో జరిగిందో, పరిశీలిద్దాం అని ప్రయత్నిస్తే కనీసం అది జెరూసలేం ప్రాంతంలోనైనా అటువంటి వ్యక్తి ఒకరు జన్మించినట్టుకాని, మహిమలు చేసినట్టుకాని లేక శిలువపై శిక్షననుభవించినట్టుకాని, చరిత్రలో రికార్డు లేక సాక్ష్యాధారం ఏదైనా లభిస్తున్నదా? అన్న చరిత్ర పరిశోధకుల దృష్టితో జీసస్ జననకాల గ్రహస్థితులు తెలిపే - "జీసస్ - జాతకం" గురించి ఇక్కడ తెలుసుకుందాం?

చాలా మంది ఒక కొత్త నక్షత్రం కనిపించడమనేది సైన్సుకు తెలిసిన ఈ విశ్వంలో - దాదాపు అసంభవమని భావిస్తారు! ఎందుకంటే సైన్సు అత్యాధునిక టెలిస్కోపుల సహాయంతో ఈ విశ్వాన్ని ఆమూలాగ్రంగా పరిశోధించితే, లిస్టు వేస్తే ఇంక కొత్త నక్షత్రాలు ఎక్కడ నుండి వస్తాయి? ప్రతీ నక్షత్రానికి సైన్సు భూగోళం మీద డిగ్రీలతో నగరాలను పల్లెలను అట్లాస్ మేప్ మీద గుర్తించినట్టే-ఆకాశంలో వున్న ప్రతీ నక్షత్రం సైన్సుచే గుర్తించబడి వున్నది కదా! అలాంటప్పుడు ఇంకా "కొత్త నక్షత్రం" ఆకాశంలో కనిపించడమనేది అసంభవం! లేక ఊహాగానం అని వీరి వాదం!

అతి ప్రాచీన పురాణాలలో శ్రీకృష్ణ భగవానుడు అవతరించే సమయానికి అర్థరాత్రి నడిజామున 'సప్తర్షి మండలం' మధ్యగా ఒక 'కొత్త నక్షత్రం' కనిపించిందనీ, ఆ సమయంలో హిమాలయాలలో తపస్సు చేసుకుంటున్న ఋషీశ్వరులు శ్రీమహావిష్ణువు యొక్క అవతారం భూమిమీదకు దిగి వస్తున్నదని గుర్తించారని రాసి వున్నా...

లేక 1531 B.C. ప్రాంతంలో ఆకాశంలో ఒక కొత్త నక్షత్రం హిమాలయ పర్వతాలపై కనిపించిందని ఆ సమయానికే, బుద్ధ దేవుని

**Note : **** దీని పూర్తి వివరాలు **"ASTRONOMICAL DATING OF THE MAHA BHARATA WAR"** మహాభారత కాల నిర్ణయం" అన్న నా సంస్కృతంలో డాక్టరేట్‌కు పరిశోధనా గ్రంథం చూడవచ్చు **("Corroboration from Sanskrit Literature" (p227)** లో చూడవచ్చు.

అవతారం వచ్చిందని వ్రాసినా...

లేక రాబోయే 1999 'కలియుగాంతం'లో వచ్చే కల్కి భగవానుని అవతరణ సమయానికి నూరేళ్లవారలో ఒక కొత్త నక్షత్రం కనిపిస్తుందని భాగవతం, విష్ణుపురాణంలో రాసినా... ఇవన్నీ భక్తి విశ్వాసాలు కలవారి ఊహాగానాలులే అని విదేశీయులు కొట్టివేశారు!

అలాటిదే జీసస్ జన్మించే సమయానికి "ఆకాశంలో ఒక కొత్త బెత్లెహేం నక్షత్రం (Star of Bethlehem) కనిపించిందని రాయడంలో కూడా క్రైస్తవ ఫాదరీలు పురాణాలలోని సంప్రదాయాలనే జీసస్ కథలలోనూ చొప్పించారని రష్యన్-యోగిని, పరిశోధకురాలు "బ్లావెట్స్కీ" తన పరిశోధనల్లో కనుగొన్నారు.

... ఎందుకంటే సైన్సు ప్రకారం 'సరిక్రొత్త నక్షత్రం కనిపించడం అసాధ్య విషయమని' వీరి వాదన! ఈ వాదనలకు ప్రతివాదనలూ మళ్లీ వీటికి పిడివాదాలూ-వాటి వల్ల ప్రయోజనముండదు! నిజంగా జరిగిన యదార్ధ విషయాలను వీటిని ప్రఖ్యాత లండన్ వార్తా పత్రికలు ప్రచురించిన ఈ క్రింది "వార్త" అనేక మందికి కళ్లు తెరిపిస్తుందేమోనని ఈ ఆశ్చర్యాన్ని మీ ముందుంచుతున్నాను! ఇది, మన కాలంలో జరిగిన వింత!

కొత్త నక్షత్రం కనిపించింది:-

ప్రఖ్యాత లండన్ దినపత్రిక - టైమ్స్' (Times) **12-6-1918లో** ప్రచురించిన ఈ క్రింది వార్తలో ఇలా వ్రాసింది.

"The appearance of a New Star in the constellation of Aquila, to which the Astronomer Royal (Sir Frank Dyson) drew attention in 'The Times' of Monday, has excited a great deal of interest. The present is certainly the most brilliant temporary Star that has shown in the firmament since the celebrated one in 1604. The New Star will assuredly form one of the Chief astronomical events of our time." అంటే దీని తాత్పర్యం "బ్రిటిష్ ప్రభుత్వంలోని ప్రభుత్వ ఖగోళ శాస్త్రజ్ఞుడైన 'సర్ ఫ్రాంక్ డైసన్' (Sir Frank Dyson) 'టైమ్స్' పత్రికలో ప్రచురించిన ప్రముఖమైన వార్త ఒక కొత్త నక్షత్రం ఆకాశంలో కనిపించడం, అది

శ్రవణా నక్షత్రం (Aquila) లో కనిపించిందన్న విషయం-నిశ్చయంగా మన శతాబ్దంలోని ప్రధానమైన ఖగోళ విశేషం! ఇది ప్రస్తుతం మన మానవ చరిత్రలో ఒక కొత్త మార్పుకై ఎదురు చూస్తున్న సమయంలో ఈ నక్షత్రం కనిపించడం ఆశ్చర్యమైన విషయం! గ్రీన్‌విచ్‌లోనే ఈ విషయాన్ని ధృవపరచడంతో పాటు అనేక మంది కళ్లకు ఈ కొత్త నక్షత్రం కనిపించడం ఒక గొప్ప భవిష్య సూచన (Portent)! ఇంకా ఏం చెప్పగలం? ప్రపంచంలోని ధర్మ అధర్మాలకూ మధ్య జరిగే పోరాటంలో సత్యానికీ, ధర్మానికీ విజయం లభిస్తుందని సూచించే శకునమని అనుకోవచ్చా?

"గతంలో మానవజాతికి "బెత్లెహెం నక్షత్రం" కనిపించడం ఎలాంటి శుభసూచకమో నిరాశా నిస్పృహలతో కుంగి వున్న మానవులకు ఆశావెలుగో, దానికి ఫలితంగా జీసస్ క్రీస్తు పుట్టాడని రోమన్ కేథలిక్ ప్రపంచానికి ఎలాంటి నమ్మకమో, అలానే ఈనాడు కనిపించే 'శుభం'-ఏదో ఒక ప్రభుత్వానికో ఒక దేశానికో కాక, యావత్ మానవజాతికీ శుభ సంకేతమని భావించాలి!" అంటూ గురువారం **12** జూన్, **1918** నాటి లండన్ టైమ్స్ పత్రిక ఈ కొత్త నక్షత్రం కనిపించిన వార్తను తలకట్టు వార్త (Head lines news) గా ప్రచురించింది! ఇదే విషయాన్ని ప్రఖ్యాత బ్రిటీష్ జ్యోతిష్కుడూ ప్రపంచ భవిష్యత్తును యథాతథంగా ముందే, దర్శించి ప్రచురించిన 'కీరో' (Cheiro) మహాశయుడు కూడా...

"A New Star and one of the first magnitude appeared suddenly in the constellation of Aquila (The Eagle) on the night of Saturday 8th June, 1918, about the time when the American Troops commenced their entry into the war." పై యదార్థ విషయాన్ని ప్రచురించిన లండన్ టైమ్స్ పత్రిక వార్త మన కాలంలో కూడా, ఒక కొత్త నక్షత్రం కనిపించడాన్ని యథార్థమని ఇలా ఋజువు చేస్తున్నది!

"A great White Star has swam into our ken and it comes at a moment when humanity is looking for a 'new world'! Certainly a new star of the First magnitude, discovered by several eyes at once and promptly vouched for by Greenwich, is a Portent! Can we say more?

May we hail it, as an omen of Victory in the great struggle between Might and Right? Would that we could. When in 1572 Tycho Brahe observed a new abd brilliant Star which shole like Jupiter, that star ushered in the most brilliant period of English History. And perhaps this new Star which is believed to be perfectly stellar is an event in the threshold of our New Age. Surely here, for the mystic mind, is an intimation of hipe, not to this monarch or that, nor even to that nation or this, but to mankind at large, even as the "Star of Bethlehem" was an intimation that a new era was opening for the wearied sons of men. The parable that moment of birth of Christ when the Roman world is again at turning point. Cheiro - "Cheiro's World Predictions" (Ch. Origin of United States) (P 101-102)

ఇక పరిశోధకులు చేయవలసిందల్లా గతంలో కొత్త నక్షత్రం కనిపించిన సమయమూ అలానే అవతార పురుషులు, దివ్య పురుషులు అవతరించిన చారిత్రక సాక్ష్యాధారాల సహాయంతో వారి యొక్క యదార్థమైన చారిత్రక కాలమును, ఖగోళ సైన్సు ప్రకారం లెక్కించాలి! అప్పుడే యధార్థమైన సైన్సు పరిశోధనవల్ల గతంలోని మత గ్రంథాలలోని విషయాలలోని సత్యాలని ఋజువు చేసినట్టూ అవుతుంది!

ఈ దృష్టితో జీసస్ జన్మించినట్టు భావించే-డిసెంబర్ 25నాడు, లేక క్రిస్మస్‌న నిజంగానే కొత్త నక్షత్రం కనిపించిందా! లేక కొత్త నక్షత్రం యధార్థంగా కనిపించిన తేదీని టైమునూ మనం పరిశోధనతో పట్టుకోగలమా? అని పరిశీలిద్దాం!

ముందుగా జీసస్ జాతకమూ' క్రిస్మస్‌నాడు జీసస్ జననమూ చారిత్రక సాక్ష్యాల్ని గురించి పరిశోధనా దృష్టితో పరిశీలిద్దాం!



4

# జీసస్ - 'క్రిస్టమస్' నాడు - పుట్టలేదా?

ప్రపంచమంతా క్రిస్టమస్ పండుగ డిసెంబర్ 25న జరుపుకుంటారు గదా? ఏసుక్రీస్తు అవతరించిన జన్మదినంగా ఈ క్రిస్టమస్ పండుగరోజును యావన్మంది క్రైస్తవులూ ప్రధాన పండుగగా జరుపుకోవడం అందరికీ తెలిసిందే! ఈ క్రిస్టమస్ సందర్భంగా యూరప్‌లో సైంటిఫిక్ పరిశోధకులు గత 75 సంవత్సరాలుగా చేసి తమ పరిశోధనలలో ఏసుక్రీస్తు జననం గురించి ఆశ్చర్యకరమైన సైన్సు రహస్యాలను కనుగొన్నారు. ఇందులో చాలా మటుకు ఇంకా క్రీస్తు జీవితంపై ఆక్తిగల అనేకమంది మేధావులకూ మన భారతీయ క్రైస్తవులకూ కూడా తెలియవో అవి మీకు పరిచయం చేస్తాను.

## క్రీస్తు పుట్టింది - డిసెంబర్-25 న కానే కాదు! :-

ఇందులో ముఖ్యమైన విషయం - క్రీస్తు మహాశయుడు జన్మించింది, ఇప్పుడు మనం గా జరుపుకునే 25-డిసెంబర్‌న కానేకాదు!!! ఈ సంగతి క్రీస్తు గతచరిత్రపై అనేక ఆశ్చర్యకరమైన విశేషాలను త్రవ్వి తీసిన 'విల్ డ్యూరాంట్' అనే అమెరికన్ చారిత్రక పరిశోధకుడు కనుగొన్నాడు.

## జీసస్ - డిసెంబర్‌లో పుట్టలేదా?

మరైతే క్రిస్మస్ పండుగ 25 - డిసెంబర్‌నే జరుపుకోవడం ఇన్నేళ్లుగా ఎలా వచ్చింది? అన్న ప్రశ్న తలెత్తుతుంది.

క్రైస్తవమత చరిత్రలో మొదటగా క్రైస్తవమతం రోమ్‌లోని కేథలిక్కుల మతపీఠాధిపతి అయిన 'పోప్'ల ప్రచారం వల్లనే మొదలైంది.

'డయోనీసియస్-ఎగ్జిగస్ (Dionysius Exigus) అనే క్రైస్తవ సన్యాసి తన కాలంలో రోమ్‌లో జరిగే 'శాటర్నేలియా' (Saturnalia) పండుగనాడు వేలాదిమంది జనం తిరునాళ్లుగా గుంపుగా చేరుతారని, సరిగ్గా అదేరోజున క్రీస్తు జన్మదినంగా గనక ప్రకటిస్తే, అది క్రైస్తవమత ప్రచారానికి సహాయపడుతుందని తోచి దాంతో అప్పటిదాకా 'శాటర్‌నేలియా' (Saturnalia) పండుగ దినమైన డిసెంబర్ 25ను క్రీస్తు జన్మదినంగా మార్చివేశాడు!!!

## క్రీస్తు శకం - మొదలైంది ఎప్పట్నుంచి?

ఈనాడు ఇంగ్లీషు చదువుకునే మనమంతా 'క్రీస్తుశకం' (Christian Era) అనబడేది O - B.C. నుంచి ప్రారంభమైంది కాదు! దాన్ని ఆధారంగా చేసుకొని మిగతా మతాలపై పరిశోధించి వేదాల, పురాణాల కాలనిర్ణయంచేసి తేదీ నిర్ణయించాలనే యూరప్ ప్రొఫెసర్ల ప్రయత్నం చూడగా, అసలు క్రీస్తు జన్మించినట్టు ప్రచారంలో ఉన్న 25-12-O.B.C. అన్న తేదీయే తప్పు అనీ, అది నిజంగా 4-B.C. గా అయివుండవచ్చుని తేల్చిన సర్ జాన్ కెప్లర్

★ చూ: "Fundamentals of Astrological science. Prediction relating to "Brith of Christ" (1620 AD. - Johann Kepler.
see "Johann Kepler 1571-1630 Ed. A.S. Eddington

(Sir John Kepler) మహాశయుడు అగాధమైన పరిశోధనచేసి "ఏసుక్రీస్తు జాతకం" (Nativity of Jesus) అనే రచనను చేశాడు. అది ఈనాటికీ మనకు లభిస్తోంది.*

## జీసస్ జాతకం!!

క్రీస్తు పూర్వంనాటి గ్రహస్థితులను "కెప్లర్" (Kepler) గుణించి అందులో సరైనదని తోచిన 4-B.C. నాటి గ్రహస్థితుల ఆధారంగా ఏసుక్రీస్తు జాతకం తయారు చేసాడు. అది మన జ్యోతిషశాస్త్రం ప్రకారం గణితం చేసి ఈ క్రింది కుండలిలో ఈ క్రింది విధంగా చూడవచ్చు:

| | | | |
|---|---|---|---|
| చం 6°-41'<br>గు 23°-17'<br>శని 21°-47' | | కేతు | |
| 23°-17'<br>కుజ | జీసస్ జాతకం<br>25-12-7 B.C.<br>శుక్రవారం రాత్రి<br>10-18 PM | | |
| | | | |
| సూర్య 7°-59'<br>బుధ 15°-58' | శుక్ర 23°-11<br>14-8-21, రాహు | | 5°-21'<br>లగ్నం |

**(Lat 31°-43'N Long 35°-13 E) నాటి గ్రహస్థితి అయనాంశ 5°-27°**

**0° 35'- అక్షాంశం (బెత్లెహెం) 31° lat - 43N. Long - 35°-15' E**

**ఉత్తరా భాద్ర నక్షత్రం జననకాల శని మహాదశా శేషం**

## క్రీస్తు తర్వాత వెయ్యేళ్లకు "క్రీస్తుశకం"?

ఆశ్చర్యంగాలేదూ! ఏసుక్రీస్తు జన్మించిందని భావింపబడుతున్న "క్రీస్తుశకం" ప్రారంభించింది ఒక రోమన్ సన్యాసి 'డయోనీసియస్' (Dionycius) మహాశయుడే! అతడే ఈనాటి క్రీస్తుశకాన్ని కల్పన చేసి ఈనాడు మనం అంతా క్యాలెండర్‌లో వాడే జనవరినుంచీ 12-మాసాలు

గల 'క్రైస్తవ క్యాలెండర్' ను తయారు చేశాడు.

అంటే దీనివల్ల మనకు తెలుస్తున్న మహాసత్యం ఏమిటి? క్రీస్తు మరణించిన **1000-సంవత్సరాల తర్వాతే ఈనాటి క్రీస్తుశకం స్థాపించబడిందని!!**

అంతకన్నా ఆశ్చర్యకరమైన మరో విషయం ఈ "క్రీస్తుశకం" ప్రారంభించిన తేదీ ఏసుక్రీస్తు జన్మదినం - రోమన్ల పండుగ 'శాటర్నేలియా' పండుగ రోజున రోమన్ సన్యాసుల చేత **1020**A.D.లో మొదలు పెట్టబడింది!!

## "క్రీస్తు పూర్వమే" (B.C.లోనే) క్రీస్తు జననం?

మూడవ ఆశ్చర్యకర విషయమేమిటంటే క్రీస్తు మహాశయుడు జన్మించిన సంవత్సరం కూడా - "క్రీస్తుకు పూర్వమే" అంటే B.C. (Before Christ) లోనేనని క్రైస్తవ బిషప్పుల నిర్ణయం!!!

ఇంకొక ఆశ్చర్యకరమైన సత్యం - జీసస్‌యొక్క నిజమైన 'జనన తేది' ఇదమిద్ధమని ఎవరికీ తెలియదని!!! అంతేకాదు క్రీస్తు ఫలానారోజున జన్మించాడని తెలిపే చారిత్రక రికార్డుగాని, లేక క్రీస్తు జన్మించిన 'బెత్లెహేము' నగరంలో గాని, ఆ సమీప నగరాల్లోగానీ జననమరణాల రికార్డులలోగాని, చారిత్రకంగా ఎక్కడా 'జీసస్' లేదా ఏసుక్రీస్తు అనేవ్యక్తి అసలు జన్మించినట్టే చూపగల రికార్డుగాని సాక్ష్యాధారాలుగానీ ఏమీ లభించలేదు.

ఆయనకంటే **100** సంవత్సరాల పూర్వులైన ప్రాచీనులకూ సమకాలికులకూ అలాంటి సాక్ష్యాలు లభించాయి. ఉదాహరణకు- "అలెగ్జాండరు" - **22.7-35** B.C. రాత్రి **10-12** మధ్యన పుట్టాడని గ్రీకు చరిత్రకారుడు 'జీసటార్క్' (Plutarch) ప్లూటార్క్ వర్ణిస్తున్నట్టుగా జీసస్ అనే వ్యక్తి ఒకడు జన్మించినట్టుగా చారిత్రకమైన సాక్ష్యం ఏదీ లభించలేదు.

దీంతో యూరప్ అంతటా గొప్ప సంచలనం బైలుదేరింది!! "నిజంగా ఏసుక్రీస్తు అనేవ్యక్తి యదార్థంగా చరిత్రలో జీవించిన చారిత్రక పురుషుడేనా?

లేక యూదుల రోమనుల పురాణగాథల్లోని దేవతలవలే మత ప్రచారకులచేత **ఊహించబడ్డ ఆదర్శవ్యక్తియా?"**-అన్న ప్రశ్న ఉదయించింది!!

ఇదిలా ఉండగా - **ఏసుక్రీస్తు జన్మించాడని తెలిపే** లేక 7 B.C. కంటే ఎన్నో సంవత్సరాలకు పూర్వమే - క్రైస్తవమత బోధనలు చరిత్రలో లభించడంతో మరింత విస్మయాన్ని కలిగించిన విషయం!

## క్రీస్తు - అసలు జన్మతేదీ ఎవరికీ తెలియదు!

ఇది అనేకమంది క్రైస్తవులకే తెలియని పరమాశ్చర్యకరమైన చారిత్రక సత్యం! అమెరికా, యూరప్‌లలో అంతటా ఇప్పుడిప్పుడే ప్రచారంలోకి వస్తున్నది.

## 'జీసస్'-

ఇంతకీ నిజంగా ఏసుక్రీస్తు పుట్టిందేరోజు? అన్న దానిపై జరిగిన చారిత్రక పరిశోధనలో కనుగొన్న ఇంకొక సత్యం మరింత పరమాశ్చర్యంగా ఉంటుంది!!! అదేమిటంటే అసలు జీసస్ ఏరోజున జన్మించిందీ నిక్కచ్చిగా ఎవ్వరికీ తెలియదు!! ఇది మహాశ్చర్యంకదా? గత - **2000** సంవత్సరాలలో యూరప్ అంతటా వ్యాపించిన క్రైస్తవమత ప్రచారంవల్ల **క్రైస్తవులుగా మారినవారికి కూడా** ఈ విషయం **అంతుపట్టలేదంటే** మహా ఆశ్చర్యంగా ఉంటుంది.

"ప్రపంచ చరిత్ర" వ్రాసిన H.G. వెల్స్ (H.G. Wells - "World - Historyలో కూడా) క్రీస్తు జన్మతేదీ గురించి గాని, ఏసుక్రీస్తు పుట్టిన నెల గురించి కాని, కనీసం ఫలానా కాలంలో క్రీస్తు జన్మించాడని గాని నిర్దుష్టమైన సాక్ష్యాధారాలు కాని, లేదా చారిత్రకరికార్డుకానీ ఏమీలేదు"- అని తేల్చాడు.

కాని యూరప్‌లోని పరిశోధకులు, పండితులు ఇంతటితో ఊరుకోలేదు. ప్రఖ్యాత సైంటిస్టు గొప్ప ఖగోళ గణితజ్ఞుడైన (Astronomer) 'కెప్లర్' (John

Wilson Kepler) బైబుల్ అంతా తిరగతోడి (అంటే ఇప్పటి ఇంగ్లీషు బైబుల్ కాదు. ఈనాటి ఇంగ్లీషు బైబుల్‌కి ఆధారమైన గ్రీకు బైబుల్!) దానిపై పరిశోధించి, బైబుల్‌ను గ్రీకుభాషలో అనువదించేముందు హీబ్రూ భాషలోని యూదుల మతగ్రంథంనుంచి అనువాదం చేయబడింది అని నిరూపించాడు. కాని వాటికన్నా ప్రాచీనమైన ఈజిప్టు చారిత్రక మత రహస్యాలను కూడా పరిశోధించి ఏసుక్రీస్తు జన్మించినది బహుశా 4.B.C. సంవత్సరం అయిఉండవచ్చునని తనకు లభించిన సాక్ష్యాధారాలతో నిర్ణయించాడు.

ఇదో వింత! క్రీస్తుపూర్వమే **4 -** B.C. (Before Christ) లేక 7 – B.C. లోనే, క్రీస్తు జననమా? అంటే "క్రీస్తుశకం"కు ముందే క్రీస్తు జననమా?

ఇదెలా సాధ్యం? అంటే 'ఎస్సీనులు' (Essenes) అనబడే ఒక ప్రాచీన తెగవారికి చెందిన సాంప్రదాయానికి చెందినవాడు ఒకడు 'యోషువా' (Joshua) లేక 'ఈసా' (Isha) లేదా 'ఇసాయి' అన్న పేర్లతో ప్రాచీన యూదుల, రోమను చరిత్రలో పేర్కొనబడ్డ వ్యక్తులు పొడుగ్గా జుట్టు ధరించి, తెల్లని వస్త్రాలు ధరించి గడ్డమూ, మీసాలు కలిగిన లక్షణాలుగల సంప్రదాయమే 'ఎస్సీను'లదని తేలింది.

జీసస్ జన్మించక ముందునాటికి క్రైస్తవమతం ఇంకా పుట్టలేదు కనుక ఈయన జన్మత: ఏ యూదుమతానికో లేక 'ఎస్సీనుల' మత సంప్రదాయానికో చెంది వుండాలి. ఎందుకంటే బౌద్ధమతాన్ని స్థాపించిన 'బుద్ధుడు' జన్మత: బ్రాహ్మణ ధర్మాన జన్మించిన క్షత్రియుడు. తరువాతే ఆయన బౌద్ధమతం స్థాపించింది. అది బుద్ధుడు జన్మించే నాటికి లేదు కదా! కాబట్టి ఆయన జన్మత: హిందువుడే!

అలాగే సిక్కు మతస్థాపకుడు గురునానక్ కూడా సాంప్రదాయ హిందువులైన తల్లితండ్రులకే జన్మించాడు. అంటే - ప్రపంచ మతాలనబడే బౌద్ధమతం, క్రైస్తవమతం, జైనమతం, శిక్కుమతం. ఆ మతాల స్థాపకులు, మత గురువులు ఆ మతాలు జన్మించక ముందు - జన్మత: వారంతా హిందువులే!

### "మఖ్కా" - శివ క్షేత్రం :-

అంతేగాక ఈనాటి ముస్లింమతం పుట్టక ముందు 'మక్కా' వద్ద శివాలయం "మఖ్కేశ్వరుడైన" శివుడున్న పవిత్రమైన తీర్థయాత్రా స్థలంగా 'భవిష్యపురాణం'లో వర్ణించబడి వుంది.

"మఖ్కేశ్వరం - శివం ధ్యాత్వా" అని

అలాగే 'ఈశ పుత్రుడు' అన్న పేరుతో వర్ణించబడిన శక పురుషుడు బహుశా ఏసుక్రీస్తు కావచ్చునా? ఐతే, ఆయన 78 A.D.లో నాటి శాలివాహనుడిని కలిసినట్టు వున్నది కదా! ఆయన కాలం - ఎప్పుడు?

మరో ఆశ్చర్యకరమైన వింత! హిమాలయపర్వత గుహలలో ఒక అపూర్వ ప్రాచీన తాళపత్ర గ్రంథం లభించింది. దీనిని టిబెట్‌కు వెళ్లిన రష్యన్ రాయబారి 'నోటోవిచ్' (Notovich) వర్ణిస్తూ, తాను ఏసుక్రీస్తు జీవితాన్ని యథాతథంగా వర్ణించిన తాటాకు గ్రంథాలను కళ్లారా చూశానని వ్రాశాడు. అందులోని క్రీస్తు జీవితంలో ఏసుక్రీస్తు భారతదేశం వచ్చాడనీ పవిత్ర యాత్రాస్థలాలైన బుద్ధ గయ, కాశీ, కాశ్మీరు వంటి ప్రదేశాలలో చాలాకాలం నివసించాడనీ, అక్కడి యోగులతో, మహర్షులతో అపూర్వ యోగశక్తులు గల సాధువులతో చాలాకాలం ఆధ్యాత్మిక శిక్షణ పొందాడనీ రాసిఉన్న ప్రాచీన తాళపత్ర గ్రంథాన్ని స్వయంగా తాను ప్రత్యక్షసాక్ష్యంగా - ఈ రష్యన్ రాయబారి 'అలెగ్జాండర్ నోటోవిచ్' (Alexander Notovich) వ్రాశాడు.

ఈ గ్రంథం యూరప్ అంతటినీ ఒక భూకంపంలా ఊపి, క్రీస్తుమత పునాదులనే కదిపివేసింది!! దీనికి ఆందోళన చెందిన రోమన్ క్యాథలిక్ పీఠపు గురువైన పోప్ నుంచి - ఈ ప్రాచీన తాటియాకుల గ్రంథం అసత్యమనీ, అసలు అలాంటి తాటియాకుల గ్రంథం ఏదీలేదు అనీ-ఒక ప్రకటన వెలువడింది.

దీనితో తాను నిజాయితీపరుడనని పరువు రక్షించుకోవలసిన బాధ్యత అలెగ్జాండర్ నోటోవిచ్‌పై పడగా - అతడు హిమాలయాలలోని హిమ్మిస్

బౌద్ధపీఠంలోని గుహలో తానీ తాళపత్ర గ్రంథాన్ని చూశానని ఖచ్చితంగా ధృవపరుస్తూ రాయడమే కాక, ఆ పుస్తకాన్ని ఫోటోలు తీసి అందులోని 'ఈశా' అనే యోగి జీవిత సంగ్రహాన్ని కూడా ప్రచురించాడు.

ఈ గ్రంథం కొన్ని లక్షల కాపీలు అమ్ముడైంది!!! ఇందులో చెప్పిన యదార్థమైన క్రీస్తు జీవితం - ఇంగ్లీషులో "The Hiden Life of Jesus Christ" అన్న పేరుతో గ్రంథంగా ప్రచురించారు.

## శిలువపై మరణించలేదు!!

ఇందులో లభించిన మరొక ఆశ్చర్యం - అందరూ భావిస్తున్నట్టుగా ఏసుక్రీస్తు తన **31-32** ఏళ్లకు శిలువపై మరణించలేదని!!!

ఇది క్రైస్తవులనే కాక ప్రపంచవ్యాప్తంగా అందరినీ ఆశ్చర్యంలో ముంచెత్తింది!! ఎందుకంటే ఇందులో బాంబులాగా పేలిన ప్రత్యక్షసాక్ష్యం - ఏసుక్రీస్తు నిజానికి కాశ్మీరులో మరణించాడని - ఆయన సమాధి శ్రీనగర్‌లో వుందనీ అతడు ప్రచురించిన ఫోటో ఈ గ్రంథంలో చూడవచ్చు. దీనిని నెహ్రూ, లార్డ్ కర్జన్ వంటి పెద్దలు కూడా చూశారు! వారు ఆశ్చర్యాన్ని తెలుపుతూ వ్రాశారు!

విదేశీ చరిత్రకారులైన హెచ్.జి.వెల్స్ (H.G. Wells), 'విల్ డ్యూరాంట్' (Will Durant) వంటి మహామహులు బైబుల్‌పైనా ప్రత్యేకించి ఏసుక్రీస్తు వ్యక్తిగత జీవితంపైనా ఎన్నో చారిత్రక పరిశోధనలు విస్తృతంగా చేపట్టారు! చాలామంది క్రైస్తవ సోదరులకుకూడా ఈ పరిశోధన వివరాలు తెలుసుకోవడం ఆసక్తికరంగా, లాభదాయంగానూ ఉండగలదు! ఈ అన్వేషణలో ఏసుక్రీస్తు నిజజీవితంపై జరిగిన పాశ్చాత్య పరిశోధన ఏమిటో, దానిపై విదేశీ చారిత్రకులు కనుగొన్న ఆశ్చర్యకరమైన చారిత్రక ఆధారాలు, అంశాలు ఎలాంటివో మనం తెలుసుకుందాం!

"విల్‌డ్యూరాంట్" ఏం రాసాడంటే - బైబుల్ కొత్త నిబంధనలు (New Testament) ఆధారంగా మనకు లభించే "జీసస్ జీవితం"లోని విషయాలు

అసంపూర్ణంగానూ, అసమగ్రంగానూ లభిస్తున్నాయి. అంతేకాక ఏసుక్రీస్తు దగ్గర శిష్యరికం చేసినవారని బైబుల్‌లో వ్రాయబడిన లూకాస్, మేథ్యూ, 'పాల్' మొదలైన అపోస్తల (Apostles) వ్రాతలను బట్టే ఈనాటి బైబుల్‌లో కొత్తనిబంధనలు ఏర్పడివున్నవికదా? ఈ సువార్తలలోని క్రీస్తుజీవిత విశేషాలను ఒకచోట ప్రోగుచేసి - ఒకదానితో ఒకటి గనుక సరిపోలుస్తూ విమర్శ చేసి, పరిశోధనా దృష్టితోగనక పరిశీలిస్తే కొన్ని ఆశ్చర్యకరమైన అంశాలు ఈ చారిత్రకుల దృష్టికి వచ్చాయి.

ఇందులో మొదటిది - **ఎన్నో 'సువార్త'లు నశింపు చేశారు!** అంటే ఇప్పుడు లభించే బైబుల్‌లో 'లూక్, మేథ్యూ' మొదలైన నాలుగు సువార్తలున్నట్లే పూర్వము ఇంకా ఎన్నో ఇతర 'సువార్త'లు కొన్ని ఉండేవన్న నిదర్శనాలు కనిపిస్తున్నాయి. అవి "బైబుల్ నుంచి తొలగించబడిన" అంశాలలో చేర్చబడినవి! అంటే బైబుల్‌లోని అంశాలు ఏవేవి తొలగించాలో, ఏ అంశాలు బైబుల్‌లో లేనివి తెచ్చి చేర్చాలో నిర్ణయించటానికి క్రైస్తవ మతగురువులు జరిపిన సభలు 'నైసీ' (Nice) వద్ద, ఇతర చోట్లా కూడా జరిగిన సభలలోని 'రికార్డు' దీనికి బలమైన చారిత్రకంగా లభిస్తున్న సాక్ష్యధారం!

ఈ మీటింగులు జరిగినప్పుడు క్రైస్తవ బిషప్పుల చర్చలలో ఓటింగులో వీగిపోయినవీ, అందులో అంగీకారంపొంది బైబుల్‌లో తరువాత చేర్చబడిన అంశాలూ, కూడా చారిత్రకంగా ఈ కాన్ఫరెన్స్ (Conference)ల తాలూకు రికార్డులలో ఖచ్చితంగా లభిస్తున్నవి. (తేదీలతో సహా!) ఇలాగ బైబుల్ నుంచి తొలగించబడిన భాగాలలో 'బుక్ ఆఫ్ జాషర్' (Book of Jasher) అన్న గ్రంథం అతి ముఖ్యమైనది.

దీనిని అమెరికాలోని పరిశోధకులు భద్రపరిచి ఇందులో అమూల్యమైన ఆధ్యాత్మిక సత్యాలు, సాధనాంశాలూ ఎన్నో ఉన్నాయని ఒక ఆధ్యాత్మిక సంస్థ (AMORC) వారు ప్రచురించారు. అలానే రానున్న భవిష్యత్తును గురించీ, ప్రళయాలను గురించి తెలిపే 'రివలేషన్' (Revelation of John)

అన్న భవిష్యత్ కాలజ్ఞాన భాగం (Apocalypse)లో కూడా చాలాభాగం తొలగించబడింది!

ఇలా తొలగించబడిన అంశాలలో "పునర్జన్మ యదార్థమని" బోధించే క్రీస్తు మహాశయుని బోధనలు లేక బైబుల్‌లోని ముఖ్యమైన గ్రంథ భాగాలు కూడా తొలగించబడ్డాయి. అలానే కొన్ని భాగాలు "క్రొత్త నిబంధన" (New Testament)లలో అదనంగా చేర్చబడినవి. ఉదాహరణకు, "రేనాన్" (Reynan) 'ఐరీనస్'" (Irenes) "డ్యూరాంట్" (Durant) లు ఇలా వ్రాస్తున్నారు.

"సైతాను క్రీస్తును శోధించిన విషయం ఎవరికీ తెలియదు. సైతానూ చెప్పడు! క్రీస్తు స్వయంగా ఎక్కడా వ్రాసి వుంచలేదు! అలానే చనిపోయిన తరువాత ఏసుక్రీస్తు, లాజరస్ (Lazarus)ను బ్రతికించిన విషయం గురించి యోహాను చెప్పుచున్నాడు. కాని తక్కిన క్రీస్తు శిష్యులైన అపోస్తలు (Apostles) వ్రాసిన 'సువార్త' (Gospels)ల్లో ఈ విషయ మెక్కడా వారు వ్రాయలేదు. మరి ఏ ఆధారంతో ఈ విషయం బైబుల్‌లో చేర్చబడిందో ఆశ్చర్యం!"

అన్నిటికన్నా ముఖ్యమైన అంశం ఒకటి ఉన్నది - "క్రీస్తు" జీవితానికి క్రైస్తవ మతానికి అయువుపట్టు వంటి అంశము!" ఇది, ఏసుక్రీస్తు మానవుల కొరకే చనిపోయినాడని, మరణించిన తరువాత తిరిగి లేచినప్పుడు 'జాన్' అనేవాడు ఆయనను చూశాడనీ వ్రాయబడింది. కాని ఈ విషయం ధృవపరచడంకోసం చూస్తే 'జాన్' వ్రాసిన సువార్తలో అతడీ విషయాన్ని ఎక్కడా చెప్పలేదు!

ఇలా చారిత్రక దృష్టితోగనుక, పరిశోధనా దృష్టితోనూ విశ్లేషించిచూస్తే - 'మనిషి మరణించడం, తిరిగి లేవడం' అన్నది ఒక వింత! ఇలాంటి వింతలు స్వయంగా జాన్ (John) గనక చూసివుంటే తాను వ్రాసిన 'సువార్త' (Gospel of John) లో వ్రాయాలి! అలా వ్రాయలేదు. క్రీస్తు గురించిన అతి ముఖ్యమైన అంశాలన్నీ గ్రంథస్థం చేసినట్లయితే, ఈ విషయాన్ని కూడా అలానే గ్రంథస్థం చేసి వుండేవాడే. కాబట్టి క్రీస్తు మరణించి తిరిగి లేవడం

స్వయంగా తన కళ్లతో జాన్ (John) చూశాడని చెప్పే సాక్ష్యాధారమేదీ జాన్ సువార్త (Gospel of John)లో లేదు! ఇలా లేకపోవడంతో ఇది తరువాత జరిపిన క్రైస్తవ మహాసభలలో అలా బైబుల్‌లో చేర్చబడిన అంశంగా విదేశీ చరిత్రకారులే నిర్ధారించివున్నారు.

ఈ విషయాన్ని ఇంకోలాగా కూడా. యదార్థమా? కాదా? అని పరిచూస్తే దీనికి వేరే ఆధారంకూడా లభిస్తున్నది.

ఒకవేళ జీసస్ శిలువ మీదనే మరణించి ఉండకపోతే - యోగి పుంగవుడైన క్రీస్తు గాఢమైన యోగ సమాధిలో ఉండగా శిష్యులు - దాని మరణం అనుకొని అలా భావించివుండవచ్చు! ఇందులో ఏది నిజం? అని విదేశీ సైంటిస్టులు వైద్యశాస్త్ర దృక్పథం (Medical Evidence)తో బైబుల్‌లోని సువార్తలను పరిశోధించారు. వారి పరిశోధనల ఋజువులు సంక్షేపంగా ఈ క్రింది చూపబడినాయి.

**1.** జీసస్ శిలువమీద ఉండగా ఒక రోమన్ సైనికుడు(Centurion) శూలంతో ఆయన డొక్కలో పొడవగా - ఆ గాయంలోంచి 'నీళ్లతో పాటు రక్తము బైటికి చిమ్మింది' అని బైబుల్‌లోని సువార్తలోనే వున్నది గదా! వైద్యశాస్త్రం ప్రకారం మరణించిన వ్యక్తి శరీరంలోంచి రక్తం బైటికి చిమ్మదు! ఎందుకంటే మనిషి మరణించిన కొద్ది సేపటిలోనే రక్త ప్రసరణ నిలిచిపోతుంది! దానితో రక్తం గడ్డకట్టుకుపోయి ఆ శరీరానికి శవ లక్షణాలు *(Rigor - mortis)* అనే వైద్యశాస్త్ర స్థితికలిగి 'కళేబరం'గా మారిపోతుంది! కాబట్టి రోమన్ సైనికుడా శవంమీద శూలాలతో పొడిచినప్పుడు ఏసుక్రీస్తు మరణించలేదు - అనే వైద్యశాస్త్రం ప్రకారం రూఢి అవుతున్నది.

అలానే ఫ్రెంచి చరిత్రకారుడు పరిశోధకుడూ ఎర్నెస్ట్ రేనాన్ (Ernest Reynon) తన గ్రంథమైన "జీసస్ జీవితం" (The Life of Jesus - by Ernest Renon) లో "నాలుగు సువార్తలలోని విషయాలను పరిచూసి బేరీజు వేయగా అవి చారిత్రకంగా సత్యాలు అనడానికి ఏ ఆధారాలూ కనిపించటం లేదు

అని కట్టుకథలు, కల్పనలులాగా కన్పిస్తున్నాయని" తన గ్రంథంలోని పేజీ (189-190)లో తెలిపాడు.

పైవాక్యాలను బట్టి చూస్తే ఆనాడు క్రీస్తు శిష్యులచే వ్రాయబడినదని విశ్వసిస్తున్న 'క్రొత్త నిబంధనలు' - నిజానికి ఒకే గ్రంథం కాదు! ఇవి వేర్వేరు కాలాలలో భాషాభేదాలతో విషయాలలోని వైరుధ్యంతో నిండివున్నాయి. ఇదే విషయాన్ని ప్రఖ్యాత 'ప్రపంచ చరిత్ర' పరిశోధకుడు 'విల్ డ్యూరాంట్' (Will Durant) కూడా ఈక్రింది వాక్యాలతో ఇలావ్రాస్తున్నాడు.

"In summary, it is clear that *there are many contradictions* between one Gospel and another. Many dubious statements of history, many suspicious resemblances to the legends of old Pagan gods, many incidents apparently designed to prove this fulfilment of Old Testament prophecies, many passages possibly aiming to establish a historical basis for some later doctrine or ritual of the Church... presumably the conversations and speeches reported in the Gospels, were all subject to frailties of illiterate memories, and the errors or amendation of copyis".

**– The Story of Civilzation - (Vol. III, P. 557) by Will Durant.**

పైవాక్యాలు క్రైస్తవమత విరోధి ఎవరో వ్రాసినవికావు! విల్ డ్యూరాంట్ సాంప్రదాయ క్రైస్తవుడు! అయినప్పటికీ ఒక చారిత్రకునిగా తన నిష్పక్షపాతమైన నిర్ణయాన్ని పైన తెల్పాడు. ఇది ఈనాడు బైబుల్‌ను భగవంతుని యొక్క యదార్థవాక్యం అనుకునేవారికి తెలియని సత్యం!

బ్రూస్ (Bruce) అనే మరో బైబుల్ పరిశోధకుడు 'దేవుని రాజ్యము "The Kingdom of God" గురించి వ్రాస్తూ 'సువార్త'లోని చారిత్రక అంశాలపై తానుచేసిన పరిశోధనల ఫలితానికి నిస్పృహచెంది ఇలా వ్రాస్తున్నారు.

"We know very little about Jesus. The Evangelists daubed his life image so thickly with supernatural colours, that the natural colours can

no longer be restored. The Jesus of histroy is simply a Problem, and a problem cannot be the object of faith."

ఇది ఇతడు క్రైస్తవమతంపై ద్వేషంతోవ్రాసిన మాటలు అని అనుకోరాదు! ఎందుకంటే భక్తితో బైబుల్‌లో ప్రతిమాటనీ నమ్మే గ్రుడ్డి విశ్వాసం వేరు - చారిత్రక ఆధారాలమీద పరిశోధనచేసే కేవలం ఋజువైన అంశాలనే వెల్లడించే పరిశోధకుని తార్కికదృష్టి వేరు!

ఇలాగే విదేశీ పండితులు క్రీస్తుగురించే కాకుండా శ్రీరాముడు, శ్రీకృష్ణునిగురించీ కూడా నిర్దుష్టమైన చారిత్రక పరిశోధన చేయకుండా విడిచిపెట్టలేదు గదా!

## ఖగోళ గణితం :

క్రీస్తు జన్మించినట్టు వర్ణించిన బైబుల్ కొత్త నిబంధనలలో విషయాలను చారిత్రక దృక్పథంతో విశ్లేషించిన విదేశీ చారిత్రకులు, ఖగోళ శాస్త్రజ్ఞులు ఈక్రింది అంశాలను వెలికితీశారు.

1. బెత్లెహెమ్ గ్రామంలో ఒక నక్షత్రం కనిపించిందనీ, ఆ సమయంలో జీసస్ అనే నజరేత్ వాస్తవ్యుడు జోసెఫ్ అనే అతని భార్య ఐన మేరీకి జన్మించాడని,

2. హెరాడ్ అనే రాజు ఆ సమయంలో పుట్టిన పిల్లలను వధించేలా జ్ఞాపించాడనీ.

3. హెరాడ్ రాజు 4 B.C ప్రాంతంలో జీవించాడని - అప్పుడు రోమన్ చక్రవర్తి అగస్టస్ సీజర్ పాలస్తీనాలోని యూదులందరినీ జనాభా లెక్కలలో నమోదు చేయించాడనీ.

4. జీసస్ అనే వ్యక్తి శిలువ వేయబడ్డాడని, సువార్తలో వ్రాయబడ్డ టైముకు పగలే చీకటి కనిపించిందని! కానీ - సూర్యగ్రహణం వంటిది ఆ సమయంలో జరిగి ఉంటుందని ఖగోళ గణితజ్ఞులు కెప్లర్ (Kepler) 'సిరిల్ ఫాగన్' (Cyril Fagan) వంటివారి అభిప్రాయాలు! అవి క్రింద విడిగా

చూడవచ్చు.

1. హెరాడ్ రాజు పాలించినట్లు చెప్పబడ్డ 4 B.C నుండి యూదుల పేర్లన్నీ నమోదు కాబడ్డ రికార్డులలో నజరేత్ నివాసి 'జీసస్' అనే పేరుగల వ్యక్తి జననం గురించి ఎక్కడా వ్రాయబడి కనిపించలేదు.

2. ఆకాశంలో కొత్త నక్షత్రం కనబడిందని సువార్తలలో వ్రాసిన అంశాలపై ఖగోళ శాస్త్రజ్ఞుడు టైకో బాహే (Tycho Bahe) తన కాలంలో **1572** A.D. కనిపించిన నక్షత్రం గతంలో **1264** A.D.లోనూ, అంతకు పూర్వం **945** A.D.లోనూ కనిపించినట్టు, ఆ నక్షత్రం ఉత్తరాభాద్ర నక్షత్రం వద్ద మీనరాశిలో కనిపించిందనీ దాని డిగ్రీలు **$32^0$** అక్షాంశములో-జూడియా సమీపంలో ఆకాశంలో కనబడి ఉండవచ్చునని అది బెత్లెహేం గ్రామంయొక్క అక్షాంశం **$31^0$-43** కు సమీపంగా ఉన్నందున అక్కడ కనిపించి ఉండవచ్చునని తేల్చాడు.

## డిసెంబర్లో పుట్టలేదు !!

కాని ఈ నక్షత్రం కనిపించిన తేది అసలు డిసెంబర్ నెలలో రానేరాదు!! సెప్టెంబర్ ప్రాంతంలో ...ందని అంటూ సెఫేరియల్ (Sephariel) అనే ఖగోళ శాస్త్రజ్ఞుడు (Astronomer) ఇలా వ్రాస్తున్నాడు.

"......in that year on 19th September there would be shepherds abiding in the fields by night"

అంటూ ఆ తేదీ మాత్రం అది కాదని తేల్చి....

"The 25th December is of course, an *impossible* date.

The Sun in the middle of Sign "Virgo" is the "woman clothed with the Sun. . The Moon under its Feet" - signifies a full moon... The full moon of March fell on the 13th.... If we add the values for 6 lunations, we shall have the full moon of September in the year 4 B.C.

కాబట్టి జీసస్ పుట్టింది 13 మార్చి, లేదా 19 - సెప్టెంబర్‌న అయి వుండాలి-అంటూ తేల్చాడు. దీనినిబట్టిచూస్తే ఒక ముఖ్య విషయం తేలుతున్నది.

1. క్రొత్త నక్షత్రం (Star of Bethlahem) కనిపించింది. మార్చి 13 తేదీ ప్రాంతంలో! కాని పూర్ణిమ కన్యారాశిలో వచ్చింది (కన్యకు జన్మించిన కుమారుడు). 19 సెప్టెంబరునే అనీ - ఈ రెండుతేదీల మధ్య ఆరు నెలల వార ఉన్నదనీ చారిత్రకులు గ్రహించారు. ఇది 4 B.C. ప్రాంతంలో జరిగివుండవచ్చు అనీ! మరి కొందరు బైబుల్ నిబంధన (New Testament) వాక్యాల మీద ఆధారపడి గణితం చేసి 7 B.C.లో యేసు క్రీస్తు జననం జరిగి ఉంవచ్చునీ రకరకాలుగా ఊహించారు.

"సెఫేరియల్" (Sephariel) అనే ఖగోళ శాస్త్రజ్ఞుడు ఇలా వ్రాస్తున్నాడు:-

"On the December 25th (this of the following days were formally the "Saturnalia" of Pagan Rome) show that... in regard to Bethlehem.. it coresponds to the middle of March "

## అనిశ్చితం :

హెరాడ్ రాజు - క్రీస్తు జన్మించిన 94 రోజులకు ముందే మరణించాడనీ, ఇంకొక లెక్క ప్రకారం క్రీస్తు నవంబర్ చివరిలోగానీ, ఆగస్టులో గాని లేదా సెప్టెంబర్‌లో గాని జన్మించి ఉండవచ్చునని అంటూ

"The death of Herod the Great was ninety four days. Now as the patriarch died in the same year... Jesus was born 4. B.C. and near the end of November. The nativity must have taken place in August" అంటాడు.

'అర్చిబిషప్ అషర్' (Archbishop Usher) జ్యోతిషం ప్రకారం గణితంచేసి హెరాడ్ రాజు 25 - నవంబర్‌న మరణించాడనీ కాబట్టి జీసస్ ఆగస్టు 25న జన్మించి ఉండవచ్చుననీ లెక్కవేశాడు.

"ప్రపంచ చరిత్ర" (World History) వ్రాసిన వెల్స్ ఇలాంటి క్రొత్త నిబంధనలలో వర్ణించబడిన అనేక అంశాలన్నీ సైన్సు గణితంలో, ఖగోళం గణితంతో కాచి వడపోసి, వ్రాసిన ఖగోళ పండితుల రచనలతో విశ్లేషించి, అప్పటి చారిత్రక రికార్డులతో సరిచూడగా పై అంశాలు - 'ఒకదానితో ఒకటి సరిపోవని' తేల్చాడు.

అంటే వారు కుండబద్దలు కొట్టి తేల్చినది - 'కొత్తనక్షత్రం కనబడిన సంవత్సరంతో' - హెరాడ్ రాజు మరణం సరిపోదు! ~~ఈ~~ రెండిటితోనూ - పోంటియస్ పిలేట్ (Pontius Pilate) జీవించిన జీవిత కాలం - సరిపోదు!' అని స్పష్టంగా తేల్చి చెప్పాడు.

పై వర్ణనలతో పాటు 25 డిసెంబర్ అసలే కలిసిరాదు! పూర్ణిమ కాన్యారాశిలో 19 సెప్టెంబర్‌న గాని ఏర్పడదు. క్రీస్తు శిలువ వేయబడట్టు చెప్పబడే సంవత్సరంలో పగలు చీకటి కనిపించేలా సూర్యగ్రహణమేమీ పట్టలేదు!

ఒకవేళ ఏదైనా వీలున్నా కొంతవరకూ 19 సెప్టెంబర్ మాత్రమే జన్మదినంగా వుండే పోలికలు కనిపిస్తున్నాయి. - ఆ సమయానికి నిజంగా ఎవరైనా 'క్రీస్తు' వంటి చారిత్రకవ్యక్తి జన్మించివుంటే!

కాని ఊహే! కాబట్టి క్రైస్తవులకు పవిత్రమైన 25 డిసెంబర్ క్రిస్మస్ పండుగ సందర్భంగా అందరికీ గౌరవనీయుడైన ఏసుక్రీస్తు జీవితంగురించిన అసలు యదార్థమైన సత్యాన్ని చారిత్రకపరిశోధన ద్వారా ఇప్పుటికైనా నిర్ధారించుకోడం క్రైస్తవులకు. ఎంతైనా అవసరం.



5

# 'ఖురాన్ షరీఫ్'లో జీసస్ క్రీస్తు

ఏసుక్రీస్తు జీవితంలోని సంఘటనలను ఇప్పటి బైబుల్ ఒక్కటే కాకుండా ఇతర సాక్ష్యాధారాలతో కూడా సరిపోల్చి - ఇతర మతగ్రంథాలలోని "దేవుని వాక్యం" (Word of God) అన్న పవిత్ర గ్రంథాలతో తులనాత్మక పరిశోధనచేశారు విదేశీ బైబుల్ - పరిశోధకులు!

ఇలా చేపట్టిన ముఖ్య మత గ్రంథాలలో 'ఖురాన్ షరీఫ్' ప్రాథమికత సంతరించుకున్నది! ఎందుకంటే బైబుల్ 'పాత నిబంధనలు' ఖురాన్ షరీఫ్ లోని ప్రాచీన భాగాలూ, ఒకే మూలకథ గురించి చెప్తాయి. ఆదం, హవ్వల నుండి సృష్టి ఏర్పాటు! మోసెస్ ప్రవక్త (Moosa-ఖురాన్) అబ్రహాం (ఇబ్రహీం) ప్రవక్త డేనియల్(Danial) అన్న స్వల్ప పేరుమార్పులతో

అదే సృష్టిక్రమం కథా, అదే జలప్రళయంలో "నోవా" నావలో రక్షించబడే కథ రెండింటిలోనూ సమానంగా కన్పిస్తాయి! కాబట్టి జీసస్ విషయంలో ఖురాన్ షరీఫ్ ఏమి చెప్తున్నదో, దానికి స్వంతంత్రమైన సాక్ష్యాధారంగా భావించి విదేశీ పరిశోధకులు బైబుల్‌లోని తులనాత్మక పరిశీలన యొక్క భాగాలను ఈనాడు అంగీకరించాయి! ఖురాన్‌లో ఈశా అన్న పేరుతో జీసస్‌ను మోసెస్ (Moses) ప్రవక్త ఆ తర్వాత "ఇబ్రహీం" (Ibrahim) లాగే 'ఈశా' ప్రవక్తను పంపించాడు! ఖురాన్ ప్రకారం ఈశా తర్వాత ఒక్కటే ప్రవక్త ఈ యుగాంతానికి వస్తాడు! అతడే ఆఖరి ప్రవక్త మహమ్మద్ అని ముస్లింల విశ్వాసం! కాబట్టి ఖురాన్ గ్రంథం జీసస్‌ను ముస్లిం ప్రవక్తలతో సమానంగా గౌరవిస్తుంది! సాక్షాత్తూ భగవంతుని దూతగా ఆయన సందేశాన్ని (Word of God) అందించే "రసూల్" లేక "వార్తా-హారుడు"గా అంటే సరిగ్గా మస్సీహ అన్న అర్థంతోనే వర్ణిస్తోంది! ఇంకా ఇలా అంటోంది షరీఫ్ - లో దేవుని వాక్యాలుగా !

"మేము (అల్లా) మూసా ప్రవక్తకు ఈ ఖురాన్ గ్రంథాన్ని ఇచ్చాను! అతని తర్వాత నేను మా సందేశాన్ని అందించే దేవదూతను భూమికి పంపించాము! ఇతర మహాత్ములను పంపాము! మేము ఈశా మరియా కుమారుడని తగిన శుభ శకునాలతో ఆశీస్సులిచ్చి పంపాడు! దేవతాంశ (Holy Spirit) తో భూమికి పంపించాము!"

- ("ఖురాన్ షరీఫ్" - II - 51)

అంటే స్పష్టంగా "దేవుని దూత"గా జీసస్‌ను ఖురాన్ అంగీకరిస్తోంది! అయితే దేవుని "ఏకైక కుమారుడు" అన్న కాథలిక్ బిషప్పుల కల్పనా గ్రంథాలలోని మతఛాందస వాదాన్ని ఖురాన్ అంగీకరించలేదు! ఇది మనం గమనించలేదు! ఈయన దేవునికి 'ఏకైక కుమమారుడు' అని అంగీకరించారు గాని, భగవంతుని అవతారంతో వచ్చిన దేవదూతలలో

ఒకడని మహమ్మద్‌తో సాటివానిగా భావిస్తుంది! ఏ మతమైనా ఇంతకంటే గౌరవాన్ని ఇతర మతాల ప్రవక్తలకు ఇంకేమిస్తుంది? ఇది గొప్ప విషయం! కాబట్టి శిలువపై జీసస్ మరణించడం గురించి ఖురాన్ వాక్యాలు ఏమి చెపుతోందో మనం శ్రద్ధగా పరిగణనలోకి తీసుకోవచ్చు!

"మేము (అల్లా)" మరియమ్మకు కుమారుని ఇచ్చాము! తల్లికి గుర్తుగా శుభశకునాలు చూపించాము! వారికి రక్షణ ప్రశాంతమైన కొండ చరియపై ఏర్పాటుచేశాము! చల్లటి మంచినీటి వసతిని కూడా!"

(-ఖురాన్ XXIII- 52)

ఖురాన్ వర్ణనలో జీసస్ జీవితంలోని ప్రదేశం ఈనాటి కాశ్మీరుకు దగ్గరి పోలికలు కన్పిస్తాయి! ఎడారిగాని, రాళ్ల రప్పలతో నిండిన జెరుసలేమ్‌గాని కాదు. అది పై వర్ణనకు సరిపోదు! "కొండచరియ" చల్లటి "మంచినీటి ప్రవాహం" అన్న మాటలు స్పష్టంగా క్రీస్తు సమాధి ఈనాడు లభించే కాశ్మీరుకు సరిపోతుంది! మరొకచోట ఖురాన్‌లో...

"పచ్చని లోయ లేక కొండ చరియ" అన్న వర్ణన కన్పిస్తుంది!

ఖురాన్ షరీఫ్ కథనంప్రకారం జీసెస్ శిలువ మీద మరణించలేదు!

"The Koran clearly states that Jesus did not die on the cross" అంటాడు జర్మన్ పరిశోధకుడు పోల్జర్. అరబ్బీ భాషలోని మాటకు శిలువపై మరణించడం అన్న అర్థమే లేదు! అంతేకాదు ఖురాన్ గ్రంథస్థం చేయబడే నాటికి జీసస్ జాతివారయిన యూదులకు (Jews) జీసస్ శిలువపై మరణించాడా లేదా అన్నది నిర్ధారణ కాలేదు! - "The Jews were deceived" - యూదులు మోసపోయారు అన్న మాటలు ఖురాన్‌లో కన్పిస్తాయి!

"అల్లా ఒక్కడే పరమాత్ముడు! సర్వశ్రేష్ఠుడైన భగవంతుడు!

ఇతరులెవ్వరూ భగవంతునితో సాటిరారు! సరికారు! అల్లా ఒక్కడే అద్వితీయుడు (తానుకాక వేరే వస్తువు లేనివాడు) అల్లాయే ఈ భూమి - ఆకాశమూ పైనున్న స్వర్గలోకములోని సర్వ సృష్టిలో నిండివున్నాడు! ఆయనయే పరమ రక్షకుడు! ప్రవక్తలు ఆయన అనుచరులు! ఆయన వార్తాహరులు (రసూల్...)"

... "క్రైస్తవుల ఆరాధన దేవునికుమారునిగా చేయడం ఖురాన్ అంగీకరించింది! క్రైస్తవుల గురించి ఇలా అంటుంది! వారు తమ ప్రవక్తలను, సంతులను, రబ్బీలను పూజిస్తారు! "మస్సీహా" మరియా కుమారుడిని కూడా పూజిస్తారు! భగవంతుడైన అల్లాతో సమానంగా గౌరవిస్తారు! నిజానికి ఆయన చంపబడలేదు! శిలువ వేయబడక పోయినా వూరికే అలా కనిపించేలాగా చేసినా - వారికి నిజమైన ఋజువు సాక్ష్యం లభించలేదు! నిజానికి వారు ఆయనను చంపలేదు! అల్లాయే చివరికి తనలో ఐక్యం చేసుకున్నాడు! అల్లా సర్వశక్తిమంతుడు! సర్వజ్ఞానవంతుడు! అంటుంది ఖురాన్ ! (ఖురాన్ IX- 30.31)
(ఖురాన్ XXIII - 52)

The Koran clearly states that Jesus did not die on the Cross, and the Jews were deceived: "And because they were non believers and standard mary severely, and because they said, 'we have killed the "Messiah, Jesus' the son of Mary, the 'Messenger of God', although they neither struck him dead not crucified him, but just made him appear so... thus We curse them, and behold, those who are not of the same mind in this matter are in true doubt they have no proof, but just follow a suspicion, for in relity, they did not kill him. God raised him to himself and God is mighty wise." The Arabic word for crucifixion means death on the cross" in the context. Thus merely being nailed to

the cross without dying is distinctly not meant. In fact, during the period in which the Koran was written, the Jews themselves seem to have been unsure as to whether Jesus really died on the cross. The Koran also gives an answer to the question of where Jesus went after the crucifixion,

"We (God) made the son of Mary and his mother a sign to mankind and gave them a shelter on a peacefull hill-side watered by a fresh spring (xxiii-52)"

The similarities between this description and Kashmir are striking. In another translation the place in the mountain is even called "a green valley."

ఖురాన్ షరీఫ్‌లోని సాక్ష్యాధారాలను హాజరత్ మీర్జా గులామ్ అహమ్మద్ **(1835)** అన్న ముస్లిం, జీసస్ జీవితాన్ని విశ్లేషించి ఖురాన్ చెప్పిన విషయాన్ని ధృవపరిచాడు! జీసస్ శిలువ మీద చావలేదని, దేవుడే రక్షించాడని అంతేకాదు. ఆయన సువార్తలను, బైబుల్‌ను నిశితంగా పరిశోధించి జీసస్ నిశ్చయంగా శిలువపై చావలేదని ఆయన చావుతప్పి రక్షించబడి కాలినడకన కాశ్మీరు చేరుకున్నాడని రాస్తున్నాడు.

For the Ahamadiyyas (still a popular form of Islam today). Jesus' survival of the torment of crucifixion fulfils prophecies from the Old Testament.

పై ఖురాన్ సాక్ష్యాధారాలు దృష్ట్యా అక్బర్ పాదుషా ఫతేపూర్ సిక్రీలో శిలాశాసనంపై రాయించిన ఈశ (Jesus Christ) "ఈశా-క్రిస్టో" మాటలను గమనిస్తే మాటలను ముస్లిం ప్రమాణ గ్రంథాలప్రకారం జీసస్ శిలువమీద మరణించలేదని స్పష్టంగా

పేర్కొంటున్నారు! పైగా మాటి మాటికీ మార్పులు, చేర్పులు చేస్తుంటే గ్రంథం కేథలిక్ బిషప్పుల మహాసభల నిర్వాకంతో సరిపోల్చి చూస్తే ఖురాన్ షరీఫ్ ప్రమాణాన్ని యదార్థమని బ్రిటిష్ జర్మన్ అమెరికన్ దేశాలలోని బైబుల్ పరిశోధకులు కూడా అంగీకరిస్తున్నారు!

ప్రత్యేకించి "జాన్" సువార్తలోని శిలువమీద జీసస్ శరీరాన్ని శూలంతో పొడిస్తే నీళ్లు రక్తం రావడం దృష్ట్యా ఒక పెద్ద సమస్య ఉత్పన్నమవుతుంది!

జీసస్ కనుక శిలువపై మరణించకవుంటే ఆయనను శిలువ మీద నుంచి క్రిందికి ఎవరు దించారు? ఎలా జీవించాడు? ఆయనకు వైద్య చికిత్స, గాయాలకు ఉపచారాలు ఎవరు చేశారు? దీనికి ఏ దేశంలోనైనా ప్రాచీన ప్యాపిరస్ లేక తాళపత్ర గ్రంథాలలో కాని సాక్ష్యం లభిస్తున్నదా? లభిస్తే రష్యన్ పరిశోధకుడు అలెగ్జాండర్ నోటోవిచ్‌కు లభించిన యోగి ఈశా రహస్య జీవిత చరిత్రలోని సంఘటనలను బలపరుస్తున్నదా?

ఈ విషయాలపై విదేశీ చరిత్రకారులు తవ్వి తీసిన సాక్ష్యాధారాలు - ఊపిరి సలపనంతటి ఆశ్చర్యం! అవి రానున్న అధ్యాయంలో పరిశీలిద్దాం!



6

# హిమాలయాల్లో 'యోగి-ఈశా' రహస్య జీవితం తాళపత్ర గ్రంధాన్ని ప్రత్యక్షంగా చూసిన రష్యన్ రాయబారి 'నోటోవిచ్!'

అది 1887వ సంవత్సరం శీతాకాలం! రష్యన్ రాయబారి, విద్వాంసుడు అలెగ్జాండర్ నికోలాయ్ నోటోవిచ్ (Alexander Nikolai Notovitch) తన రాజ కార్యాల నిమిత్తం కాశ్మీరునుంచి గుల్మార్గ్ మీదుగా టిబెట్ పీఠభూమిదాకా తరచూ ప్రయాణాలు చేస్తున్నాడు! ఈసారి లద్దాక్ (Ladakh) నుంచి శ్రీనగర్ వైపుగా వెళ్లాల్సివుంది! దారిలో ఎత్తైన మంచు

పర్వతాలు; అందాలు చిందే వెండి కొండలు! ఎటు చూసినా పులకింపచేసే ప్రకృతి సౌందర్యం! ఆ రోజు నోటోవిచ్ తన పదిమంది అనుచరులతో సహా, తన సామాను గుర్రపు బగ్గీలో హిమాలయాలపైన 3500 మీటర్ల ఎత్తున జోగిల్లా మార్గం (Jogila path) గుండా ప్రయాణిస్తున్నారు!

దాదాపు ఏకాంతంగా నిర్మానుష్యంగా ప్రశాంత ధ్యానముద్రలోవున్న హిమాలయ శిఖరాలను తిలకిస్తూ సాయంత్రానికల్లా నోటోవిచ్ అక్కడవున్న బుద్ధదేవుని ఆలయంలో, పండు ముసలి 'లామాలు' తపస్సు చేసుకునే **లామాసరీ - నోర్వెల్** (Lamasery - Norvel) ఆశ్రమం వద్ద మజిలీచేశాడు! ప్రయాణపు బడలిక సేదతీరాక ఆశ్రమం ఆతిథ్యంగా యిచ్చిన వేడి వేడి టిబెటన్ టీ తాగుతూ పిచ్చాపాటిగా బౌద్ధదేవాలయ పీఠాధిపతితో మాటలలోకి దిగాడు నోటోవిచ్! సహజంగానే సంభాషణ ఆధ్యాత్మిక సాధన మత విషయాలపైకి, దొర్లింది!

వృద్ధుడై, మెరిసిపోయిన వెండిలాంటి గడ్డంవున్న బుద్ధ విగ్రహంలా నిటారుగా పద్మాసనంలో కూర్చున్న ఆ పీఠాధిపతి ఇలా అన్నాడు! "ఇక్కడ మా బౌద్ధమతంతో పోలికగల ఇతర మతాలు ఈ హిమాలయాల్లో కనిపించడం కష్టం. ముస్లింలకూ, మాకూ, చాలా తక్కువ సాన్నిహిత్యం వున్నది! ఇంకా చెప్పాలంటే విదేశీయులైన క్రైస్తవులతోనే మాకు కొన్ని విషయాలలో దగ్గరపోలికలు కనిపిస్తాయి! పరదేశీయులైన తెల్లవారైనా మీరూ, మేము అనుసరించే అహింసా జ్యోతియొక్క అవతారమైన బుద్ధదేవుని ధర్మాన్నే అంగీకరిస్తారు! ధర్మావతారంగా శరీరంధరించి అవతరించిన మా "దలైలామా"ను మేమూ, దైవస్వరూపునిగా ఆరాధిస్తాము! మీరు మీ దలైలామాను ఆరాధించి మీసాంప్రదాయం ప్రకారం మీ క్రైస్తవ దలైలామా యొక్క అహింసా బోధనలను అనుసరిస్తారు! అంతే, తేడా!!

వృద్ధుడైన పీఠాధిపతి అన్న ఆ మాటలకు ఆశ్చర్యపడి నోటోవిచ్



'జీసస్' - ఆశ్రమము - 'లద్ధాక్'

విస్మయంగా అన్నాడు!

"మీరు చెప్పేది ఎవరిగురించి?... "మీ క్రైస్తవ దలైలామా" అంటున్నారు! అంటే మీ అభిప్రాయం ఎవరని?..."

దానికి ఆ బౌద్ధమత గురువు ప్రశాంతంగా ఇలా అన్నాడు!

"నా అభిప్రాయం - మీ క్రైస్తవ మతంలో మీరందరూ ప్రార్థించే మీ దివ్య పురుషుని గురించే!... 'దేవుని కుమారుడ'ని (Son of God) మీరంతా ఎవరినైతే పిలుస్తారో ఆ "యోగి ఈశా" గురించే!

ఏ ఆధ్యాత్మిక సత్యం బుద్ధదేవుని రూపంలో అవతరించిందో అదే అహింసాధర్మం, మీ ప్రవక్త "ఈశా" లోనూ అవతరించిందని మేము భావిస్తాము! అయితే దేవుడికి సరిగ్గా కొడుకుగా పుట్టడం అనే విషయం సంగతి, సరిగ్గా వేరు! ఆయన 'ఈశా' యదార్థ జీవితంలోని ఎన్నో రహస్యాలు మాకు తెలుసు! ఆయన చాలాకాలం ఇక్కడ హిమాలయ పర్వతాలలోని ఆశ్రమాలలో మాతో, కలిసి తపస్సు చేశాడు!'

## యోగి - "ఈశా" :-

పై మాటలకు ఉలిక్కిపడ్డ అలెగ్జాండర్ నోటోవిచ్ ఒక్కసారిగా కరెంటు పెట్టినట్టు షాక్‌తిని, తృళ్లిపడ్డాడు!

ఏమిటిది? ఏసుక్రీస్తు 'ఈశా' అన్న పేరుతో, ఆయన అసలు నామంతో ఈ హిమాలయ ఆశ్రమాలలో వున్నాడా? ఆయన జీవితంలోని అనేక "రహస్యాలు" బయట ప్రపంచానికి వెల్లడికాలేదా! గుప్తమైన ఆధ్యాత్మిక రహస్యాలు నిక్షిప్తమైవున్న తాళపత్ర గ్రంథాలలో ఏసుక్రీస్తు "ఈశా" అద్భుత జీవితం, వీరివద్ద భద్రపరచబడి వున్నదా? అది మన యూరప్‌లో మార్పులూ చేర్పులు చేయబడిన జీసస్ జీవితంకంటె ఏవిధంగా మార్పుగా ఉండి వుంటుంది? అసలు ఏసుక్రీస్తు గురించిన



'యోగి ఈసా రహస్య చరిత్ర' - తాళపత్రాలు దాచబడిన 'భౌద్ధ ఆశ్రమం' హిమ్మిస్

ప్రాచీన తాళపత్ర గ్రంథాలు లభించడమంటేనే ఒక్కసారిగా కోటి రూపాయలు లభించినంత ఆనందాశ్చర్యాలతో ఎగిరి గంతేశాడు అలెగ్జాండర్ నోటోవిచ్!

వారి సంభాషణ అక్కడ హిమాలయ పర్వతాలలోని హిమ్మిస్ మొనాస్టరీ (Himmis Monastery) ఆశ్రమంలో తాను ప్రత్యక్షంగా చూసిన "యోగి ఈశా జీవితం" కళ్ళారా చూసిన తన జన్మ తరించిందని పులకించి పోయాడు! కాని అతడు ఎంత ప్రయత్నించినా ఆ వృద్ధ టిబెటన్ యోగి అతి పవిత్రమైన ఆ రహస్య తాళపత్రాన్ని చూపించడానికే అంగీకరించలేదు!

అనుకోకుండా ఎదురైన ఈ అద్భుతానికి వింతపడుతూ ఆశ్రమానికి విలువైన బహుమతులూ దానాలు సమర్పించి సగౌరవంగా నోటోవిచ్ ముసలి లామానుండి సెలవు తీసుకున్నాడు!

"లేహ్" (Leh) వద్ద ప్రయాణిస్తూ అదేపనిగా "యోగి ఈశా రహస్య జీవితం" తెలిపే తాళపత్రగ్రంథం గురించే కలలుకంటూ టిబెటన్ యాక్‌మీద స్వారీచేస్తున్న నోటోవిచ్ తూలి కిందపడ్డాడు! అకస్మాత్ ప్రమాదంలో అతని వీపుకు, నడుముకూ బలమైన దెబ్బలు తగిలాయి! వెంటనే ఆసమీపంలోనేవున్న "లేహ్" నగరానికి వెళ్లే దారిలోనేవున్న హిమ్మిస్ ఆశ్రమంలోనే నోటోవిచ్‌కు వైద్యమూ ఉపచారములూ జీవకారుణ్యానికి పేరుపొందిన బౌద్ధలామాలే ఏర్పాటుచేశారు!

## అతిపవిత్ర - గ్రంథం :-

కుడికాలు ఎముక విరిగిన నోటోవిచ్ చాలారోజులు అక్కడే ఉండిపోవాల్సి వచ్చింది! అది దైవ సంకల్పం! ప్రతీరోజూ అక్కడి ఆశ్రమంలోనే వుంటూ, వారి ధ్యానము, జపాలు, బుద్ధదేవుని ఆరాధనలోనూ, పాల్గొనేవాడు! క్రమంగా వారితో సాన్నిహిత్యం, స్నేహం, అలా వృద్ధిపొంది, అభిమానం ఆపేక్షగా మారింది! పలుమార్లు ఎంతో భక్తితో బ్రతిమాలగా

నోటోవిచ్‌కు చివరికి, ఆ ముసలి యోగి ప్రాచీనమైన తాళపత్ర గ్రంథాల కట్టలువిప్పి అందులో వందల సంవత్సరాలనుంచీ భద్రపరచబడ్డ అతి విలువైన గ్రంథములమధ్య - "యోగి ఈశా రహస్య జీవితచరిత్ర" అన్న అమూల్య వ్రాతప్రతిని చూపగా కళ్ళారా చూడగలిగాడు!!

భక్తితో ఆనందంతో తాను చిన్నప్పటినుంచీ నమ్మిన ఏసుక్రీస్తు రహస్య జీవితంగురించిన ప్రాచీనగ్రంథం తనకు ఇలా అయాచితంగా కంటితో చూడడానికైనా వీలుపడిందంటే అది నిజంగా జీసస్ ప్రభువు అనుగ్రహమే అన్న భక్తితో ఆనంద భాష్పాలు, కళ్ళనీళ్ళ పర్యంతమయ్యాయి నోటోవిచ్‌కు! ఆ తర్వాత మరి రెండురోజుల అనంతరం ఆ ముసలి బౌద్ధ లామా నోటోవిచ్ భక్తి, ఆనందభాష్పాలుచూసి ఇతడికి నిజంగానే జీసస్ ప్రభువు మీద భక్తివున్నదని గ్రహించి అతి కష్టంమీద ఆ ప్రాచీన తాళపత్రగ్రంథం తెరిచి అందులోని యోగి 'ఈశా జీవితం' అంశాలు చదివి వినిపించాడు! నోటోవిచ్ తనకు అర్థమయ్యేలాగా ఇంగ్లీష్‌లో "నోట్స్ (Notes)" వ్రాశాడు. అయితే దురదృష్టవశాత్తూ ఈ నోట్సులో చాలాభాగం నోటోవిచ్ తన సొంత భావాల్ని తర్వాత కలగలుపు చేశాడు!

## క్రైస్తవ ప్రపంచానికి - భూకంపం :-

ఆశ్చర్యమేమంటే జీసస్‌యొక్క రహస్య జీవితం ఈ హిమాలయ పర్వతాలలోని పురాతన ఆశ్రమంలో కళ్ళారా చూసిన నోటోవిచ్ ఎంతో, అదృష్టవంతుడు! తర్వాత అతడు తన అనుభవాలను ఒక గ్రంథంగా ప్రచురించాడు! అందులో హిమ్మిస్ బౌద్ధ ఆశ్రమం యొక్క, ఫోటో కూడా యధాతథంగా ప్రచురించాడు!

ఆతర్వాత నోటోవిచ్ ప్రచురించిన గ్రంథం రోమన్ కేథలిక్ ప్రపంచంలోనే ఒక పెద్ద భూకంపం లాంటి సంక్షోభాన్ని సృష్టించింది! అది రోమ్ పీఠాధిపతి పోప్ (Pope) దృష్టికి స్వయంగా తీసుకురాబడింది! నోటోవిచ్ ప్రచురించిన గ్రంథంలో ఉదహరించబడిన "యోగి ఈశా

**చరిత్ర"** లోని వివరాలు ప్రచురించవద్దని అతడిమీద పెద్ద పెట్టున వత్తిడికూడా తీసుకువచ్చారు! పెద్ద ఎత్తున సొమ్ముకూడా ముట్టచెప్పాలని చూశారు!

## జీసస్ యదార్థ జీవితం :-

కాని నోటోవిచ్ యొక్క మనస్సు చలించలేదు! ఏసుక్రీస్తు ప్రభువుపై అతనికున్న యదార్థ భక్తి నిజమై నిలిచింది! ఏనాటికైనా "ఈశా ప్రవక్త" యదార్థ జీవితం ప్రపంచం దృష్టిలోకి రావాలి! యూరప్ అంతా ఆరాధించే ఏసుక్రీస్తు జీవితంలో ఎన్నో లొసుగులు, కల్పితాలు, చేర్పులు, మార్పులతో నిండిన అభూత కల్పనలు కాకుండా; అతడి **యదార్థ జీవితం,** క్రైస్తవ ప్రపంచానికి లభించాలి!

దానికి ఎవరు అడ్డినా నోటోవిచ్ ఆగలేదు! ఫలితంగా ఆయన హిమాలయాలలోని **"యోగి ఈశా రహస్య జీవితం"** - అన్న గ్రంథంలో తాను రాసుకున్న నోట్సు చివరికి బహిరంగంగానే ప్రచురించాడు!

## శిలువపై - మరణించలేదు :-

అందులో ఎన్నో ఆశ్చర్యాలు వింతలూ చోటుచేసుకున్నాయి... ముఖ్యమైనది "యోగి ఈశా (Jesus Christ) **శిలువ మీద మరణించలేదు!** ఆయన కాలినడకన 'శంబల' మీదుగా హిమాలయాలను దాటుకుంటూ 'లేహ్' (Leh) నగరంమీదుగా ప్రయాణించి అక్కడ కొంతకాలం తపస్సు చేశాడు! ఆ తర్వాత భారతదేశానికి తీర్థయాత్రచేశాడు! అనేక పవిత్ర స్థలాలను, మహా యోగులను, ఋషీశ్వరులనూ ఇండియాలో దర్శించాడు! ముఖ్యంగా అహింసాజ్యోతియైన బుద్ధదేవుని జీవితం ఈశా ప్రవక్తకు ఎంతగానో నచ్చింది! ప్రపంచ చరిత్రలోనే రక్తపాతం లేకుండా అన్ని దేశాలలోనూ **ధర్మచక్ర** ప్రచారం వ్యాపింపచేసిన ఘనత ఒక్క బుద్ధదేవునికే దక్కింది!

ఇతర మతాలన్నీ - చివరికి క్రిష్టియన్ మతం కూడా, హింసతో

రక్తపాతంతో బలవంతంగా మతం మార్పిడితో నెత్తిన రుద్దబడినవే! అలా కాకుండా తన ఆధ్యాత్మిక శక్తితోనే విశ్వమంతా ధర్మాన్ని వ్యాపింపచేసిన బుద్ధదేవుని జన్మస్థలం, ఆయన జ్ఞానోదయం పొందిన బుద్ధగయ, ఆయన ప్రవచనంచేసిన 'వారణాసి' (కాశి) వంటి ఇతర పుణ్యక్షేత్రాలను 'ఈశా' స్వయంగా దర్శించాడు!

## వృద్ధాప్యంలో - జీసస్ :-

చివరికి పండువృద్ధాప్యంలో ఈశా ప్రవక్త కాశ్మీరులో యోగమార్గంతో శరీరాన్ని విడిపెట్టి శ్రీనగరులో మహాసమాధి పొందాడు!

ఇది - నోటోవిచ్‌కు లభించిన ప్రాచీన తాళపత్ర గ్రంథంలో యోగి ఈశా రహస్య జీవితచరిత్రయొక్క సంగ్రహ సారాంశం! దీనిని అమెరికాలోని ప్రఖ్యాత టెలివిజన్ (T.V.) సంస్థవారు ఒక వీడియో క్యాసెట్‌గా కూడా అద్భుతంగా చిత్రీకరించారు!

**"The Missing Years in the Secret Life of Jesus"**

అన్న అర్థంవచ్చే ఈ వీడియో క్యాసెట్‌ను ఇటీవల 1985 లో అమెరికన్ మిత్రుని ఇంట్లో వీడియోద్వారా చూసి ఆనందించే అవకాశం నాకూ లభించింది!



# 7

# హిమాలయాల్లో పురాతన - "తాళపత్రాల"లో లభించిన 'యోగి-ఈశా' జీవిత చరిత్ర !

బౌద్ధయోగులు, లామాల (Lamasary) ధ్యానమందిరంలోని, పవిత్ర పూజామందిరంలో నిత్యం పూజలందుకునే అతిప్రాచీన తాళపత్రాల గ్రంథాలలో భద్రంగా దాచబడి ఈనాటికీ రక్షింపబడుతున్నది - "యోగి-ఈశా రహస్య జీవిత చరిత్ర".

దీనితోపాటు అనేక పవిత్ర మంత్రగ్రంథాలు అహింసా జ్యోతియైన బుద్ధదేవుడు జీవించివుండగా యోగులైన సాధకులకిచ్చిన ఉపదేశాలు సూత్రాల రూపంలో భూర్జపత్రాలపై, తాళపత్రాలపై, వ్రాయబడిన పవిత్ర

గ్రంథాలతోపాటు ఇది కూడా కలిసి, నిత్యం పూజలో దాచుకోవడం స్వయంగా చూసిన రష్యన్ రాయబారి అలెగ్జాండర్ నోటోవిచ్ కనుగొన్న "జీసస్ జీవితచరిత్ర" ఈ విధంగా ప్రారంభమౌతుంది!

## "యోగి-ఈశా" జీవిత చరిత్ర :

"ప్రపంచంలో అధర్మం అజ్ఞానం కలి పాపములూ పెరిగిపోగా మ్లేచ్ఛ దేశాలలో ధర్మాన్ని బోధించడం నిమిత్తం 'పరమ గురుమండలి' యోగి-ఈశాను, మ్లేచ్ఛదేశాలలో అవతరించమన్న విశ్వాత్మని, ఆదేశంతో, సంకల్పంతో జన్మించాడు!

"ఒక పసిబాలుడు దైవికమైన లక్షణాలతో దూరదేశమైన ఇజ్రాయిల్‌లో జననమొందాడు! అతడి జనన కాలమందు ఏర్పడిన గ్రహస్థితివల్ల అతడిని 'కారణజన్ముని'గా ఒక ప్రత్యేక పని నిమిత్తం జన్మించిన వానిగా, "పరమ గురువులు" ఏడుగురు అతడిని గుర్తించి ఆయన క్షేమం గురించి ధ్యాన జపములు చేసి శిశువును దీవించారు! ఇతని పేరు 'ఈశపుత్రుడు' లేక 'ఈశా' - అని మ్లేచ్ఛభాషలో పిలుస్తారు!"

"అతడి 13 వ సంవత్సరం పూర్తికావస్తుండగా మ్లేచ్ఛదేశం నుండి కాలినడకన కొందరు వర్తకులతో కలిసి బయలుదేరి హిమాలయాల మీదుగా సుదూర ప్రయాణంచేసి సింధుదేశం (హిందూదేశం) మహర్షుల పుణ్యభూమి ఐన భరతఖండానికి యాత్రచేస్తాడు!"

## బుద్ధదేవుని - "ధర్మ"పథంలో "ఈశా" :

"ఇతడు ఆర్యదేశంలో మహాత్ములమధ్య సంచారం చేస్తూ భక్తి జ్ఞానములు కొల్లలుగా వృద్ధిపొందిన వారి జ్ఞానబోధను అందుకుంటూ బుద్ధదేవుని ధర్మ సూత్రములు, ప్రాచీన ఋషుల యోగసిద్ధుల గురించీ తెలుసుకుంటాడు!"

"అహింసాజ్యోతియైన బుద్ధదేవుని ఉపదేశాలపై ఇతడు ప్రత్యేకమైన ఆసక్తిని చూపిస్తాడు! బుద్ధదేవుని కరుణ, అహింస, నిర్మల సాధనాజీవితం, సత్యవాక్యత, బ్రహ్మచర్యము ఇతడిని ఎక్కువగా ఆకర్షిస్తాయి!"

"యువకుడైన 'ఈశా' తన యాత్ర కొనసాగిస్తూ 'పంచ-నదుల' భూమిని (పంజాబ్) చేరుకొని అక్కడ జైనులతో వాదములలో పాల్గొంటాడు!

"ఆ తర్వాత కాలినడకన ప్రయాణించి తూర్పుగానూ, పశ్చిమంగావున్న జగన్నాథక్షేత్రం చేరుకుంటాడు! అక్కడ పరిశుద్ధ వేదపండితులైన బ్రాహ్మణులు యువకుడైన 'ఈశా'కు ఆదరణతో ఆతిథ్యమిస్తారు! అతడి దైవభక్తి నిర్మలత్వము ధర్మమునందు ఆసక్తీ చూసి వారి అభిమాన, అనురాగాలకు ఈశా ముగ్ధుడౌతాడు!

## "ఈశా"కు యోగసిద్ధులు :

వారి వలన 'వేదాల'లోని రహస్య యోగసిద్ధులు, ధ్యానము, బాధానివారణ చేయగల శాస్త్రాలను అధ్యయనంచేసి, ఆ యోగశక్తితో అనేకులు బీదవారికి, తక్కువ జాతివారికి, రోగ నివారణ, ధర్మ ప్రచారమూ చేస్తాడు యువకుడైన ఈశా!"

## "కాశీ" - లో ఈశా :

"అక్కడినుంచి బయలుదేరి ఆరు సంవత్సరాలపాటు వారణాసి (కాశీ) వద్ద రాజగృహము వద్దా, బౌద్ధ ఆరామంలోనూ బుద్ధగయ వద్ద పండిత గోష్ఠిలోనూ, యోగుల సాంగత్యంలోనూ 'ఈశా' యాత్రచేశాడు!"

"తిరిగి అక్కడినుంచి దక్షిణంగా ప్రయాణించి క్రమంగా ద్వారక చేరి, అక్కడి శ్రీకృష్ణదేవుని (Chritos) మందిరం దర్శిస్తాడు! అక్కడి వైష్ణవ యోగుల భక్తి, యశోదా కృష్ణుని (Jeshuva) అద్భుత లీలల గాథల యువకుడైన 'ఈశా' హృదయాన్ని భక్తితో కదల్చివేశాయి!

"అక్కడినుండి "ఈశా" నేపాల్, కాశ్మీర్ చేరుకొని హిమాలయ పర్వతాలలోని యోగులను, పరమ గురువులను దర్శిస్తూ బౌద్ధ ఆశ్రమమైన భూటాన్‌లోని హిమ్మీస్ బౌద్ధారామంవద్దకు చేరి కొంతకాలం బుద్ధదేవుని ధర్మాన్ని గురించి 'సత్యం' కొరకు అన్వేషిస్తూ ధ్యానించే 'బోధిమార్గం' (జ్ఞానమార్గం) గురించి యోగి 'ఈశా' అధ్యయనం చేశాడు!

క్రమంగా హిమవత్పర్వతమార్గంపట్టి తిరిగి తన జెరూసలెంకు 'ఈశా' తన 30వ ఏట, చేరుకుంటాడు!"

**జెరూసలెంలో - ఈశా :**

"అక్కడ తనవారు ఇతడిని గుర్తించక సందేహాలతో, అనుమానాలతో భయంతో ఇతడి బోధనలను అనుమానిస్తారు! కొందరు 'ఎస్సీను'లైన యోగులు ఈశాకు శిష్యులై ధర్మమార్గాన్ని యోగసాధనతో కలిపి ధ్యానించే సాధనను ఉపదేశంగా పొందారు! అట్టి వారికి జీసస్ ఇచ్చిన 'గురు కటాక్షం' (అనుగ్రహం) వల్ల కొన్ని యోగ సిద్ధులు, రోగ నివారణ శక్తులు 'భవిష్యత్తు' తెలుసుకునే ప్రశ్నలు చెప్పగల (Prophecying) సిద్ధులూ లభిస్తాయి!

"దానివల్ల స్థానికులైన "యూదు" (Jew) మతాధికారులతో ఈశాకు ప్రబల విరోధం ఏర్పడి 'ఈశా'కు వ్యతిరేకంగా శతృత్వం కలిగింది!"

**"శిలువ" - శిక్ష :**

"యూదుల రాజకీయ విమోచనం కోసం యుద్ధంలో ఈశాకు సంబంధం వుందన్న నేరంపై ఇతడికి, కొరత (శిలువ) శిక్ష విధించ బడుతుంది!

"పరమాత్ముని దయవల్ల తన శిష్యుల అభిమానంతోనూ యోగి ఈశా తన శిక్ష నుండి బయటపడి కొన ప్రాణాలతో తప్పించుకుంటాడు!"

"తన ఆత్మీయుల సలహాపై యోగి "ఈశా" జీవించి వుండటంవల్లనే అతని శిష్యులకు ధర్మప్రచారంచేసే ప్రోత్సాహం కలుగుతుందని చెప్పి 'యోగి ఈశా'ను తన స్వదేశం జెరూసలెం నుండి తిరుగు ప్రయాణం చేయిస్తారు!

**హిమాలయాల్లో - 'శంబల'కు 'ఈశా' :**

అలా, తన 35వ సంవత్సరంలో తిరుగు ప్రయాణంలో పర్షియా మీదుగా ఆఫ్ఘనిస్థాన్, పర్వతాలలో సంచరిస్తూ సింధునది (India) తీరాన్ని

చేరుకుంటాడు! అక్కడ యోగుల మూలికా సహాయంతో, పరిచర్యలతో "ఈశా"కు సంపూర్ణ ఆరోగ్యం లభించి హిమాలయ శిఖరాలమీదుగా "శంబల" పరమగురువులను (Masters) (7-wisemen) సందర్శిస్తాడు!

## కాశ్మీరులో - ఈశా :

"భారతదేశంలోని కాశ్మీరుచేరి అక్కడ భారతదేశంలోని పరిపాలకులను చక్రవర్తులను, "శక-కర్త"లను కలుసుకుంటాడు!"

"అక్కడినుంచి కాశ్మీరు, నేపాల్, లద్దాక్, భూటాన్, అయోధ్య, ప్రయాగ ప్రాంతాలలో పర్యటనచేసి 'యోగి-ఈశా' అనేకులకు ధర్మబోధ, జ్ఞానబోధ చేస్తాడు!

"భారతదేశంలోనూ హిమాలయ గ్రామాలలోనూ 'ఈశా' బోధనలకు అతడి స్వదేశంలోకన్నా ఎక్కువ అనుచరులూ, భక్తులూ లభిస్తారు! చివరకు యోగి ఈశా హిందూదేశంలో బహుకాలం దైవధ్యానంలో గడిపి చివరకు తన 89వ సంవత్సరంలో 'కాశ్మీర'దేశంలో "యోగసమాధి"ని పొంది తన 86-వ సంవత్సరంలో భగవదైక్యం చెందుతాడు!

ఇతని మహాసమాధి స్థలం "పవిత్ర సమాధి" అని అనేకులు బహుకాలం పూజాస్థలంలా గౌరవిస్తారు!

"యోగి ఈశా" మరణించిన తర్వాత దాన్ని - వెయ్యేళ్లకు తర్వాత, విదేశాలలో ప్రవక్తగా గుర్తించబడి "ఈశాధర్మం" ఈసా - మతమూ ప్రపంచ ప్రఖ్యాతిని పొందుతుంది!

"కలియుగం చివరిభాగంలో ఈశా అన్ని ప్రపంచ జాతులందరికీ అభిమానించే సద్గురువుగా గౌరవించబడతాడు! బుద్ధదేవుని ధర్మాన్ని, అహింసా, దయను బోధించిన ప్రవక్తగా యోగి-ఈశా ఒక 'బోధిసత్వుని'గా తన జీవితాన్ని ధర్మస్థాపనకై జీవించి చివరికి నిర్వాణాన్ని (మోక్షాన్ని) పొందుతాడు!"

# II

అంటూ - ఈ విధంగా సంగ్రహమైన "యోగి-ఈశా" జీవిత విశేషాలు తాళపత్ర గ్రంథంలో, బౌద్ధ ఆశ్రమంలో రహస్యంగా దాచబడివున్నది. ఇలా తాళపత్ర గ్రంథం 'హిమ్మిస్' లోని బౌద్ధ ఆలయంలోనే కాక ఇంకా సంస్కృతంలోని "భవిష్య పురాణం" లోనూ కాశ్మీరు రాజుల చరిత్రలోనూ కాశ్మీర రాజవంశావళిలోనూ కొద్ది కొద్ది మార్పుతో, స్థానికపేర్ల తేడాతో యోగి ఈశాగాథ లభిస్తుంది!

దీనిలోని అనేక అంశాలు ముస్లింల మతగ్రంథమైన ఖురాన్‌లోనూ యూదుల మతగ్రంథంలోనూ బుద్ధదేవుని బోధనలతోనూ సరిపోతున్నాయి!

ఇంతేకాదు; అక్బరు పాదుషా కాలంలోని, "ఫతేపూర్ సిక్రీ"వద్ద యోగి ఈశాకు సంబంధించిన శిలాశాసనం చారిత్రకంగా దీనిలో కనపడుతుంది!

ఇందులో ఈనాటి చర్చి బిషప్పులచే కల్పించబడిన భాగాలుతప్ప, మిగతా అంశాలు హీబ్రూ భాషలోని ఖుమ్రాన్ వ్రాతప్రతులలోని 'యూదుల' (Jewish) మతగ్రంథాలలో వర్ణించిన జీసస్ జీవితంతో పూర్తిగా సరిపోతుంది!

## "యూదుల ప్రవక్త" :

అన్నిటికన్నా ముఖ్యమైన విషయం ఇతడు జన్మించినది యూదులలో!

ఇతడు కష్టించినది యూదుల సముద్ధరణ కోసం! యూదులు ఎవరూ - ఈనాటి బిషప్పుల ప్రచారంలోని బైబుల్ అంశాలపై జీసస్ శిలువమీద మరణించాడని గాని, తిరిగి లేచుటకాని జరిగిందని, నమ్మనే నమ్మరు! ఇతడు భగవంతుని అవతార పురుషుడనిగానీ కూడా (Son of God)గా, యూదులు విశ్వసించరు! ఇది అతి ముఖ్యమైన సాక్ష్యాధారం!

ఎందుకంటే ఎవరైనా - తమ కులస్థుడు, తమ జాతివాడూ, ఏ కొంచెం మహిమలు, మహత్యం ప్రదర్శించినా ఇంతకింతా వారు ప్రచారంచేసి తమవాడిని అనుసరిస్తారు కదా! అలాంటిది జీసస్ స్వజాతివారైన 'యూదు'లే (Jews) అతడిని పాత నిబంధన(Old Testa-

ment)లలో వ్రాయబడ్డ 'భవిష్యత్తు' ఇంకా, కలియుగాంతానికి రావలసి ఉంటుందని నమ్ముతారు!

యూదుల (Jews) ప్రకారం జీసస్ భగవంతుని అవతారంగాని, దేవుని కుమారుడిగా గాని వారు అంగీకరించరు!

ఖురాన్ కూడా 'ఆదం' (Adam) నుంచి యూదుల చరిత్ర అంతా యథాతథంగా మోసెస్ (Moses) వరకూ వర్ణించివున్నది!

కాని జీసస్ విషయంలో పై ముఖ్యాంశాలలో యూదులతోనే అంగీకరించి క్రైస్తవ బిషప్పుల సువార్తలతో విభేదిస్తున్నది! ఇది ముఖ్యమైన చారిత్రక సాక్ష్యం!

## క్రైస్తవులే కాని - "పోప్" (Pope) లు

అన్నిటికన్నా విశేషం కేథలిక్ పీఠాధిపతులైన నలుగురు పోప్‌లు అసలు - క్రైస్తవులే కారు - పైగా వారు, అన్య మతస్థులు.

జీసస్ తన జీవితకాలంలో కొత్తమతాన్ని దేన్నీ స్థాపించలేదని చారిత్రక పరిశోధకులు పైవిషయాన్ని ఉదహరిస్తారు!

ఏది ఏమైనా హిమాలయాలలో లభించే 'యోగి ఈశా జీవితచరిత్ర' పురాణ గ్రంథాలలోని ముఖ్యాంశాలతో సరిపోతున్నది! ఒక్క సువార్తలతోనే విభేదిస్తున్నది అన్నవిషయం గమనార్హం!



# 8

# జీసస్‌ను శిలువవెయ్యటం కళ్లారా చూసిన ప్రత్యక్ష సాక్ష్యం - 'అలెగ్జాండ్రియా ప్యాపిరస్' !

హిమాలయ పర్వతాలలోని బౌద్ధమత లామాల ఆశ్రమాలలో రష్యన్ పరిశోధకుడు నోటోవిచ్ (Notivitch) కు లభించిన "ఈశా రహస్య జీవిత చరిత్ర" అన్న తాళపత్ర గ్రంథం క్రైస్తవ ప్రపంచం అంతటా ఒక బాంబువలే పేలి భూకంపంవంటి ప్రకంపనాలను అమెరికాలోనూ, జర్మనీలోనూ, ఫ్రాన్స్, ఇంగ్లండు, స్విట్జర్లాండు ఇంకా అరేబియా దేశాలలోనూ స్పందనగా వ్యాపించింది! అంతకన్నా బాంబువంటి పేలుడు ఇంకొకటి ఊహించని విధంగా క్రైస్తవ చరిత్రను భూకంపంలా కుదిపివేసింది - దాన్ని గురించి తెలుసుకుందాం!

అది చికాగో నగరం 1907వ సంవత్సరం సాదాగా కనిపించే పుస్తకాల షాపు; ఇండో అమెరికన్ బుక్ కంపెనీ (Indo American Book Company) అందులో యధాలాపంగా చూస్తే ఒక ప్రచురణ చిన్న పుస్తకం - The Crucifixion by an Eye-witness" ఆ పుస్తకం ఆటంబాంబు వలే పేలిన ప్రాచీన ప్యాపిరస్ వ్రాతప్రతిని పరిశోధకులు ప్రచురించారు! అది జీసస్ మరణించిన సరిగ్గా 7వ సంవత్సరం అనంతరం జెరూసలేమ్‌లో ఉండగా ఒక ఎస్సీన్ (Essen) సాధువుల సంస్థకుచెందిన వ్యక్తి అలెగ్జాండ్రియాలోని తన మిత్రుడుకి రాసిన పురాతనమైన ఉత్తరం! అందులో అతడు ఏడేళ్ల క్రితం తాను అనుకోకుండా కళ్ళారా చూసిన సాక్ష్యాధారంగా జీసస్ మరణం వంటి స్థితిలో నుంచి ప్రాణాలతో బతికి బయటపడ్డ అద్భుతమైన అనుభవాన్ని వర్ణిస్తున్నది!

ఈ ప్రాచీన 'ప్యాపిరస్' (Papyrus) వ్రాతప్రతి జీసస్ కాలానికి చెందినది! అది ఈనాటి బైబుల్‌లోని 'సువార్తల' కంటే నూరు సంవత్సరాలు ప్రాచీనమైనది!!! జీసస్‌కు సమకాలికమైన ప్రత్యక్ష సాక్ష్యాధారం ఈ జాబు! ఈ జాబులో జీసస్ అనేవాడు ఎస్సీనులు (Essenes) అనబడే సాధువర్గానికి చెందినట్టు (అప్పటికి క్రైస్తవమతం లేదు) వ్రాయబడి వున్నది! అవి, తను ప్రత్యక్షంగా చూసిన యదార్థ విషయాన్ని వర్ణించాడు! దానియొక్క ఇంగ్లీష్ అనువాదంపైన చెప్పిన చికాగో (Chicago) నగరంలో 1907లో ప్రచురితమైనది అందులో ఇలా వున్నది.

"నేను వర్ణించిన విషయాలు స్వయంగా నేను చూసినవి! కళ్ళారా నా ఎదుట జరిగినవి, నాకు ఎంతో ఆసక్తి రేకెత్తించిన సమాచారం నీకు రాస్తున్నాను!"

"I tell you only of the things I know. And I have seen it all with my own eyes, and have taken a deep interest and an active part in all these transactions."

-35P

ఈ విధంగా వర్ణిస్తున్న ఆ జాబు సాక్షాత్తు జీసస్ శిలువ వేయబడిన తరువాత జరిగిన సమాచారం - శిలువ మీదనుండి జీసస్‌ను దించి ఆ తరువాత తన కళ్లముందరే అతడు చూస్తూవున్న దానిని వర్ణించిన ప్రత్యక్ష సాక్ష్యాధారం (eye witness account). అది ఒక పూర్తి గ్రంథమే, చిన్నదే అయినా! అందులోని ప్రధానమైన అంశాలు మనకు ఇక్కడ ఆసక్తికరమైన అంశాలుగా లభించడం కేవలం అసంభవమైనా కాకతాళీయంగా లభించిన అదృష్టం! ఎందుకంటే "ఇప్పుడు లభించే బైబుల్ మూల గ్రంథాలన్నీ కాపీలకు మార్పులు, చేర్పులు, ప్రక్షిప్తాలు! అసలు మూలగ్రంథం గాని దాని యొక్క అనువాదాలలో కూడా అందులో దొరకని చారిత్రకంగా వ్యర్థమైన రచనలే!" ప్రపంచ ప్రఖ్యాతి వహించిన పురాతన పరిశోధకుడు Powell Devies వాక్యాలలో చెప్పాలంటే -

Scriptures not in the Bible :-

"Most of the books in what we call the 'Testament' were written during a period from about the eighth to the third century; as for example Ecclesiasts"

"All of the original manuscripts are lost - although it is now possible that there are fragments of original manuscripts among those recovered the dead sea caves. Even in the first century B.C. so far as we know, only copies were available. Some of these must have been copies many copyings removed from the originals." -"The Dead Sea Scrolls" - A Powell Device

(American Library - 1956 New York)

పై వాక్యాలు రాసిన గ్రంథం క్రైస్తవ ప్రపంచాన్నంతటినీ కుదిపి వేసింది!

"The greatest challenge to Christian dogma Since Darwin's theory of Evolution."

- అని పత్రికా ప్రపంచం ప్రశంసలందుకున్న పరిశోధనా గ్రంథంలోనిది! ఈ పైవాక్యాలకు అర్థం -

"ఈనాడు మనం పాత నిబంధనలు అని చెప్పుకునే గ్రంథాలు క్రీస్తు పూర్వం 3వ శతాబ్దం నుండే 8వ శతాబ్దం మధ్యలో వ్రాయబడ్డవి! అందులో ఖండికలు (Fragments) వేరువేరు రచనల నుండి పురాతనమైన గ్రంథాల నుండి ఎత్తి వ్రాయబడివి! కొద్దిపాటి భాగాలు (Exodus) ఎక్సోడస్ (Exodus) అన్నది. మూడవ శతాబ్దంనాటిది! అంతకన్న ప్రాచీనమైనవి కావు!

మూల గ్రంథాలు రచనలు అన్నీ నష్టపోయినాయి! అక్కడ కొన్ని ఛిన్నమైన భాగాలు ఖండికలు వాటికి మూలమైన 'వ్రాతప్రతులు' "మృత సముద్రం" గుహలలో లభించిన (Dead Sea Caves) తోలుపై వ్రాసిన మూల గ్రంథాలలోని భాగాలే! క్రీస్తు పూర్వం (B.C) మొదటి శతాబ్దంలో చూసినా ఈనాడు మనకు లభిస్తున్నంతవరకూ అన్నీ కాపీలే! కొన్ని మాత్రం అంతకు పూర్వం ఇలా కాపీ చేయబడిన కాపీలకు చూచి ఎత్తి వ్రాయబడిన చూచి వ్రాతలే! మూల గ్రంథాల నుంచి ఎన్నో అవతారాలెత్తిన నకళ్ళే!

- ఇది ఈనాటి బైబుల్‌లోని పాత నిబంధనలు "దేవుని వాక్యం - అని మనం నమ్మే మూల గ్రంథంయొక్క స్థితి! (New Testment) 'కొత్త నిబంధనలు' జీసస్ జీవిత కథలకి సంబంధించిన భాగాలు. ఇంతకంటే కనాకష్టం! అవి క్రీస్తు తర్వాత నూరు సంవత్సరాల నుండీ 8వ శతాబ్దం దాకా (100 A.D. - 800 A.D.) ఏర్పడినవి.

దీనినిబట్టి చూడగా జీసస్ మరణానికి 7 సంవత్సరాల తర్వాత కాలంనాటి వ్రాతప్రతి లభించడం ఎంతటి అపూర్వమైన అదృష్టమో పరిశోధకులకే తెలుస్తుంది! దీన్నిబట్టి చూస్తే 1907లో చికాగోలో ప్రచురించబడిన ఈపురాతన 'ప్యాపిరస్' వ్రాతప్రతి యొక్క చారిత్రకమైన విలువ ప్రాముఖ్యత ఈనాటి బైబుల్‌కన్నా ఎన్నో వందలరెట్లు విలువైనదీ ప్రాచీనమైనదీ! దానిలో వర్ణించిన విషయాలేమిటో ఈ క్రింద, చూద్దాం!

అది, క్రీస్తు శిలువవేయబడ్డ ఏడో సంవత్సరంలో జరిగిన యావత్ సమాచారాన్నీ ప్రత్యక్షంగా స్వయంగాచూసిన ప్రత్యక్ష సాక్షి రాసిన ఉత్తరం!

అలెగ్జాండ్రియాలోని తన మిత్రునికి తాను స్వయంగా చూసిన ఎంతో ఆశ్చర్యకరమైన వింతగా, శిలువ వేయబడ్డ ఒక వ్యక్తి మరణించకుండా, తిరిగి స్పృహలోకి పునరుజ్జీవింపడటం (Revival back to Consiousness) ఎలా జరిగిందో వర్ణించే అతి ప్రాచీనమైన 'ప్యాపిరస్' (Papyrus) వ్రాతప్రతి - దానిలోని సమాచారం సంగ్రహంగా ఈవిధంగా వ్రాయబడింది.

## కళ్యారా చూసిన ప్రత్యక్ష సాక్ష్యం :

జీసస్‌ను శిలువమీద మేకులుకొట్టి, బిగించాక అతడిని శిలువనుంచి దించే సమయంలో జరిగిన వింతలు ఈ "లేఖ" తెలుపుతోంది :

"సర్వత్రా చీకటి వ్యాపించింది ! ప్రజలు జెరుసలెంకు తిరిగి వెళ్ళిపోయారు... జీసస్ గట్టిగా బాధతో ఆర్తనాదంచేశారు ! తనను ఈ బాధనుండి, ఈ అవమానంనుంచీ రక్షించమని!"

"క్రమంగా వాతావరణం వేడెక్కసాగింది ! చుట్టూ గాలి వెచ్చగా మరింత వేడిగా సెగలు పొగలు వెదజిమ్మాయి ! ఆ ఉక్క మొట్ట భరించరాని స్థితికి చేరుకుంది ! భూమిలోపల ఏదో అగ్ని రాజుకుంటే ఆ వేడికి గాలీ, నీరూ నిప్పూ ఉడికించబడి పరిశుద్ధి చేయబడుతున్నట్టుగా ఒక అనుభూతి వ్యాపించసాగింది! ! అక్కడ చేరిన 'ఎస్సీను' (Essenes) మత సాంప్రదాయస్థులు వారికున్న శాస్త్రజ్ఞానంతో ఈ వేడిని, ఉక్కను గమనించి అది భూకంపం రాబోయే ముందు ఏర్పడే ఒక ప్రకృతి సూచనగా గమనించారు అంతకుముందు పూర్వీకులకాలంలో భూకంపాలు వచ్చినప్పుడు వారికున్న అనుభవం దృష్ట్యా !

క్రమంగా ప్రొద్దువారి రాత్రి సమీపించింది. ఉన్నట్టుండి భూమి భయంకరంగా వణకసాగింది ! అక్కడున్న రోమన్ సైనికులు ఒక్కసారిగా భయభ్రాంతులై ఆకాశంవైపు తిరిగి రోమన్ దేవుళ్ళను ప్రార్థించసాగారు! అక్కడి జనం చాలామంది భయోత్పాతానికి గురై శిలువవేసిన ఆ ప్రాంతాల నుంచి నిష్క్రమించి కంగారుగా తమ ఇళ్ళకు జెరుసలెంవైపు కలిపోయారు ! ఆ ప్రదేశంలోవున్న ఒక

సెంచురియాన్ సైనికుడు కొంచెం ఉదాత్తభావాలు కలవాడైవుంటాడు, జాలిగుండెతో అక్కడున్న జాన్(John) అనే వ్యక్తిని, జీసస్ తల్లిని శిలువదగ్గరికి సమీపంగా తీసుకురానిచ్చాడు !"

"అతడు జాన్‌తో, జీసస్ తల్లిగురించి జాగ్రత్త తీసుకోమని సానుభూతిగా మాట్లాడుతూండటం కనిపించింది ! పూర్ణిమ చంద్రుడు వెలుగువున్నా వాతావరణం అంతా చీకటి అలుముకోసాగింది. అక్కడికి సమీపంలో కనిపించే "మృత సముద్రం"(Dead Sea)పై ఒక దట్టమైన ఎఱ్ఱని పొగమంచు ఆవరించుకోడం కనిపించింది ! జెరుసలెం పరిసర ప్రాంతాలలో కొండచరియలు ఒక్కసారిగా తీవ్రంగా వణకసాగాయి ! ఆ కుదుపుకి చుట్టుప్రక్కల నేలంతా గడగడలాడింది ! ఆ సమయంలో జీసస్ తలవాల్చి ఛాతీమీద స్పృతిలేకుండా వాలిపోయాడు! ఆఖరిసారిగా బాధతో పెట్టిన పొలికేక వినిపించకుండాపోయి నిశ్శబ్దంలోంచి చుట్టూ ఉన్న కారడవిలోనుంచి ఒక బుస్సుమన్న ఆవిరివంటి శబ్దం వ్యాపించింది!

అక్కడవున్న యూదులు(Jews) విపరీతమైన భయానికిలోనై వణకసాగారు !... ఎందుకంటే వారందరి విశ్వాసంలో ఆశబ్దం భూమికీ, ఆకాశానికి మధ్యన వుండే దుష్టభూతాలు బైటికి వచ్చి చుట్టూరా ప్రజలని కబళిస్తాయని భయపడిపోసాగారు! నిజానికి అది భూకంపం వచ్చేముందు గాలిలా వినిపించే ఒక హోరు! యూదులు ఇదంతా దైవభీతితో చూడసాగారు ! అక్కడ కాపలావున్న సెంచురియన్ సైనికులు 'జీసస్ నిర్దోషి' అన్న నమ్మకంకలవారు ! జీసస్ అనుచరుల నుద్దేశించి "సోదరా ! మీ మంచి మిత్రుడిని ఈ శిలువ మీదనుంచి మేము రక్షించలేదని మీరు దూషించవద్దు ! మాకు దైవ శాసనంలాంటి ఆజ్ఞను పాటించి ప్రభుత్వ విషయాలలోనూ, చట్టరీత్యా విధించిన శిక్షల అమలులోనూ కలుగజేసుకోకూడదన్న నిషేధమున్నది! అందుకని అశక్తుడను ! మా రోమనులకు ఈ శిలువ శిక్షతో ఎట్టిసంబంధమూ లేదు !"

- p. 66

ఇలాగ మొదలుపెట్టిన ఆ జాబు జీసస్ శిలువవేయబడ్డరోజున

జరిగిన ప్రతీ చిన్న విషయాన్నీ కళ్ళకు కట్టినట్టుగా వర్ణిస్తోంది ! అందులోని అనేక వివరాలు ఈనాటి "సువార్తల"లో కూడా ఎక్కడా లభించవు ! ఇంకో విశేషం ! ఇప్పుడు సువార్తలలోని నికరమైన ముఖ్యాంశాలు ఈ జాబులో వున్న వర్ణనతో ఖచ్చితంగా ఎక్కడా భేదించకుండా సరిపోతాయి' చివరి కొన్ని ముఖ్యభాగాలు తప్ప !! ఆ జాబు యింకా యిలా వర్ణిస్తోంది ...

# II

"ఆ భూకంపం సద్దుమణిగాక చుట్టూ జనం అందరూ పలాయనమైపోగా జోసఫ్ అనే వ్యక్తి నికోడిమస్ అనేవాడితో కలిసి శిలువవద్దకు వచ్చాడు! అప్పుడు వారికి జీసస్ మరణశిక్షగా శిలువ వేయబడ్డాడని తెలిసింది! నిదానించి శిలువవైపు చూశారు ఆశ్చర్యంతో ! ఎందుకంటే 'కనీసం 7 గంటలైనా దాటకుండానే శిలువపై జీసస్ మరణించడం అంత త్వరగా ఎలా జరుగుతుంది?' అన్న అశ్చర్యంతో !! వారు జీసస్ మరణించాడని నమ్మలేదు. జాన్ ఒంటరిగా ఒక్కడే వున్నాడు!"

"అప్పుడు జోసెఫ్ నికోడిమస్‌తో కలిసి జీసస్ శరీరాన్ని తాకి శ్రద్ధగా పరీక్షించాడు. నికోడిమస్ ఉలిక్కిపడ్డాడు! జోసఫ్‌ను ఒక ప్రక్కకి లాగి అతడితో -

"నాకు నిర్ధారణగా తెలిసిన అనుభవంప్రకారం 'జీసస్ ఇంకా కొన ప్రాణంతోనే వున్నాడు!' నిశ్చయంగా ఆయనను మనం రక్షించవచ్చు వని నా అభిప్రాయం !"

- 65 P

"ఇది జాన్‌కి వారిద్దరూ చెప్పకుండా రహస్యంగా వుంచారు ! ఆ తర్వాత జోసఫ్‌ను ఒప్పించాడు అతికష్టంమీద ! తనకి కొంచెం ప్రమాదమున్నా సాహసించి శిలువ మీదనున్న మిత్రుని దించడానికి రోమన్ గవర్నరు పిలాత్ అనుమతిని సంపాదించాడు ! ఆ రోజు రాత్రికి రాత్రే శిలువ మీదనుంచిదించి ఆ ప్రక్కనేవున్న రాతి సమాధిలో పెట్టాలని.

నేను ఆ సమయంలోని జోసెఫ్ అసలు ఉద్దేశాన్ని గ్రహించుకున్నాను! జాన్ వెనుకనే నిలిచి వాళ్ళు చేస్తున్నదంతా గమనించాను. ఒకరు "అక్కడి రోమన్ సైనికుడు జీసస్ కాలి ఎముకలు తొందరపడి విరక్కొట్టకుండా కాపలా వుండిపోయాడు..."

- 68 పేజీ

"...యూదుల మతసభ జీసస్‌ను శిలువవేయమని కోరినవారే, శిలువ వేసిన వారందరి ఎముకలూ విరగగొట్టి అప్పుడే సమాధిచేయాలనికూడా కోరివున్నారు". - 65 పేజీ

అలా మొదలైన ఈ జాబు ఇంకా అక్కడ జరుగుతున్న ప్రతి చిన్న అంశాన్ని రికార్డు చేస్తూ ముందుకు సాగింది. జోసఫ్ నికోడిమస్‌తో కలిసి వెళ్ళిన కొంత సేపటికి ఒక సైనిక వార్తాహరుడు రోమన్ అధికారులనుంచి - శరీరాన్ని శిలువమీద నుంచి దించటానికి, వాటిని సమాధి చేయటానికీ అనుమతి లభించిందని చెప్పాడు! అతడు వారు 'స్వయంగా పిలాతును కలిశావా?" అని జోసఫ్‌ను అడగటం దానికి జోసఫ్ బదులుచెప్తూ -

"నేను ఇప్పుడు పిలాత్ నుంచి నేరుగా రావడంలేదు ! ఆయన కార్యదర్శినుంచి. ఇలాంటి చిన్న విషయాలకు గవర్నర్ దాకా వెళ్ళే పని వుండదు!"' అన్నారు.

నికోడిమస్ గట్టిగా అరిచాడు

"మనం వెంటనే ఇతడి శరీరాన్ని తీసుకుపోవాలి ! లేకపోతే వీళ్లు ఎముకలు విరగ్గొట్టే ప్రమాదముంది! అప్పుడు రక్షించలేము !" తను ఇలా బిగ్గరగా అరచిన సంగతి తానే గమనించి, భయపడి గుసగుసలాంటి రహస్యశబ్దంతో అన్నాడు."

"అవమానకరమైన ఈ శిలువశిక్షనుంచి రక్షించవచ్చని నా అభిప్రాయం !!' - పేజీ (62)

ఆ రోమన్ సైనికుడు నా ఆతృతనూ, దిగులునూ గమనించి సానుభూతిగా ఇలా అన్నాడు-

"ఇదిగో ! నువ్వూ చూశావుకదా ? ఈ శిలువ వేయబడ్డవాడు మామూలు వ్యక్తిలా కనిపించడంలేదు! ఇతను నిర్దోషి ! అతడిని హింసించడం, అవమానించడం కొంచెం ఆపండి ! ఇప్పుడే ఒక ధనవంతుడు రోమన్ పిలాత్ (Pilate) వద్దకెళ్లాడు. తగిన సొమ్మును ముట్టచెప్పి జీసస్ శరీరాన్ని స్వాధీనంచేసుకొని సగౌరంగా సమాధి చేయడానికి అనుమతికోరడం కోసం !"

"నేను ఇక్కడనుంచి చూసిన అనుభవంతో చెపుతున్నాను ! పిలాతు కొన్ని సమయాలలో శిలువవేసినవారి మిత్రులకు శరీరాన్ని అప్పగించడానికి అనుమతినిచ్చేవారు ! వారు సమాధి చేసుకునేవారు !" ఇంతట్లోకే రెండవ సైనికుడు జీసస్‌కు ప్రక్కనే శిలువవేయబడ్డ ఇద్దరు దొంగల కాళ్ళను విరగ్గొట్టి ఎముకలను భగ్నంచేశాడు! ఆ తరువాత మూడవ వ్యక్తి శిలువ వేయబడ్డ ప్రదేశాన్ని సమీపించగా...

"ఎముకలు విరగగొట్టవద్దు ! ఎందుకంటే అతను మరణించే వున్నాడు!"

ఇంతలోకే పిలాతునుంచి ఒక వార్తాహరుడు సెంచూరియన్ (Centurion)సైనికుడు హడావుడిగా వచ్చాడు ! "పిలాతు జీసస్ నిజంగా మరణించాడో లేదో నిర్ధారణ చేసుకురమ్మని నన్ను పంపించాడు!" అన్నాడు దానికి మొదటివాడు.

"అవును నిజమే ! అందుకే అతడి ఎముకలను విరగ్గొట్టే అవసరం కలుగలేదు !" అన్నాడు.

ఈ సమాధానం విన్న వార్తాహరుడు సంతృప్తిపడ్డా కొద్దిగా అనుమానిస్తూనే జీసస్ కట్టి వున్న శిలువని సమీపించాడు !

మొదటి ఇద్దరి వ్యక్తులవంకా అనుమానంగా చూస్తూనే తన శూలంతో జీసస్ డొక్కమీద గుచ్చాడు! శరీరంలో కదిలికలు స్పర్శజ్ఞానం కనిపించలేదు ! శూలం బయటికి లాగి అతడు వెనుదిరిగి పిలాతుకు రిపోర్టు చేయడానికి వెళ్ళాడు !

అక్కడున్న ఇద్దరు మిత్రులు జాన్‌తో కలిసి శిలువ మీద వున్న జీసస్‌ను సమీపించి పరీక్షగా చూశారు. శూలం గుచ్చిన చోటునుంచి నీరూ (రసి) ఆవెంటనే రక్తం చిమ్మింది! దాంతో జీసస్ జీవించే వున్నాడని మాకు ధైర్యం కలిగింది ! ఆయనకా పూర్తిగా స్మారకం తెచ్చే ప్రయత్నాలు చేయవచ్చునని ఆశకలిగింది !

- అంటూ ఇలా సుదీర్ఘమైన ఆజాబు ఆ జరిగిన ప్రతిచిన్న సన్నివేశాన్ని వివరంగా వర్ణిస్తోంది !

"నికోడిమస్ జాన్‌ను భుజంమీద చెయ్యిపెట్టి పక్కకులాగి ఆదుర్దాగా గుసగుసలాడుతున్న మాటలువిన్నాను !

"జోసఫ్ పిలాతుతో మాట్లాడుతూ వుండగా నేను ఆదుర్దాగా మా నివాసం వైపు పరుగెత్తి అక్కడ దాచివుంచిన మందు మూలికల వంటి తీవ్రమైన గాయలకు చికిత్స చేసే మలాము (ఆయుర్వేదం) మర్దనా చేసే పూత వంటి లేపనం సీసాను సేకరించుకొని వచ్చాను ! దీని విషయం ఎక్కడా బయటకు పొక్కనీయవద్దు ! జాన్‌కు అసలే చెప్పకండి ! అతడు సంతోషాన్ని దాచుకోలేడు. ఇది చాలా ప్రమాదం! ఎవరికన్నా తెలిస్తే శత్రువుల చేవిన పడిందంటే జీసస్‌తో పాటు మనందరిగి కూడా వధించడం ఖాయం! అంటూ వుండగా వారిద్దరూ శిలువును సమీపించారు! నిదానంగా తాళ్ళకి కట్టివుండే ముడిని విప్పి పాదాలలోకి దిగగొట్టిన శీలమేకులు వూడబీకి చేతులలోని మేకులు కూడా తీసి శరీరాన్ని అతి జాగ్రత్తగా కిందికి దించారు. శిలువ మీద నుంచి ! నేల మీద మిట్టపల్లాలు లేకుండా శయనింపచేశారు !

"ఆపైన నికోడిమస్ తన మూటలోంచి గుప్పుమని ఘాటుపరిమళం కలిగిన మందు పట్టీలేసే పూతను తీశాడు ! ఇంకా మూలికలు మర్దనా చేసేవి గాయాలపై పట్టించాడు ! దాని వల్ల గాయాలుకుళ్ళడం, చీముపట్టడం ఆగిపోతుంది ! ఆ పట్టీలు వేసలైను వంటి మందుపూతలు గొప్ప ఔషధగుణం కలిగినవి ! మా ఎస్సీనుల సాధువులలో వీటితో వైద్యం తెలిసిన సాధువులున్నారు! అలా జోసఫ్ నికోడిమస్ ముందుకి

వంగి స్పృహలేని జీసస్ ముఖంలో ముఖం పెట్టి పరీశీలనగా చూస్తుంటే వారి కళ్ళ నుంచి నీళ్ళ చుక్కలు పడ్డాయి ! జీసస్‌లోపలికి శ్వాసను వూది కణతలు,నుదురు,అరికాళ్ళు గట్టిగా మర్ధనా చేసి వేడి పుట్టించసాగాడు!"

(74P)

'మరికొంత సేపటికి ఆ దగ్గరే వున్న రాతి సమాధి వద్దకు జీసస్‌ను చేర్చి మెత్తని పచ్చిక గడ్డిపరుపులా వేసి సత్తువ లేకుండా వేల్లాడుతున్న శరీరాన్ని పడుకోపెట్టారు! అప్పుడు నిప్పుకణికలపై సాంబ్రాణి వంటి పొగ ధూపంగా వేసి స్మారకం తెప్పించే మందులు వేసి పొగవేశారు! క్రమంగా మందులు ధూపం మలాము పనిచేసేలోగా వేడిపుట్టి శరీరం రక్షణకై తెల్లని సన్నని బట్టనుచుట్టి (-ఈగలు, దోమలు గాయాలపై పడకుండా) పెట్టారు.'

"ఆ తర్వాత రాతి సమాధిపైన ఒక బండరాయిని కోణంగా అమర్చి పెట్టారు (కొద్దిగా గాలి తగిలేలాగా) కొద్దిసేపటిలో సుగంధ పరిమళాలు ఘాటైన మందుమూలికల పట్టీలు సాంబ్రాణి వాసనతో ఆ సమాధి నిండిపోయింది."

పై జాబు ఇలాగ జీసస్ శరీరాన్ని అతడి అనుచరులైన నికోడిమస్, జోసఫ్ చేసిన ఉపచారాలని స్పష్టంగా వర్ణించి బయట యూదులలో కలిగిన సంచలనం అనుమానం జీసస్ మరణించలేదేమో అన్న సందేహం కలిగి వారి పురోహితుడు "ఖయ్యుఫాస్" (Chaipas) తన గూఢచారులను పంపించాడు; ఏం జరుగుతోందో సమాచారం తెలుసుకోవాలని! అతడికి రోమన్ అధికారి పిలాతుమీద నమ్మకం లేదు! ఎందుకంటే అది మాత్యా నుంచి వచ్చిన జోసఫ్ అనేవాడికి డబ్బు తీసుకోకుండానే శరీరాన్ని అప్పగించినందుకు గుర్రుగావుంది! జోసఫ్ అంతదాకా జీసస్ శిక్షలో జరిగే వాటిలో ఏమీ కల్పించుకోలేదు. కాని తన సమాధికోసం తయారు చేసుకున్న దానిని మాత్రం ఇచ్చాడు!

(P 76)

"యూదుల మత గురువు ఖయ్యుఫాస్‌కు తెలిసింది! శరీరానికి జీవం

వుందని, దానికి మందుపూతలుపూసి దానిని భద్రపరచాలని ఏదో రహస్య పద్ధతులు ఉపయోగిస్తున్నారని, ఎలాగ జోసఫ్‌ను అపరాధిగా జైలుశిక్ష వేయించాలా అని తీవ్రంగా ఆలోచనలో పడ్డారు! సాయుధులైన అనుచరులు కాపలా కాస్తుంటే జీసస్ శరీరం భద్రపరచిన దానికి అట్టే దూరం లేకుండా సమాలోచనలు జరిపారు!"

"ఇంతలోకే నికోడిమస్ కంగారుగా తన అనుచరులను తొందర పెట్టసాగాడు! వృద్ధులు అనుభవజ్ఞులు బాగా జ్ఞానం కలవారిని ఒక సమావేశంగా ఏర్పాటు చేసి జీసస్‌ను తిరిగి స్మారకం తెప్పించేందుకు ఎలా చేయాలా? అని ఒక సాయుధుడైన కాపలావాణ్ణి జీసస్ సమాధివద్ద కాపలా వుంచారు !"

ఇలా వర్ణిస్తూ ఆ "లేఖ" ఆలెగ్జాండ్రియాలోని తన మిత్రునితో మరికొన్ని ఆశ్చర్యకరమైన చారిత్రక విషయాలను తెలియచేస్తోంది!

## మళ్ళీ భూకంపం :-

"అర్థరాత్రి దాటాకా తెలతెలవారుతుండగా భూమి మళ్ళీ గడగడా కంపించ సాగింది! గాలిలోని వాతావరణం వెచ్చగా ఊపిరి సలపనట్టు ఉంది! చుట్టూ శిఖరాలు కొండచరియలు బీటలిచ్చి పెళ్ళలు విరిగిపడ్డాయి! ఎర్రని మంటవంటి వెలుగు కాళ్ళలోంచి సెగచూపింది! నిజానికి అది ఒక భయంకరమైన కాళరాత్రి! అడవి జంతువులు భూకంపంవల్ల రాత్రంతా గోల పెడుతూనే వున్నాం! అన్ని దిక్కులా! ఆ యూదుల మతాధికారి, అనుచరులంతా ప్రాణభయంతో బేజారెత్తి పోయారు! గాలిలో బుస్సుమన్న శబ్దం! ఆ తర్వాత ఉరుములాగా భూకంపం సర్వత్రా వ్యాపించింది!

(P. 77)

ఎటువాళ్లటు సర్దుకున్నారు ! ఆ సమయంలో జీసస్ అనుచరులు రసీద్ మిత్రమండలి సభ్యులు నాలుగవ అంతస్తు అధికారం కలిగిన

సాధువు వెంటరాగా ఒక రహస్య మార్గం గుండా కొండ చరియలో నడిచి జీసస్‌ను భద్రపరచి వున్న సమాధి వద్దకు చేరారు !

"పలాయనం చేస్తున్న యూదు అనుచరులు చాలా దూరం నుంచి జీసస్ సమాధి వద్ద నిలబడ్డ తెల్లని బట్టలు ధరించిన మత గురువులను మసక చీకటిలో చూశారు ! ఒక్కసారిగి వారికి భయం పట్టుకుంది ! ఈ భూకంపంలో వారు భయపడే దేవతలు అక్కడ ప్రత్యక్షమై వుంటారని భావించారు ! అప్పుడు ఆ రాతి సమాధిపై నున్న బండను తొలగించి శరీరాన్ని పదిల పరచిన మూతను తొలగించారు ! జీసస్ శరీరాన్ని పరీక్షగా పరిశీలించారు ! తెల్లని వస్త్రాలు ధరించిన ఎస్సీన్ సాధువులు ! దగ్గరగా చూస్తే శరీరంలో గల చైతన్యం వారికి గోచరించింది ! ఆవెంటనే ఒక కదలిక ! వారు ఛాతీపైన అతి నిశ్శబ్దంగా శ్వాసప్రక్రియ నడుస్తూ ఉండటం గమనించారు ! ఆనందంతో కేకపెట్టబోయి జీసస్ అనుచరులు నోటిపై వెలుపెట్టి నిశ్శబ్దం చేశారు! సంజ్ఞలతోనే సంభాషిస్తూ గాయాలనుండి ప్రవహించే రక్తం, నీరు పరిక్షించి జీసస్ ప్రాణాలతోనే వున్నాడని తెలుసుకున్నారు !

జోసఫ్ నికోడిమస్ ముందు నడువగా, వెనకాలే "ఎస్సీన్" సాధువులు 24 మంది వెంట నడిచారు! మొదటి డిగ్రీ అధికారంగల పీఠాధిపతులు వారు ! జీసస్ శరీరాన్ని సమీపించి దగ్గరగా కళ్ళుపెట్టి ఏకాగ్రతతో చూడడం, జీసస్ కళ్ళు తెరిచి వారిని గమనించడం ఒకేసారి జరిగింది! ఆనందం సర్వత్రా వెల్లి వెరిసింది ! జీసస్ తన ఎస్సీన్ (Essenes) మిత్రులను గుర్తించాడు ! కళ్ళు ఆనందంతో మెరిశాయి ! చెంపలలో రక్తపు చారలు తిరిగి చోటుచేసుకున్నాయి!

"నేను ఎక్కడ వున్నాను?" అంటూ నీరసంగా అస్పష్టంగా మూలుగులా విన్పించాయి జీసస్ మాటలు ! జోసఫ్ ఆనందంతో కౌగలించుకొని అతి నెమ్మదిగా తలకింద చేయిపెట్టి శరీరాన్ని భద్రంగా లేవనెత్తితీశాడు!"

ఆ తర్వాత ఏం జరిగింది కొన్ని పేజీల అనంతరం ఆ లేఖ కళ్ళకు కట్టినట్లు ఇలా వర్ణిస్తోంది!

"జీసస్ ఆనందంతోనూ ఆశ్చర్యంతోనూ జోసఫ్ ఛాతీపై తల ఆన్చి దేవుని దయకు కృతజ్ఞతతో విలపించాడు! నికోడిమస్ బలవంతం చేయగా కొన్ని రొట్టె ముక్కలను చేతిలో వుంచి తినిపించాడు ! కొన్ని ఖర్జూరాలను ఆరగించాడు! మరికొంత సేపటికి నికోడీమస్ ద్రాక్ష సారాయిని కొద్దిగా త్రాగించాడు! జీసస్‌కు త్రాణకలిగి ఓపిక వచ్చింది! బలవంతంగా ప్రయత్న పూర్వకంగా లేచి కూర్చుని శరీరం కదిలిక తోటే శిలువలోని గాయలు తీవ్రంగా బాధించాయి ! వెనువెంటనే నికోడిమస్ మర్దనాచేసి మందుపూతలు వేయగా గాయలునొప్పి తీసేసి చెమట పెట్టించాయి!"

## జీసస్ శత్రువుల నుండి కనుమరుగు కావడం !

ఈ ప్రత్యక్షసాక్షి తను చూసిన వింతని పూర్తి వివరాలతో వర్ణిస్తూ తానూ "ఎస్సీను" (Essene) సాంప్రదాయానికి చెందిన "యూదు"డే కావడంవల్ల అతి గుప్తమైన రహస్య ప్రక్రియలతో జీసస్‌కు తిరిగి స్పృహ తెప్పించిన విశేషాలను వర్ణించాడు! ఆ తర్వాత ఎస్సీనుల రహస్య సోదరబృందం సాయంతో జీసస్‌ను అక్కడ నుండి తరలించారు! జోసఫ్ అన్నాడు:

"ఇది ఇంకా నువ్వు ఇక్కడ వుండదగ్గ ప్రదేశంకాదు ! చుట్టూ ఎటుచూసినా శత్రువులు గూఢచారులు. ఈ ప్రాంతం విడిచిపోవడం చాలా అవసరం!"

కాని జీసస్‌కు ఇంకా లేచి నిలబడి నడవగలిగే ఓపిక లేదు !

ఎస్సీన్ మిత్రుల సపోర్టుతో అతి నెమ్మదిగా ' ఆ వధ్యస్థానానికి (Calbary) దగ్గరలోనే వున్న తోటలోకి చేర్చారు !

(P. 81)

ఎస్సీన్ మిత్రమండలి శిష్యుడిని అర్జంటుగా ఇద్దరు సహాయకులతో జీసస్ శిలా సమాధి వద్దకు పంపించారు. అక్కడ ఉన్న గుర్తులను,

సాక్ష్యాలను పూర్తిగా తుడిచి పెట్టి రమ్మని! అంతే కాకుండా మందులు కాని, వాటి తాలూకు వాసన కాని ఆ మందు సీసాలు కాని గుర్తుకైనా లేకుండా నిర్మూలించారు.

"జీసస్ తన రహస్య యోగమిత్రుల మకామునకు అతి కష్టంమీద చేర్చబడ్డాడు! బలహీనంగా కొనవూపిరితో ఉన్నాడు! గాయాలు బాధ పెట్టసాగాయి! అయినా తన మిత్రులు తన కోసం పడిన తపన చేసిన సాహసం జీసస్‌ను కదల్చి వేశాయి! అదంతా భగవంతుని దయతో జరిగిన ఒక అద్భుతంలా భావించాడు! జీసస్ అన్నాడు.

"దేవుడే నన్నీ రోజు బ్రతికించాడు, వీరి ద్వారా! నా ఉపదేశాలు నేను ఇచ్చిన ప్రవచనాలు బలపరిచి నా కార్యక్రమానికి ఊతనిచ్చాడు. నా శిష్యులకు నేను జీవించే ఉన్నానని తెలియాలి!

(P. 82)

## జీసస్ శిష్యులను కలుసుకోవడం :-

తర్వాత ఆశ్చర్యంగా ఎస్సీన్ మిత్రుడు అతి రహస్యస్థలంలో జెరూసలేమ్‌కి సమీపంలో మెస్సీదా (Messeeda) లోయ వద్ద యూసరస్ అనేవాడి ఇంట్లో మిత్రుల సమావేశం ఏర్పాటు చేశాడు! ఆ తర్వాత కొన్నాళ్లకు కారమిల్ గుట్ట (Karmel Mount) వద్ద ఇథానియా గెలైలా (lethamia Galiila) అన్న చోట్ల కూడా జీసస్ శిష్యులతో ప్రవచనాలు ప్రసంగాలు చేశాడు!

## యూదుల ప్రతీకారం :-

ఈ జాబులో ఇంకొక ఆశ్చర్యకరమైన విషయమేమంటే యూదులకు అనుమానం కలిగింది జీసస్ శిలువ నుండి ఎలాగో రక్షింపబడ్డాడని, ఆయన ఖాళీ సమాధి చూసి మనం పంపిన వేగులు గూఢచారులు రూఢీ

చేసుకొని జీసస్‌ను ఎలాగైనా అంతమొందించాలని ప్రయత్నాలు ప్రారంభించారు అన్న విషయం! దీని గురించి రాస్తూ ఆ లేఖ ఇంకా ఇలా...

నికోడిమస్ ఆ మిత్రమండలికి వచ్చి ఆరోజే జోసఫ్‌ను అరెస్టుచేశారని జీసస్ గూఢచారి అతనిపై అసత్య ఆరోపణలు అంటూ చేశారు!

(P. 110)

ఆ తర్వాత కొంత కాలానికి జెరుసలెంలోని ఎస్సీన్ మిత్రమండలి ప్రయత్నాల ఫలితంగా జోసఫ్ విడుదల చేయబడ్డాడు! ఆఖరిసారి జీసస్ కార్మిల్ గుట్టమీద సమావేశంలో కనిపించినపుడు ఎస్సీన్ మిత్రమండలి హెచ్చరిక చేసింది!

జీసస్‌ను మళ్లీ అరెస్టు చేసి చంపించేందుకు యూదులు కుట్ర ముమ్మరంగా చేస్తున్నారని యూదుల మతగురువు ఖయ్యాఫాస్ గూఢచారులను జీసస్ శిష్యులలాగా రహస్య సమాచారం అందించే వారిని పెట్టాడని! దానిపై జోసఫ్ ధైర్యం చేసి జీసస్‌తో నిర్మోహమాటంగా మాట్లాడాడు!

"నీకిప్పటికైనా ధృవపడింది కదా! నీ బోధన అంటే నమ్మని వారు. నీ జనాకర్షణని అసూయ పడేవారు నీపై రాజకీయనేరాలను మోపి రాజు పదవికి పోటీదారుగా చిత్రించి రోమన్ సైనికుల చేత చంపించే ప్రయత్నాలు చేస్తున్నట్లు! ఈ బోధనను దూరం నుంచి శిష్యమండలి ద్వారా ప్రసారం చేయవచ్చు నీవు జీవించి వుంటే. అందుకని ఏకాంతంగా నిశ్శబ్దంగా ధ్యానం చేసుకుని ప్రశాంతత కలిగిన దూరప్రాంతానికి నీవు వెళ్ళక తప్పదు! నీతో నమ్మకస్తులైన ఎస్సీన్ అనుచరులు వెంట వస్తారు! ఇందుకు అంగీకరించక తప్పదు!"

(P. 115)




'జీసస్' - ప్రయాణించిన సిల్కుమార్గము

## సుదూర యాత్ర :-

జీసస్ ఈ మాటలు విని అంగీకరించాడు! అలాగ జీసస్ ప్రయాణం ఎవరికీ తెలియని దూర ప్రాంతాలకు నిర్ధారణ చేయబడింది.

(P. 121)

జీసస్‌ను వెంట తరిమే గూఢచారులకు, అనుమానస్థులకు మాయ చేసేలా వదంతులు వ్యాపింప చేశారు. ఎస్సీన్ యోగమిత్రులు!

'జీసస్ మరణించాడు! శిలువ పైనే మరణించాడు! అతని ఆత్మ పై లోకాలకు పోవటం కూడా మాలో కొందరు చూశారు' అంటూ మరీమరీ ప్రచారం చేశారు! వెంటనే ఆ వదంతిని నమ్మలేదు కొందరు! కాని కాలక్రమేణా అంతా సద్దుమణిగింది.

అలా జీసస్ పూర్తిగా కోలుకొన్నాక పర్వత రహస్యమార్గాల గుండా ప్రయాణం సాగించాడు! ఎక్కడికో ముందుగా నిర్ధారణ లేని గమ్యంలేని ప్రయాణం! క్రమంగా మృతసముద్ర ప్రాంతాన్ని విడిచిపెట్టి ప్రాచీన శిల్ప మార్గం గుండా పశ్చిమంగా ప్రయాణం చేశాడు! ఈ మార్గాన్ని చికాగోలో 1907లో ప్రచురించిన ఆ పుస్తకాల షాపులో ఒక పేజీలో ముద్రించి వుంది!

## (జీసస్ ప్రయాణించిన మార్గం చిత్రం)

జీసస్ ఆసియా నుండి హిమాలయాల వైపు ప్రయాణించి ఉత్తరంగా మలుపు తిరిగి శంబల సమీపంగా ప్రయాణించి చివరకు హిందూ దేశం చేరాడు! అనేక చోట్ల సంచారంచేసి చివరకు కాశ్మీరులో సమాధి పొందాడని తేలుతోంది!

దాదాపు 2000 సం. పూర్వంనాటిదైన ప్రాచీన ప్యాపిరస్ వ్రాత పత్రంలోని ప్రత్యక్షసాక్షి క్రీస్తు మరణించిన 7వ సంవత్సరంలో రాయబడినది! అలెగ్జాండ్రియాలోని ఒక మిత్రునికి రాసిన ఆ ప్రాచీన లేఖను అతని వారసుల వద్ద అలెగ్జాండ్రియాలో ఒక అమెరికా బైబుల్ పరిశోధకునికి

లభించింది! దాన్ని ప్రచురించగా దాని వివరాలు జె.డి. జామ్స్ అన్న లండన్ నివాసి మసీదులోని ముస్లిం హిమాన్స్ 1946 ప్రాంతంలో ప్రచురించాడు! ఇందులో అంశాలు అనేకం అబద్ధాలని కొట్టి పారెయ్యాలని క్రైస్తవ బిషప్పులు తీవ్ర ప్రయత్నాలు చేశారు! ఇంతలోకే మరో ఆశ్చర్యం బయట పడింది!

అదేమిటంటే జెరూసలెంకి సమీపంలోని మృతసముద్రం వద్ద నున్న పురాతన గృహాలలో హిబ్రూ భాషతో రాయబడ్డ తోలుపేజీల మీద లభించిన హిబ్రూ వ్రాతప్రతులు పరిశోధనకులకు లభించాయి'. 1947లో ఇందులో అనేక ఆశ్చర్యకర విషయాలు బయటపడ్డాయి! ముఖ్యంగా చికాగోలోని పుస్తకాలషాపులో 1907లో ప్రచురించబడ్డ ప్రత్యక్ష సాక్షి లేఖలోని అంశాలను ధృవపరుస్తూ ఒక ఎస్సీను మతానికి చెందిన సాధువులు గృహాలలో దాచుకున్న హీబ్రూ భాషలోని శాసనాలలో ధృవ పరచబడింది! ఇది 30 ఏళ్లపాటు అనేక దేశాల బైబుల్ పరిశోధకులను సముద్రమధనంలా కలచివేస్తున్నది! దీని వివరాలు ఇంకొక అధ్యాయంలో!

సాయినాధ చరిత్రలో సాయిబాబా మరణించి జీవించిన ప్రత్యక్ష సాక్ష్యం ఈ విషయాన్ని ఋజువు చేస్తోంది!



# 9

# జీసస్ శిలువపై మరణించలేదా? "సువార్త"ల సాక్ష్యం!

## సువార్తల సాక్ష్యం ఏమిటి?

'అలెగ్జాండర్ నోటోవిచ్' (Alexander Notovitch) హిమాలయ బౌద్ధ ఆశ్రమాలలో కనుగొన్న "యోగి'ఈశా' రహస్య జీవితం" వార్త, ప్రపంచమంతటా సంచలనాన్ని రేకెత్తించింది.

అందులో రేపిన మొదటి ప్రశ్న 'ఏసుక్రీస్తు గనుక హిమాలయాల గుండా భారతదేశానికి ప్రయాణించివుంటే-జీసస్ శిలువపై మరణించలేదా?

ఇది క్రైస్తవ మతానికే - ఆయువుపట్టు వంటి చావుబ్రతుకుల ప్రశ్న!

## శిలువపై మరణం :-

ఎందుకంటే క్రైస్తవ బిషప్పుల ప్రచారంలో చోటుచేసుకున్న ముఖ్యాంశం "ఏసుక్రీస్తుయొక్క గొప్పతనం" - "క్రీస్తు శిలువపై మరణించి, తిరిగి పునరుత్థానం పొందాడు" అన్న 'వింత మహిమ' (Miracle) మీదే ఆధారంగా చేస్తూవచ్చి క్రైస్తవ మతప్రచారం బలంగా పునాదివేసుకొని ఉధృతంగా "మతం మార్పిడులు" చేయబడినందువల్లనే! కాని, తరువాతివారి అభిప్రాయం మారింది! బైబుల్ ప్రవక్తయొక్క నిజమైన గొప్పతనం, ఆయన ఉపదేశించిన దివ్యజ్ఞానంయొక్క విశిష్టతపై ఆధారపడివున్నదిగాని చిల్లర మహిమలపై ఆధారపడ్డ చవకబారు ప్రచారం ఆయనకు అవసరంలేదు. నిజానికి, జీసస్ గొప్పతనాన్ని ప్రకటించాలంటే!

అన్న ఈ వాదాన్ని అనుసరించిన వారిలో ముఖ్యుడు - జర్మన్ పరిశోధకుడైన "హోల్గర్ కెర్స్టన్" (Holger Kerston), ఇంకా అనేకులు, గత అధ్యాయంలో ఉదహరించిన అనేక పరిశోధనా గ్రంధాల రచయితలు కూడా ఇదే అభిప్రాయాన్ని ఏకకంఠంతో వెలిబుచ్చారు. కాబట్టి, జీసస్ శిలువపై మరణించివుండకపోతే క్రైస్తవులందరూ దిగాలు పడిపోనక్కర్లేదు!

## బైబుల్ - సిద్ధాంత మార్పు :-

ఈ పరిశోధనా ఫలితాంశం యొక్క ప్రాముఖ్యత 'బైబుల్ - పరిశోధన' యొక్క దృక్పధాన్నే మార్చి వేసింది! ఈనాడు యూరప్‌లోని చాలామంది తెల్లవారైన క్రైస్తవులు సైతం దీన్ని అంగీకరిస్తున్నారు! అది ఏమిటీ అంటే ఏసుక్రీస్తు గొప్పదనానికి చిల్లర మహిమలతో అలగాజనం కోసం రక్తికట్టించే చవకబారు ప్రచారం అవసరంలేదని! కాబట్టి, చరిత్ర పరిశోధనలో వెలువడే యదార్థ సత్యాలను చూసి నిజమైన క్రైస్తవుడు భయపడనక్కరలేదు! ఈ దృష్టితో గనుక జీసస్ జీవితాన్ని పరిశోధిస్తే లభించే అతి విలువైన సత్యాలు, 'యోగి ఈశా రహస్య జీవిత చరిత్ర' లోని విషయాలను చూసి భయపడనక్కరలేదు. అందుకని 'నోటోవిచ్'

కు లభించిన ప్రాచీన తాళపత్ర గ్రంథంలో జీసస్ శిలువపై మరణించలేదన్న విశేషం చారిత్రకదృష్టితో, ఇతర సాక్ష్యాధారాల సహాయంతో నిశితంగా పరిశోధకులు సవిమర్శనగా భయం లేకుండా పరిశీలించారు. దీనిపై అనేక వైద్యశాస్త్ర, యోగశాస్త్ర, పురాతత్వ శాస్త్ర (Archeology) పరిశోధనా గ్రంథాలు విశేషంగా చెప్పుకోతగ్గవి ఎన్నో వెలువడ్డాయి. ఈ పరిశోధనలు అన్నీ ఏకరువు పెడితే కొన్ని వేల పేజీలు పెరిగిపోతుందీ గ్రంథం! కాబట్టి, వాటిలోని కొన్ని ముఖ్యాంశాలను మాత్రమే సంగ్రహంగా ఇక్కడ పరిశీలిద్దాం!

## జీసస్‌పై పరిశోధనలు :-

1. మొదటిగా మనం పరిశోధించాల్సిన సాక్ష్యాధారం - "బైబుల్‌లోని 'సువార్త'లలో (Gospels) శిలువపై జీసస్ మరణించి నట్టుగా ఎక్కడైనా దీనిపై సాక్ష్యాధారం లభిస్తున్నదా?" ఈనాటి క్రైస్తవ మతానికి వేదంలా నమ్మే "క్రొత్త నిబంధనలు" (New Testament)లోని 'సువార్త'లోనే, ఎక్కడైనా జీసస్ శిలువపై మరణించలేదని ఋజువుచేసే సాక్ష్యాలేమన్నా లభిస్తున్నాయా? అలాంటి సాక్ష్యమే గనక లభిస్తే - అది క్రైస్తవమత విరోధులెవరో కల్పించారనే వాదం కొట్టుకుపోతుంది! అప్పుడు 'చరిత్ర పరిశోధనలో లభించిన సత్యాలే యదార్థం' అని ధృవ పడుతుంది.

## శిలువ వెయ్యడం :-

జీసస్‌పై మరణశిక్ష విధించబడిందని, అదీ శిలువపై మరణించే శిక్ష... 'నీచాతినీచమైన నేరస్థులకు విధించే క్రూరమైన హింసాకాండ' అనీ చరిత్ర తెలుపుతున్నది. దీనికి సాక్ష్యము జీసస్‌కు చెరొకవైపునా శిలువపై ఇద్దరు దొంగలు కూడా శిక్షననుభవించి మరణించటం - అలా మరణించిన వారి ఎముకలు విరక్కొట్టి శవాన్ని శిలువమీదనుంచి దించటం జరిగేది. ఇది లూకాస్ (Luke 22:52), మార్క్ (Mark 15:25), మత్తయి (Mathew - 27:32,33), సువార్తలు (Gospel), చదివితే స్పష్టంగా తెలిసే సత్యం!

## జాన్ - సువార్త :-

జీసస్ మరణించాడో లేదో చూసిరమ్మని పొంటియాస్ పిలేత్ (Pontiuis Pilate), ఒక రోమన్ సైనికుని (Centurian),ని ఆజ్ఞాపించగా అతడు వెళ్లి శిలువపైనున్న జీసస్‌ను చూసి అతడిలో చలనం లేనందున శూలంతో డొక్కలో పొడిచి చూస్తాడు! వెంటనే జీసస్ శరీరంలోంచి నీళ్లూ రక్తమూ చిమ్మి బయటకు ప్రవహించాయని బైబుల్‌యొక్క "సువార్త" (John - XX.15), ప్రత్యక్ష సాక్ష్యాధారమే మనకు లభిస్తున్నది.

దీనిపై మెడికల్ పరిశోధకులు వైద్యశాస్త్ర పరిశోధనా దృష్టితో వ్రాసిన విశ్లేషణాగ్రంథం ప్రత్యేకంగా చెప్పుకోతగ్గది. జడ్జి ఇ.బి. డాకర్ (Judge E.B. Docker), రచించిన జర్మన్ గ్రంథం.

"If Jesus Did Not Die on the Cross?" "A Story in Evidence". ఈ మార్గంలో చెప్పుకోతగిన ఆధారం. ఈయన స్వీడెన్ (Sweden) లోని ప్రభుత్వ ఆస్పత్రిలో వైద్యశాస్త్రం దృష్ట్యా 1897 నుండి 1923 దాకా పనిచేసిన వైద్య నిపుణుడు. ఈయన శిలువవేయబడిన జీసస్ శరీర లక్షణాలను (Symptoms) వైద్యశాస్త్రం దృష్ట్యా విశ్లేషించి వ్రాసిన వాక్యాలను ఇక్కడ గమనిద్దాం.

CRUCIFIXION - MEDICAL EVIDENCE

"If Jesus had been dead, no blood would have come. There is a watery exudate which penetrates the skin and forms small or big blisters. This is called ... "Epanchments Traumatiques de serosite". One of the soldiers saw these blisters and scratched one of them ... he wounded Jesus and blood and water came out ... poor ignorant men did not understand that Jesus was not dead".

"There are in John's narrative some incidents interesting to a Doctor, for they are so realistic and so very characteristic of an attach of Shock and collapse. The usual cause of fainting

is that the blood goes away from the head, and the patient turns pale. If you lay him down he will feel an agonising dryness in the throat and the mouth and will stammer or cry only the word "water" ... The fainting; person, however after an insufferable feeling of thirst, begins to loose consciousness, The Earth seems to disappear under him, and he has a sensation of flying. Now he will cry a farewell, warning, perhaps, "I am dying."

"But a dying person totally exhausted by haemorrhage and torture, will only open his mouth and draw his breath; he will never use the dramatic words, I am dying" .... and Jesus said these words "It is finished, I am dying" and finally he cries! "water. I am dying" ... a centurion thought the same; otherwise he would have broken his bones... Eusebius has related scenes from the prosecution of Diocletianus, and he says that crucified persons died after several days... the robbers who are crucified with Jesus were alive in the evening."

... When he says, "I am not yet gone to my Father" he uses the very flowery language of the Orient. He meant, "I am not dead yet" ... is that not perfectly natural ?"

"In the Orient there is a religious community founded after faith that Jesus after crucifixion, walked afterwards towards India, and at last under the name "Izza" (Issa) settled down, in Srinagar (the town of happiness) in the beautiful valley of Kashmir."

- Judge Docker : "If Jesus Did Not Die Upon on the Cross." (p. 70 78)

వైద్యశాస్త్రజ్ఞుడి సాక్ష్యంపై వాక్యాలు, బైబుల్‌లోని ప్రత్యక్ష సాక్షాధారాల ప్రకారం జీసస్ శిలువపై మరణించలేదు! ... ఆయన తరువాత కాశ్మీర్ చేరి అక్కడ శ్రీనగర్‌లో సమాధి చెందాడు అని స్పష్టంగా తెలియజేస్తున్నాయి.

అలాగే మహమ్మదీయుల విజ్ఞాన సర్వస్వం అన్న గ్రంథంలో జీసస్ క్రైస్తుయొక్క అసలైన పేరు "యూజ్ అసఫ్" (Yuz-Asaf) ! ఆయన శిలువపైన మరణించలేదు! అన్న స్వీడన్ వైద్యుని వైద్యపరిశోధన అభిప్రాయాలతో ఏకీభవిస్తున్నాయి. ఇదే విషయాన్ని అల్బర్ట్ స్విట్జర్ అనే జర్మన్ పరిశోధకుడుకూడా తన "The Quest of the Historical Jesus" W. Montogmery, London Transl (1910) by Albert Schwritzer అన్న గ్రంథంలో కూడా నొక్కి చెప్పాడు.

అంతేకాక 'శిలువ వేసినప్పుడు చేతులకూ కాళ్లకూ మేకులు కొడతారు. ఆ మేకులు మనిషి ప్రాణం తీసే గాయాలను చేస్తాయా?' అన్న విషయాన్ని పరిశీలిస్తూ చేతి ఎముకలు, కాళ్ల ఎముకలను సూచిస్తూ శిలువ మేకులను చూపించే ఆ చిత్రాలను జన్మతః క్రైస్తవుడైన జర్మన్ పరిశోధకుడు "కెర్స్టన్" (Kersten) ప్రచురించడం గమనార్హం.

ఏసుక్రీస్తు సమాధి చేయబడ్డ కాశ్మీరులోనే ఆయన సమాధిమందిరం వద్ద జీసస్ పాద ముద్రలు ఫోటో తీశారు. ఈ పాద ముద్రల్లో స్పష్టంగా అరికాలులో మేకులు చేసిన గాయాలను స్పష్టంగా చూడవచ్చు!! దీన్నిబట్టి జీసస్ శిలువపై మరణించలేదని వైద్యశాస్త్ర ప్రకారం శిలువ చేయబఢినతరువాత చాలాకాలానికి, ఆయన కాశ్మీరులో మరణించాడని తెలిపే అతడి సమాధి, దానివద్దనే లభించే అరికాలులో మేకులుగల గాయాలను సూచించే పాద ముద్రలుండటమే ప్రత్యక్షమైన చారిత్రక ఆధారము.

## ఇస్లాం మతం - సాక్ష్యం :-

ఇవన్నీ కేవలం కల్పితాలని లేక ఊహాజనితాలని అనుకోకుండా, నిరూపించే ఇతర సాక్ష్యాధారాలుకూడా ఎన్నో లభిస్తున్నాయి!! అక్బర్

పాదుషా కాలంలో వ్రాసిన 'Ai-ki-nami Yus o Kristo' (Thou whose name is Yuz or Christ) ఈ వాక్యాలతో 'యూసో క్రిస్టో' అన్న జీసస్ అసలు పేరుతో ఆయన రహస్య జీవితాన్ని వర్ణించే ఇస్లాం మతగ్రంథాలు కూడా విలువైన చారిత్రక సాక్ష్యాధారాలు.

## 'మేరీ' - మాత సమాధి :-

ఇలాంటి ప్రమాణగ్రంథాలలో "జామీ-ఉఫ్-తవారిక్" అన్న గ్రంధాన్ని ప్రధానంగా పేర్కొనవచ్చు. జీసస్ క్రైస్తును అసలు పేరైన "యూస్ అసఫ్" (Yuz-Asaf) అని ముస్లింసాంప్రదాయంతో పిలుస్తారు. ఈయన చరిత్రకూడా "అసిఫియా" అన్న పేరుతోనే ఇరాన్‌లోనూ ఆఫ్ఘనిస్తాన్‌లోనూ పర్యానుండి కాశ్మీర్ వెళ్లే సిల్కుమార్గంలోనూ ఇప్పటికీ ప్రచారంలోవున్నది. ఇక్కడ మేరీ మాత సమాధిని 'మాటు మారీ దా అస్తాన్' లేక తల్లి మేరీ యొక్క సమాధి స్థానం' అని చెప్పబడే గోరీ యొక్క చిత్రం ఈ క్రింద చూడవచ్చు.



**జీసస్ తల్లి 'మేరీ' మాత సమాధి**

(కాశ్మీర్ లోయ వద్ద నేటికీ చూడవచ్చు)

ఇందులో విశేషమేమంటే జీసస్ సమాధి, మేరీ సమాధి కూడా మామూలు ముస్లిం దర్గాలవలే కాక - "తూర్పు పడమరలుగా" సమాధి కాబడి ఉన్నాయి. ఇక యూదుల సమాధులే ఇలాగ ఏర్పడి ఉంటాయి. అక్బర్ కాలం నాటి ఫతేపూర్ సిక్రీ కోటలో ఈ క్రింది శాసనం చెక్కబడి ఉన్నది.



'ఫతేపూర్ సిక్రీ'పై - శాసనం (అక్షరుది)

## అక్బర్ - శాసనం :-

**"జీసస్ (ఆయన ఆత్మకు శాంతి) ఇలా అన్నాడు - "ఈ ప్రపంచం ఒక వంతెన వంటిది! దానిపై నడవాలి! అక్కడ స్థిరపడరాదు."**

-ఫతేపూర్ కోట.

ఈ వాక్యాలు ఇప్పటికీ ఫతేపూర్ సిక్రీలో చూడవచ్చని 1900 A.D.లో ఇంగ్లీషు పత్రికలో పరిశోధనా వ్యాసంలో ప్రచురించారు. ఈ శాసనం

ఫోటోగ్రాఫును కూడా జర్మన్ పరిశోధకుడు హోల్గర్ కెర్స్టన్ (Holger Kerston) వ్రాసిన - "Jesus in India" గ్రంధంలో (190 పేజీ) చూడవచ్చు.

అలానే ఆరమిక్ భాషలో (అంటే జీసస్ స్వయంగా మాట్లాడే భాష) వ్రాయబడ్డ సువార్తలలో జీసస్ 180 తేదీ ప్రాంతంలో భారతదేశానికి వెళ్లినట్లు తెలియజేస్తున్నదని "బిషప్ డేవిడ్" (Bishop David) అనే బస్రా నివాసి తన గ్రంథం "Chronicle of Seet" (1-8, 25) లో తెలియజేశాడు. ఈ విషయాన్ని ప్రస్తుతం బైబుల్‌లోనుంచి మాథ్యూ (Mathew) సువార్తనుంచీ తొలగించారు.

ఇంకా ముస్లిం మతంలోని 'హజ్రత్ మీర్జా గులాం అహ్మద్' (1835) ఖురాన్ షరీఫ్ ఆధారంగా జీసస్ క్రైస్తును శిలువమీద మరణించకుండా రక్షించబడ్డాడని - తన పరిశోధనావ్యాసంలో ఋజువుచేశాడు.

**పురాణాలు :-**

ఇంతవరకూ విదేశీ సాక్ష్యాధారాలు - జీసస్ శిలువపై మరణించలేదని అవి ఎలా ఋజువు చేస్తున్నాయో గమనించాము. అలానే హిందూ మత గ్రంథమైన 'భవిష్య పురాణం'లో రాబోయే 'కలియుగ భవిష్యత్తు'లో జీసస్ క్రైస్తు యొక్క జీవితం వర్ణించబడి ఉన్నది - 'ఈశపుత్ర' అన్న పేరుతో! దీని వివరాలు వచ్చే అధ్యాయంలో చూద్దాం!!!



# 10

# 'మరణించి లేచిన' (Resurrected) ఒక సాధువు - యదార్థ చరిత్ర సాక్ష్యం

వందల సంవత్సరాలుగా క్రైస్తవ ప్రపంచంలో ప్రచారం కాబడిన అంశం మరణించిన 3వ రోజున లేచుట అనే 'పునరుద్ధానం (Resurrection) అన్న మహత్తరమైన దైవ మహిమవల్ల జీసస్ భగవంతుని ఏకైక కుమారుడుఅన్న అంశం క్రైస్తవ ప్రజల మనస్సులో గాఢంగా నాటుకు పోయింది. దీనివల్ల జీసస్ జీవితంపైనా, లేదా బైబుల్‌లోని 'కొత్త నిబంధనలు' (New Testament) అన్న పేరుతో చలామణీ కాబడ్డ రచనలు 'దేవుని వాక్యం' అన్న భావం ధృఢంగా పేరుకుయింది - బైబుల్‌పై

విదేశాలలో చేపట్టిన చారిత్రక పరిశోధనలతో ఎలాగ భూకంపంలా కదిలిపోయిందో ఇంతకు ముందు అధ్యాయాలలో గమనించాము.

చరిత్రలో ఎవరూ ఇలాగ మరణించి కొన్ని రోజుల తరువాత "మరణించినవారి నుండి లేచుట" (Rising from the Dead) అన్న అద్భుతం చేశారా? అలా గనక చేసి ఉంటే ఒక్క జీసస్ మాత్రమే మరణించినవారి నుండి లేవటం జరిగిందని క్రైస్తవ ఫాదరీలు చేసే ప్రచారం యదార్థమా?

ఈ విషయంపై బ్రిటీషు, జర్మన్, ఫ్రెంచి పరిశోధకులు బైబుల్‌పై పరిశోధనలో భాగంగా అన్వేషణ చేపట్టారు. వీరిలో 'హిమాలయాలలోని యోగులు, వారియొక్క అద్భుత మహిమలు' అన్న అంశంపై రష్యన్ వనిత మేడమ్ బ్లావెట్స్కీ (Madam Blavatsky) తన గ్రంథాలలో వెల్లడించిన అనేక రహస్యాలు, సత్యాలు విదేశీయులను ఊపి వేశాయి! దాంతో ఇలా 'మరణించటం ఆ తరువాత కొన్నాళ్లకు తిరిగి జీవించటం అన్న అంశం యదార్థంగా జరిగిన మహాత్ముల, యోగి పుంగవుల మహిమలు కళ్లారా చూసిన వారి సాక్ష్యాధారాల కోసం అన్వేషణ ప్రారంభమైంది. ప్రఖ్యాత జ్యోతిష్కుడు ప్రపంచ భవిష్యత్తును ముందే యధాతథంగా ప్రకటించిన ద్రష్టగా ఇంగ్లీషు వాడైన కీరో (Cheiro) అన్న మారుపేరుతో 'కౌంట్-లూయీ-హేమన్' (Count - Louis - Hamon) అన్న బ్రిటీషు కుటుంబీకుని రచన నుండి ఒక అద్భుతాన్ని ఈ అధ్యాయంలో పరిశీలిద్దాం!

రంజిత్ సింగ్ అనే సిక్కు మహారాజు 18వ శతాబ్ది చివరనుండి భారతదేశాన్ని పాలించాడు. ఆయన కాలంలో జరిగిన అద్భుత యదార్థాన్ని ఈయన తన గ్రంథంలో ఉదహరించాడు. దీని సారాంశం ఇలా ఉంది!

## మరణించి లేచిన అద్భుత - యోగి :

ఒకరోజు రంజిత్‌సింగ్ మహారాజు కొలువులో ఒక అద్భుతమైన యోగి ప్రవేశించారు. ఆయన యొక్క మహిమలూ, కీర్తి ప్రజలలో

ఆయనను "జీవించి ఉన్న దైవం" అన్న పేరుతో సర్వజనులూ మొకరిల్లేవారు. ఆయన చేయగలఅనేక మహిమలలో సర్వోత్కృష్టమైనది (The Supreme Miracle) మరణించి భూస్థాపితం చేయబడిన మట్టికప్పి సమాధి చేసిన అనంతరం ఆయన తన మరణావస్థ నుండి క్రమంగా కోలుకుని (తనంతట తానే) పూర్తిగా పునరుజ్జీవితుడై చరిత్రను సృష్టించడం!!

ఆ యోగి చేసిన ప్రదర్శనకు తెల్లవారు, పరిశోధనా దృష్టిగల విదేశీయులు ఆహ్వానించబడ్డారు. ప్రఖ్యాత ఇంగ్లీషు వైద్యుడు కూడా ఆయన నాడీ, గుండె కొట్టుకోవడం వంటివి పరీక్షించి ఆయన పూర్తి ఆరోగ్యంతో ఉన్నారని నిర్ధారించారు. అప్పుడు అందరూ చూస్తుండగా ఆయోగి తన ముందు గుమికూడిన ప్రజలను ఉద్దేశించి దైవప్రార్థన చేసి తాను భగవంతుని దయతో మరణించి (వైద్య శాస్త్రం ప్రకారం = Clinical Death) 3 రోజుల అనంతరం తాను ముందే సంకల్పించి నిర్దేశించిన కాలానికి పునరుజ్జీవితుడిని కాగలనని హెచ్చరిక చేశాడు. అలా జీవించి బ్రతికి తిరిగి రాని పక్షంలో తనను పూర్తిగా సమాధి చేయవలసిందిగా కోరాడు. ప్రేక్షకులు హర్షాశ్చర్యాలతో ఆనంద భాష్పాలు రాల్చారు. అపుడా యోగి ముందుగా పరీక్షించబడిన ఒక పెద్ద గొయ్యి లేక సొరంగంలోకి ప్రవేశించాడు అక్కడి వారి సాయంతో! ముందుగానే ఆయన చెవులు, ముక్కు రంధ్రాలు, కనుగ్రుడ్లు ప్రత్తితో సంరక్షణకై బంధించారు - పురుగులు, క్రిములు తినకుండా! ఆయన శరీరం చుట్టూ ఒక పలుచని సిల్కు వస్త్రం వంటిది చుట్టేంత పొడుగు గలది ఏర్పాటు చేశారు.

డాక్టర్లు ఆయన చేతిని పట్టుకొని నాడిని పరీక్షిస్తుండగా ఇంకొకరు గుండెను పరీక్షిస్తున్నారు. ఆయన క్రమంగా ధ్యానస్థితుడై చలనం లేకుండా శరీరాన్ని శిలలాగా స్థంభింపచేశాడు! నాడి పూర్తిగా నిలచి పోయాక శరీరం ఐస్‌లా చల్లబడి అవయవాలు వ్రేలాడసాగాయి. తల ప్రక్కకి వాలిపోయింది. పూర్తిగా 'మరణించాడని' అక్కడున్న వైద్య పరిశోధకులు నిర్ధారణ చేశాక - ఆయన ముందే సూచించిన ప్రకారం

సిల్కు బట్టలో చుట్టి ఒక పలుచని పొర కలిగిన పెట్టెలో వుంచి భూమిలోకి త్రవ్వి పెట్టిన పాతర (గొయ్యి)లోకి దించారు.

ఆపైన చుట్టూరా ఉన్న కూలీలు, సేవకులు హడావుడిగా పారలతో గంపలతో మట్టిని వేస్తూ భగవన్నామంతో పాతరను పూడ్చి వేశారు. పైన మట్టిని కూడా పూర్తిగా చదును చేసి! అక్కడ గుర్తుగా ఒక కర్ర పుల్లను, దేవుని నామాలు రాసిన జండాను పాతారు. చుట్టూరా ప్రజలకు ఆశ్చర్యంతో నోట మాట రాలేదు! అందరూ తలోరకంగా అనుకోసాగారు. తానెలాగా మరణించదలచుకొని అద్భుతమైన రీతిలో నాటకీయంగా చేసే ఆత్మహత్యగా అక్కడ చేరిన బ్రిటీషు దొరలు, విదేశీ డాక్టర్లు వెటకారంగా వ్యంగ్యంగా చలోక్తులు పలికారు. రంజిత్‌సింగ్ మహారాజు మాత్రం గంభీర మౌనముద్రలో తలవాల్చి, ఆ యోగిని దేవుని ప్రార్థించినంత గౌరవంతో చేతులు మోడ్చి గౌరవాంజలి ఘటించాడు.

అలా మూడు పవళ్లు, మూడు రాత్రిళ్లు అహర్నిశలు వ్యవధి లేకుండా విచ్చు కత్తులతో కాపలాకాసే రాజభటులను రక్షణకై ఆయన ఏర్పాటు చేసి ఉంచాడు! అడవి జంతువులు గాని, కుక్కలు, నక్కలు వంటివి లేక తుంటరుల నుండి ఆ యోగి శరీరం నాశనం చేయబడకుండా!!

నాల్గవ రోజు తెలతెలవారుతుండగా సరిగ్గా ఆ యోగి చెప్పిన టైముకు అమావాస్య గడిచిన మర్నాటి తొలిచంద్రుడు అస్పష్టంగా తూర్పు ఉదయించే ముహూర్తంలో భూమిని త్రవ్వి సమాధి నుంచి ఆయనను వెలికి తీశారు. కాళ్లూ చేతులూ బిర్ర బిగుసుకుని *(Rigormorts)* శవంలా ఉన్న ఆ యోగి కళేబరాన్ని నేల మీదుంచారు. (గత అధ్యాయంలో నికోడిమస్ జాన్ చేసినట్లుగా) ఆ తరువాత చెవుల నుండి ముక్కుల నుండి దూది పింజలు తీసివేశారు. అరికాళ్లకు అరచేతులకు, ఛాతీ, నుదురు (భ్రూమధ్యం) వంటి కొన్ని నియమిత స్థలాలలో ఆవునెయ్యి

వెన్న మర్దనా చేశారు. శరీరంలో క్రమంగా నీరెండవంటి కాంతి ప్రసరించసాగింది! ఆ తరువాత ఆయన మోకాళ్లూ మోచేతులూ అలానే మాలీసు చేయగా గోరు వెచ్చదనం అస్పష్టంగా మొదలైంది.

ఆ తరువాత కడుపూ డొక్కలూ మర్దనా చేసి చెవులలో గట్టిగా ఆయన ముందే చెప్పిన మంత్రం 'ఓం నమో నారాయణాయ' అన్న అష్టాక్షరీ మంత్రాన్ని ఉచ్ఛ స్వరంలో ఉచ్ఛరించారు.

చాలా సేపటి వరకూ చైతన్యం లేదు. అప్పుడు చుట్టూ ఉన్న జనం అంతా కలసి ఉచ్చైస్వరంలో జపంచేయగా ఒక్కసారి శరీరంలో త్రుళ్లిపడ్డ స్పందన కలిగింది! ఆ తరువాత బుస్సుమన్న శబ్దంతో పాము బుసకొట్టినట్లు శ్వాస ప్రవేశించింది. అప్పటిదాకా చూస్తూవున్న ఇద్దరూ వైద్య నిపుణులు (ఇంగ్లీషువారు కాదు - ఆయుర్వేదం, యోగం తెలిసిన మూలికా వైద్యులు) ఆ యోగి దవడలను మాలీసుచేసి గట్టిగా విప్పదీశారు. శబ్దంతో గాలి నోరులోకి ప్రవేశిస్తూ తెరుచుకోగా నాలుక మెలితిరిగి లోపలికి అంగుటిలో ప్రవేశించి మళ్లీ శ్వాసను ఆపివేస్తున్నది.

'లంబికా-యోగముద్ర'ను వేలితో నాలికను బైటికిలాగి సాఫీచేశారు. గోరు వెచ్చటి నీటితో నోరు తడిచేయగా క్రమంగా యోగి కళ్లుతెరిచి పునరుజ్జీవితుడైనాడు. "భగవంతునికి జై ! సర్వ శక్తి వంతుడైన పరమాత్మకు జయము!" అంటూ జయ జయ ధ్వానములు ఎల్లెడలా మిన్నుముట్టాయి.

రంజిత్‌సింగ్ ఆయోగిని దేవుని పూజించినంత శ్రద్ధా, భక్తులతో పూజించాడు. పాదనమస్కారం చేస్తూ! అనంతరం రంజిత్‌సింగ్ మహారాజు ప్రజలనుద్దేశించి "ఈ కలియుగంలో కూడా దేవుని మహిమను ప్రత్యక్షంగా చూశామని, ఇలాంటి మహాత్ములు ఇంకా వుండబట్టే భూమిపై మనమంతా జీవిస్తున్నా'మనీ సంగ్రహంగా ప్రసరించారు.

## "జీసస్ - పునరుద్ధానం" (Resurrection) - వంటిది :

పై అనుభవాన్ని తాను కళ్లారా తిలకించిన యూరోపియన్ అధికారి, చుట్టూ చేరిన విదేశీ డాక్టర్లూ దీనిని చరిత్రలో తాము సాక్షిసంతకంలో భారతదేశం మహిమను, ఊహించలేని ఆధ్యాత్మిక శక్తినీ కొలువలేమంటూ విదేశీయులు - తమ "బైబుల్‌లోని జీసస్ క్రైస్తు పునరుత్థానం" (Resurrection of Jesus Christ) వంటి పరమాద్భుత చర్య ఈనాడు మనం కళ్లారాచూడటం చారిత్రాత్మకమైన ఆశ్చర్యం" ఆ యోగికి అంటూ నివాళులర్పించారు.

పై సంఘటనను స్వయంగా ప్రఖ్యాత బ్రిటీషు జ్యోతిష్కుడూ ద్రష్టా Prophet (Seer) అయిన కీరో (Cheiro) అన్న ఆధ్యాత్మిక రచయిత **"ఇండియాలో తన అనుభవాలను వివరించే గ్రంథంలో"** (Memoirs - Confessions of a Modern Seer)" ఒక మరువలేని అద్భుతంగా రికార్డు చేశాడు.

కీరో (Cheiro) వ్రాసిన అనుభవంలో 'సాధు హరిదాస్' అన్న పేరుగల ఆ యోగి లాహోర్‌లోని "మహారాజా రంజిత్ సింగ్" సభాసదులముందు జరిగిన బహిరంగ అనుభవాన్ని - ఇంగ్లండులో మే నెల **1911** లో అన్న పత్రికలో ప్రచురించబడిన సాక్ష్యాధారాన్ని కూడా ఉదహరించాడు.

"Confessions – Mysteries of World's Greatest Occultists" - Cheiro

(Ch.XVII ... Hindu Mystics)



# 11

# సంస్కృత పురాణాలలో - జీసస్?

కేవలం బైబుల్ మీదే ఆధారపడి జీసస్‌ను గురించిన భోగట్టా తెలిసిన వారికి - కాశ్మీరులో జీసస్ సమాధీ, జీసస్ ఇండియా రాకకు సాక్ష్యాధారాలూ ఇంకా టిబెట్‌లోని తాళపత్రగ్రంథం "యోగి ఈశా-రహస్యచరిత్ర" వంటి అంశాలు ఒక బాంబు పేలినట్టు ఆశ్చర్యాన్నీ, విస్మయాన్ని కలిగిస్తాయి. యోగి 'ఈశా' గనుక నిజంగా తన జీవితంలో చివరి భాగాన్ని భారతదేశంలో గడిపించి వున్నట్లైతే - హిందూజాతి పవిత్రంగా భావించే సంస్కృత పురాణాలలోగాని లేదా శాస్త్రాలలోగాని లేక భవిష్యత్తును తెలిపే 'కాలజ్ఞానాన్ని' తెలిపే 'భవిష్యపురాణం' వంటి ప్రాచీన గ్రంథాలలోగాని ఎక్కడైనా జీసస్ గురించిన ప్రసక్తి లభిస్తున్నదా?

అలా గనక ఏవైనా లభిస్తే ఈ ప్రాచీన గ్రంథాలలోని విషయాలు ఈనాటి 'చర్చి' - బిషప్పుల 'సంకలన' - గ్రంథమైన ప్రచారపు వ్రాతలు వ్రాసినవారికెవ్వరికీ ఎరుకలోలేని పురాతన వ్రాతప్రతులు కాబట్టి వీటికెక్కువ ప్రాముఖ్యత ఉంటుంది.

ఎందుకంటే 'పోప్' పీఠాధిపతులకుగాని లేక 'సువార్త'లను ప్రతి పదేళ్లకూ మార్పులూ చేర్పులు చేసే 'బైబుల్' సంకలన సమాఖ్యల (Popal Councils)కు గాని, ఇలాటి రచనల ఉనికియే తెలియకపోవటంవల్ల - వాటిని ముట్టుకునే సావకాశమే కలుగలేదు! కాబట్టి ఈ ప్రాచీన మత గ్రంథాలకే ఎక్కువ ప్రమాణికమైన "చారిత్రక సాక్ష్యం (Historical evidence)"గా విలువుంటుంది!

ఎందుకంటే ఈనాటి 'సువార్త'ల యొక్క రచయితలకు అందని "ఖుమ్రాన్ - వ్రాతప్రతులు" వెయ్యేళ్లుగా (Dead Sea Scrotls) గుహాలలో దాగి ఉండినందువల్లనే, ఈనాటి బైబుల్‌లోలేని ఆశ్చర్యకరమైన అంశాలను వాటినుంచి, ఇజ్రయెలీ పరిశోధకులూ, బైబుల్ పరిశోధనాకారులు వెలికి తీయగలిగారు! అలాంటి రచనల కోవకే - అంటే "పురాతన మత గ్రంథాల" స్థాయికే (Ancient Scrptures) వస్తాయి, హిమాలయాలలోని ప్రాచీన తాళపత్రగ్రంథంలోని - "యోగి-ఈశా రహస్యచరిత్ర!"

ఇలాంటివే, ఇంకా ప్రాచీన సంస్కృత, పురాణాలలో సాక్ష్యాధారాలు ఏవైనా ఉండివుంటే అవి పరిశోధిస్తే అవకాశం ఉన్నదా? అదృష్టవశాత్తూ, బ్రిటిష్ పరిశోధకుల దృష్టికి పెద్దగా రాని ప్రాచీన సంస్కృత పురాణగ్రంథం ఒకటి నేటికీ లభిస్తున్నది - అదే, "భవిష్య పురాణము".

## భవిష్యపురాణం :

వ్యాసమహర్షి రచించిన "అష్టాదశ" (18) పురాణాలలోనూ, ఈ 'భవిష్యపురాణం' కూడా ఉన్నట్టు శ్రీమద్‌భాగవతము, సంస్కృత మహాభారతము, శ్రీవిష్ణు పురాణముల వంటి అనేక ప్రాచీన పురాణాలలోనే, దీనికి ప్రమాణం లభిస్తోంది! వేదవ్యాస మహర్షి 'కలియుగం' ప్రారంభంలో

రచించిన ఈ భవిష్య మహా పురాణంలో ఈ క్రింది పురాణాల పట్టికవల్ల తెలుస్తుంది:

1. శ్రీవిష్ణు పురాణము
2. బ్రహ్మ పురాణము
3. బ్రహ్మాండ పురాణము
4. బ్రహ్మ వైవర్తన పురాణము
5. మత్స్య పురాణము
6. కూర్మ పురాణము
7. వరాహ పురాణము
8. నరసింహ పురాణము
9. లింగ పురాణము
10. వాయు పురాణము
11. అగ్ని పురాణము
12. భాగవత పురాణము
13. భవిష్య పురాణము
14. వామన పురాణము
15. పద్మ పురాణము
16. స్కాంద పురాణము
17. గరుడ పురాణము
18. మార్కండేయ పురాణము

- అన్న పై 18 పురాణాలూ, ప్రాచీన-"పురాణసంహిత"లో చేర్చబడివున్నట్టు అన్ని సంస్కృత పురాణాలలోనూ సాక్ష్యాధారం వున్నది! ఈ భవిష్య పురాణం కేవలం భవిష్యత్తుకు సంబంధించిన పురాణగ్రంథం!

## ప్రపంచ భవిష్యత్తు :

ఇందులో అప్పటికి రానున్న "కలియుగం" అంటే ప్రారంభం 18-2-3102 BC నుంచీ కలియుగాంతం చివరి వరకూ పుట్టబోయే రాజుల చరిత్ర, ఇంకా రాబోయే సద్గురువులూ, భగవంతుని దూతలు, పరమాచార్యులు, 'కలి యుగం'లో ఇంకా రానున్న దశావతారాలలోని "బుద్ధావతారమూ" (వచ్చేసింది) ఇంకా రావలసివున్న 'శ్రీకల్కి అవతారమూ' కూడా వారి పూర్తి వివరాలతో నేను ఈ భవిష్యత్తు గురించిన సాహిత్యం యావత్తూ నా రచన **'1999 కలియుగాంతం** (Vol.I)' **(పేజి 175, అధ్యాయం (23) "కలియుగంలో రాబోయే భవిష్యత్తు", అధ్యా 24 "కలియుగ చరిత్ర - పురాణాల సమన్వయం" పేజి 205 (1993)** అన్న నా గ్రంథంలో భవిష్యపురాణ శ్లోకాలను కూడా అందులో ఉదహరించాను! కాబట్టి ఆ వివరాలన్నీ మళ్లీ ఇక్కడ పునరావృతం చేయనక్కర లేదు!

కాని, ఇక్కడ అవసరమైన అంశాలను ఇప్పుడే విశదంగా పరిశీలిద్దాం!

ఈ "భవిష్యపురాణం" అంటే ఏమిటి? ఇందులో 'మతప్రవక్తల' భవిష్యత్తు కూడా ఎందుకు వ్రాసినట్టు?

ఇందులో కేవలం "ఈశపుత్రుని"గా జీసస్ చరిత్ర ఒక్కటే వ్రాయబడిందా? అలా ఒక్కటే వుంటే ఇది ప్రక్షిప్తం కావచ్చు. కాబట్టి ఇతర ప్రవక్తల గురించి కూడా అందులో రాయబడి ఉన్నదా? అలాగనక ఉంటే ఇప్పటి "సువార్త"లలో వ్రాసిన 'బైబుల్'లోని జీసస్ జీవిత కథకూ దీనికీ ఏమైనా భేదాలు కనిపిస్తున్నాయా?

అలాటి తేడాలు "భవిష్యపురాణం"లో ఉన్నవి నేటి చారిత్రక పరిశోధనలో త్రవ్వితీసిన 'కాశ్మీరులో - జీసస్ సమాధి', ఇంకా "హిమాలయాల్లో యోగి-ఈశా చరిత్ర" వంటి చారిత్రక గాథలతో సరిపోతున్నాయా? అన్న ప్రశ్నలు సహజంగా బైబుల్ చదివిన పరిశోధకులకు కలిగే సందేహాలు, వాటికి సమాధానాలు లభిస్తున్నాయి!

## పురాణాలు :-

మొదటి ప్రశ్న "భవిష్య పురాణం" కలియుగ భవిష్యత్తును వర్ణించే

ఘట్టం వ్యాసమహర్షి, భూత భవిష్యత్, వర్తమానాలు తెలిపే పురాణాలు మూడేసి చొప్పున 3 × 6 = 18 పురాణాలు రచించారు! అందులో భవిష్యపురాణం, భవిష్యోత్తరపురాణం, జరగబోయే భవిష్యత్తుకు సంబంధించినవి! ఈ కలియుగ భవిష్యత్తుకు సంబంధించినది భవిష్య పురాణం, ఈ కలియుగం తర్వాత రాబోయే 14 మన్వంతరాల భవిష్యత్తు తెలిపేది భవిష్యోత్తర పురాణం! ఇకపోతే రెండవ ప్రశ్న -

వ్యాసమహర్షి కలియుగంలో రాబోయే అధర్మాన్ని పాపాలను, ఘోరాలను దర్శించి దానివలన ప్రజలు పాడై నశించిపోకుండా ధర్మాన్ని కాపాడే నిమిత్తం భగవంతునిచే పంపబడ్డ మహాత్ములు, అవతార పురుషులు ప్రవక్తలు జన్మించి ఎలాగ ధర్మసంస్థాపనచేస్తారో వారి చరిత్రలన్నీ వర్ణించారు, వ్యాసమహర్షి! అలాంటి వారిలో సాంప్రదాయకంగా హిందూ మతస్థులు కాని ప్రవక్తల్ని కూడా వర్ణించి వుండటంవల్ల ఈ కలియుగంలో యదార్థంగా జరగబోయే భవిష్యత్తును ఏమీ మార్చకుండా "భవిష్య పురాణం"లో వ్యాసమహర్షి రాశారు, అని తెలుస్తోంది!

ఇలాంటి హైందవేతర (హిందూమతం కాని అన్యమతస్థుల) చరిత్ర తెలిపే శ్రీ గౌతమబుద్ధునిగాధ, "ఈశో" పుత్రుడైన జీసస్ అవతరణను మహమ్మదీయ మతప్రవక్తయైన మహామదుడు (మహమ్మద్ ప్రవక్త) ఇంకా శంకరాచార్యులు, రామానుజులవారు, శివాజీ మహారాజు వంటివారే కాక అన్ని మతాలు సమంగా భావించిన అక్బర్‌పాదుషా చరిత్ర సనాతన ధర్మాన్ని ఉద్ధరించిన శాలివాహన చక్రవర్తి, ఇలాటి ఇంకా ఎందరో ప్రవక్తల భవిష్యత్తు కూడా భవిష్యపురాణంలో లభిస్తున్నది! కాబట్టి ఇది ఒక్క జీసస్ గురించిన కథమాత్రమే, ఎవరో ఈ పురాణాలలో చొప్పించారనే సందేహ నివృత్తి దీనివల్ల అవుతోంది.

## కలి - చరిత్ర :

"కలియుగం 3000 సంవత్సరాలు దాటినతర్వాత ప్రపంచంలో

అధర్మం భయంకరంగా ప్రబలిపోతుంది! సనాతన ధర్మాన్ని వినాశం చెయ్యడం కోసం, దండయాత్రలు చేసే రక్తపాతం చేసే, దుర్మార్గులు పుట్టుకొస్తారు! అట్టి శక కిరాత, మ్లేచ్ఛజాతులలో వారి దేశాలలో పాపాలు పెరిగిపోగా, భగవంతునిచే పంపబడ్డ దేవదూతలు అవతరిస్తారు!!!

- అంటూ భవిష్యపురాణం కలియుగం **3000** సంవత్సరాలకు సరియైన **100** BC నుండే **78** AD వరకూ అంటే **3,10** BC నుంచీ - 4 BC ప్రాంతంలో వరకూ జరగబోయే భవిష్యత్తు వర్ణించబడివుంది!

"పూర్ణే త్రింశత్ శతే వర్షే
కలౌప్రాప్తే భయంకరే"
శకానాం చ వినాశార్థం
జాత: శివాజ్ఞాయా సోపి..."

- అంటూ ప్రారంభించిన 'భవిష్యత్ పర్వం' ప్రతిసర్గపర్వంలోని చరిత్రలో ఇద్దరు శకకర్తలు కలియుగంలో జన్మించగలరు అని చెప్పి అందులో **(1)** శాలివాహనశకం స్థాపించిన శాలివాహన చక్రవర్తి (78 AD) **(2)** విక్రమశకం (57 BC) స్థాపించిన విక్రమాదిత్య చక్రవర్తి, కలిశక మూల పురుషుడైన జీసస్ ఈశపుత్రునిగానూ అవతరిస్తాడని ఈ క్రింది శ్లోకం స్పష్టంగా వర్ణిస్తోంది!

"ఈశపుత్రంచ మాం విద్ధి
కుమారీగర్భ సంభవం
మ్లేచ్ఛ ధర్మస్య వక్తారం
మసీహో హం సమాగత:"

అంటే ఈశపుత్రుడన్న పేరుతో కుమారీ గర్భ సంభవుడైన ప్రవక్త మ్లేచ్ఛ ధర్మాన్ని మ్లేచ్ఛ దేశాలలో స్థాపించే నిమిత్తం వారి "శకకర్త"గా జన్మిస్తాడు! అతడిని 'మసీహ' (Messaiah) అని పిలుస్తారు! అని స్పష్టంగా

జీసస్ యొక్క పుట్టుకను వర్ణించింది!

## గ్రహస్థితులు :

ఇంకా ఈ శకకర్తలు, జన్మించేముందు గురువు, శని, సూర్యుడు, చంద్రుడు, శుక్రుడు, బుధుడు వంటి ఆరుగ్రహాలు-ఒక్కసారిగా ఏకరాశిలో ప్రవేశించి - మేషరాశిలో సంయోగంచెందిన కాలంలో నూతన శకాన్ని ఆరంభించే "శకకర్తల కాలాన్ని" సూచిస్తుందని వ్యాసమహర్షి స్పష్టంగా జీసస్ జన్మించేముందు పుట్టిన ఇతర శకకర్తల కాలంకూడా పై గ్రహస్థితులలో సూచించాడు!

చారిత్రకంగా కూడా శాలివాహన శకం 78 AD అని ఈనాటి బ్రిటిష్ చరిత్రకారులు నిర్ధారించారు! కాబట్టి జీసస్ ప్రవక్త శాలివాహన చక్రవర్తి 78 సంవత్సరాల వారలో జన్మించడంవల్ల వారిద్దరూ సమకాలికులుగా కలిసే అవకాశం కనిపిస్తోంది కాలంలో!

అలా కనిపించడమేకాదు మ్లేచ్ఛ శకకర్త 'యోగి ఈశా' లేక ఈశ పుత్రుడు, శాలివాహన చక్రవర్తీ ఒకరికొకరు తారసపడి ఇద్దరూ కలుసుకొన్నట్టు ఆ సమయంలో యోగి ఈశా కాశ్మీరులో హిమాలయాల్లో తపస్సు చేస్తున్నట్టూ ఈ "భవిష్యపురాణం"లో స్పష్టంగా వర్ణించిన వివరాలు రానున్న అధ్యాయంలో పరిశీలిద్దాం!



12

# ఎవరీ శకాధీశుడు?

"భవిష్య పురాణం" - ప్రతిసర్గ పర్వంలో కలియుగం 3178 సరియైన సంవత్సరానికి శాలివాహన చక్రవర్తి శాలివాహనశకం స్థాపించిన కాలాన్ని వర్ణిస్తూ ఈక్రింది శ్లోకాలు -

"ఏకదా, తు శకాధీశో హిమతుంగం సమా యయౌ
ప్రహూణదేశస్య మధ్యే వై గిరిస్థం పురుషం శుభం
దదర్శ బలవాన్ రాజా గౌరాంగం శ్వేతవస్త్రకం ॥
కో భవానితిం తం ప్రాహ, స హోవాచ ముదాన్వితః
"ఈశపుత్రంచ మాం విద్ధి కుమారీగర్భ సంభవం
మ్లేచ్ఛధర్మస్య వక్తారం సత్యవ్రత పరాయణం
ఇతి శ్రుత్వా నృపః ప్రాహ ధర్మఃకో భవతో మతః
శ్రుత్వోవాచ "మహారాజ ప్రాప్తే సత్యస్య సంక్షయే

నిర్మర్యాదే మ్లేచ్ఛదేశే మసీహో నహం సమాగత:
ఈశామసీ చ దస్యూనాం ప్రాదుర్భూతా భయంకరీ
తామహం మ్లేచ్ఛత: ప్రాప్య మసీహత్వ ముపాగత:
మ్లేచ్ఛేషు స్థాపితో ధర్మో మయా తశ్ర్ఫుణు భూపతే ।
మానసం నిర్మలం కృత్వా మలం దేహే శుభాశుభం
నైగమం జపమాస్థాయ జపేత్ నిర్మలం పరం ।
న్యాయేన సత్య వచసా మనసైక్యేన మానవ: ॥ "

దీని అర్థం :

"ఒకనాడు శకాధీశుడు (శాలివాహన చక్రవర్తి) దండయాత్రకని వెడుతూ హిమవత్పర్వత శిఖరములను సమీపించాడు! అక్కడ ఒక అతి తెల్లని సన్నని శరీరంగల తెల్లని బట్టలు ధరించినవాడిని గౌరవర్ణం పురుషుని చూశాడు..."

"... అలా హిమవత్పర్వతాలలో ధ్యానిస్తున్న ఆ (విదేశీ) పురుషుని శకాధీశుడు (శాలివాహనుడు) ఇలా ప్రశ్నించాడు'.

"మీరొక సాధువు పురుషునివలే వున్నారు! మీ రెవరు? ఏమిచేస్తూ వుంటారు? మీరు వచ్చినపని ఏమి?" అంటూ ప్రశ్నించాడు! దానికా తెల్లబట్టలు ధరించిన వ్యక్తి -

"ఓ మహారాజా! నేను మ్లేచ్ఛ జాతులకు ప్రవక్తను! నా పేరు "ఈశ **పుత్రుడు!**" నేను కుమారీ గర్భమున జన్మించినవాడను! మ్లేచ్ఛ దేశములో ధర్మము నశించి నిర్మర్యాదగా (కనీసం మర్యాదకూడా మిగలకుండా) పతనమైనందున నేను భగవంతుని దూతగా వారిని ఉద్ధరించటానికి "మసీహు"ని (మెస్సయ్యా)గా వచ్చాను!"

అనగా శాలివాహనమహారాజు తిరిగి ఇలాప్రశ్నించాడు -

"నీవీ దేశస్థునివలే కనిపించటం లేదే! నీ మతమేది? నీవు విశ్వసించే ధర్మమేది? నీ సాధనా విధానమెట్టిది? తెలుపు" మని ప్రశ్నించాడు!

దానికాపురుషుడు ఇలాచెప్పాడు!

"రాజా! నేను "మ్లేచ్ఛ ధర్మమునకు ప్రవక్తను! 'మసీహాండి' (Messaiah) గా పంపబడినాను! - మ్లేచ్ఛ ధర్మంయొక్క లక్షణం ఇలావుంటుంది

"శరీరం మలినంగా ఉన్నాసరే మనస్సు నిర్మలంగా వుంటేచాలు! ఇలా శుభాశుభ సమన్వితమైనది మాధర్మం! మనస్సును ఏకాగ్రంచేసి ఆకాశంలో వెలిగే సూర్య భగవంతునిపై మనస్సుపెట్టి పరిపూర్ణ శరణాగతిచేసి ఆయనను నమ్మితేచేసిన చెడుకర్మలు నిర్మూలించబడి మనిషి ఉత్తమగతి పొందుతాడు! మా సాధనామార్గంయొక్క లక్షణం ఆకాశంలో ప్రత్యక్షంగా వెలిగే సూర్యుడిపై ఆత్మను నిలిపి ధ్యానించాలి! అతడే దివిలో వెలిగే తండ్రి (Father in Heaven)! ఆయనను చేరుటయే మోక్షం! మనస్సు నిర్మలం - శరరీం మలినం; ఇదే మ్లేచ్ఛ ధర్మం!"

అంటూ - జీసస్ శాలివాహనచక్రవర్తికి చెప్పిన "మ్లేచ్ఛ ధర్మాన్ని" సంగ్రహంగా వర్ణిస్తోంది, భవిష్యపురాణం! ఇందులోని విశేషాలు కొన్ని గమనించాల్సినవి కనిపిస్తాయి మనకు!

అందులో మొదటిది (1) మ్లేచ్ఛదేశములలో ధర్మం పూర్తిగా పతనం కాబడి 'నిర్మర్యాద' గా అనగా పూర్తిగా అధోగతిపాలు కాగా తాను పంపబడ్డాను అని అంటే భారతదేశంలోకంటే విదేశాలలో ధర్మం పూర్తిగా ఎంతో అధోగతికి దిగజారింది! దీని (వివరాలు "అనుబంధం"-లో, చూ) అంటే ఏమిటో బైబులు చూస్తే కనిపిస్తాయి!

## మ్లేచ్ఛధర్మం :

ఇందులో మ్లేచ్ఛధర్మం అనగా క్రైస్తవమతం అని పిలిచే యూదుల (Jews) యొక్క సామన్య ధర్మమైన జూడా-ఇజం! ఇది యూదుల మత గ్రంథమైన 'తాల్మడ్' (Talmud)లో చెప్పబడిన 'కబాలా' (Kabala) అన్న యూదుల మంత్రశాస్త్రంలో సంగ్రహంగా చెప్పబడింది! హీబ్రూ భాషనుండే ప్రాచీన బైబుల్పుట్టి దాని అనువాదం గ్రీకు బైబుల్గానూ, దానికి ఇంగ్లీష్ బైబుల్గానూ, జేమ్స్రాజు కాలంలోనూ వ్రాయబడ్డాయి కనుక ఈ 'మ్లేచ్ఛధర్మం' యూదుల ప్రాచీన మతాన్ని అంటే "ఎస్సీనుల" (Essene) సాధనా మార్గాన్ని వర్ణిస్తోంది!!!

స్పష్టంగా ఇది ఈనాటి క్రీస్టియన్ మతం కానేకాదు!

'భవిష్య పురాణం'లోని అతి ఆ ముఖ్యమైన సాక్ష్యాధారం ఏమిటి ఋజువుచేస్తోంది? అంటే, ఈనాటి 'ఖుమ్రాన్ గుహలలో' హీబ్రూభాషలో లభించిన వ్రాతప్రతులు నిజమైనవని, దానిలో కనిపించే జీసస్ జీవితచరిత్రలో అతడు ఎస్సీనుల సాంప్రదాయానికి చెందినవాడనీ, "ఈనాటి క్రిస్టియన్ కాదనీ" ఈ ఎస్సీనుల సాధనావిధానమే - ఆకాశంలో వెలిగే సూర్యుని ధ్యానించడం అని "భవిష్యపురాణం"లోని పై వర్ణన తెలుపుతోంది!

దీనినిబట్టిచూస్తే జీసస్ తనజీవితకాలంలో 'ఎస్సీన్' సాంప్రదాయం ప్రకారమే జీవించాడు! వారు తెల్లని నేతబట్టలు ధరించి పొడుగాటి గిరజాలు ధరించి హిందూ సన్యాసులవలే (అట్టమీది బొమ్మ) ఉపవాసమూ, ధ్యానమూ, నియమిత బ్రహ్మచర్యము పాటిస్తారు!

వారు జనసమ్మర్ధానికి దూరంగా కొండలలోనూ, గుహలలోనూ జీవితాంతం ఏకాంతంగాకాని, చిన్న చిన్న సాధువుల బృందాలుగాగాని, సాధనచేస్తూ జీవిస్తారు! ఆ సాంప్రదాయం ప్రకారమే "ఖుమ్రాన్" (Qumran) లోని హీబ్రూ వ్రాతప్రతుల పరిశోధనలు భవిష్యపురాణంలో చెప్పిన పై వర్ణనతో సరిగ్గా సరిపోతున్నాయి!

## శిలువపై మరణించలేదు! :

అన్నిటికన్నా ముఖ్యమైన అంశం 'భవిష్యపురాణం' లోని ఈశపుత్రుడు శిలువమీద మరణించలేదు!! అతడు మరణించి తిరిగి జీవించడమూ లేదు!!! ఈ ఆఖరి విషయం ఖుమ్రాన్ గుహలలోని వ్రాతప్రతులపై పరిశోధన కూడా స్పష్టంగా - రూఢిచేస్తున్న యదార్థం అదే!

బైబుల్‌లో వ్రాయబడిన జీసస్ గాథలో చాలాభాగం జీసస్ మరణించాడన్న కాలానికి నూరేళ్ల - తర్వాత, పాల్ (Paul) అనేవాడిచేత ఈనాటి బైబుల్‌లోని "క్రీస్టియన్" మతం కల్పించబడింది. జీసస్ (Paul) జీవితకాలంలో ఇది స్థాపించబడలేదనీ "JESUS THE MAN" అన్న పరిశోధనాగ్రంథంలో (Doctorate పరిశోధన) అతి శ్రమచేసి ఖుమ్రాన్‌లోని గుహలపై చేసిన పరిశోధనలో ఋజువు చేయబడ్డాయి! కాబట్టి -

"కాశ్మీరులో జీసస్ సమాధి" - వుండటమూ, భవిష్యపురాణంలో జీసస్ హిమవత్పర్వతాలలో కూర్చుని ధ్యానించాడని వర్ణించిన పైశ్లోకాలతో సరిగ్గా రూఢి ఔతోంది, **చారిత్రక యదార్థమని!** కనుక 'ఖుమ్రాన్ వ్రాతప్రతుల' సాక్ష్యమూ కాశ్మీర్‌లోని జీసస్ సమాధీ అన్నీ కూడా, యదార్థ చారిత్రక సత్యాలని వ్యాసమహర్షి రాసిన '**భవిష్యపురాణం**'లోని ప్రతిసర్గ ఖండంలోని "ఈశపుత్రుడు" లేక, మసీహా వర్ణన ఋజువుచేస్తున్నది!

అయితే పైవర్ణనలోని జీసస్ చరిత్ర రష్యన్ రాయబారి నికోలాస్ నోటోవిచ్‌కు లభించిన బైద్ధ ఆశ్రమంలోని 'యోగి-ఈశా రహస్యజీవిత చరిత్ర'తో సరిపోతున్నదా? - ఈ విషయాన్ని వేరే అధ్యాయంలో పరిశీలిద్దాం!

## 'శకాధీశుడు' - ఎవరు?

ఇంతకీ భవిష్యపురాణంలో వర్ణించిన "శకాధీశుడు" ఎవరు? అన్న సందేహం ఒకటి కలుగుతోంది, పరిశోధనా దృష్టి కలిగినవారికి! ఈనాడు మనం క్రీస్తుశకం ఏర్పడింది జీసస్‌వల్ల అనుకుంటాం గనుక భవిష్యపురాణంలో వర్ణించిన **శకాధీశుడు** మాత్రం జీసస్ కాదని వ్యాసమహర్షి శ్లోకాలలోని "శాలివాహన భూపతిః" అంటే శాలివాహన చక్రవర్తి అన్న పదాలవల్ల "శాలివాహనం శకం" స్థాపించబడిన శకకర్తయే ఈ 'శకాధీశుడు!

"క్రీస్తు-శకం" కర్తకాదు ఎందుకంటే చారిత్రక పరిశోధనలో ఋజువైన విషయం - జీసస్ మరణించిన తర్వాత 800 A.D ప్రాంతంలో రోమన్ సన్యాసి (డయోనీసియస్ Dionysius) చే కల్పించబడిన కల్పితమైన శకం ఈ క్రీస్తుశకం అని **చారిత్రకంగా ఋజువైంది!** కాబట్టే 'భవిష్యపురాణం' "శకాధీశుడు"గా జీసస్‌ను వర్ణించలేదు!

జీసస్ జన్మించిన గ్రహస్థితులనుబట్టి కూడా ఈనాటి **క్రీస్తుశకంతో ఈయన జన్మకాలం** సరిపోదు! కాబట్టి శాలివాహన శకకర్తయే - ఈ "ఏకదాతు శకాధీశో" అన్న వాక్యానికి సరిపడే - 'శక-కర్త'!!!



# 13

# మరణించి-లేచిన యదార్థ అనుభవం - షిరిడీ సాయినాథుని పునరుత్థానం

1856వ సంవత్సరములో, మార్గశిర శుద్దపూర్ణిమనాడు, శ్రీసాయి తన ప్రియ శిష్యుడగు మహల్సాపతిని పిలిచి, 'భాయి వచ్చెడి వారందరూ ధనమునిమ్మని, సంతతినిమ్మని, ఐశ్వర్యమునిమ్మని, కీర్తినిమ్మని, రోగముల మాన్పుమని బాధల తీర్చుమని, కోర్కెల కోరువారేగాని - తరుగని జ్ఞానధనము కుప్పలుగా పోసియుంచితిని. ఓపికున్నంత తీసుకుని పొందని ఎంత చెప్పిననూ-ఆ చెంతకు పోవువారే లేరు. స్వార్థపరులై వ్యర్థములగు వరములనే కోరుచున్నారు. ఒక్కమారు "మహాదేవుని" దర్శించి వత్తును.

ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఆగినవని గానీ, నాడీ చలనము లేదని గానీ సందేహింపకుము. నేను మరణించితినని భయపడకుము. ఈ కళేబరమును మూడు దినములు కాపాడుము. నాల్గవనాడు ఉదయము తిరిగి రాగలను. అట్లు నాల్గవనాటి ఉదయము శరీరమున చలనము లేకున్నచో, నీవు కళేబరమును ఆ ఎదుటనున్న ప్రదేశమున పూడ్చి, గుర్తుగా రెండు జండాలు పాత వలసినది అని చెప్పెను.

శ్రీసాయియన్న భగవంతుడే అను అచంచల విశ్వాసముగల పరమ భక్తుడైన కారణమున, మహల్సాపతి మారు మాటాడలేదు. ఆనాటి రాత్రి సరిగా 10 గంటలకు శ్రీసాయి, మశీదునందు ధ్యాననిమగ్నుడయ్యెను. ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఆగిపోయినవి. కన్నులు మూసినవి, మూసినట్లే యుండెను. నాడీచలనము కూడా ఆగినది. గ్రామస్థులందరూ గుమిగూడిరి. పటేలు కూడా వచ్చి పరీక్షించినాడు. వైద్యులు పరీక్షించి శ్రీసాయి ప్రాణములు వదలెనని ధృఢముగా తెల్పిరి. పంచాయితీ చేసి శ్రీసాయి శరీరమును పూడ్చివేయుటకు అందరునూ సిద్ధపడిరి. మహల్సాపతి ఎంత చెప్పిననూ ఇతరులు విశ్వసించుట లేదు. ఆ మహాభక్తుడు ప్రమాదమును గుర్తించెను. వెంటనే శ్రీసాయి నామస్మరణతో శ్రీసాయి శరీరముపై బోరగిలపడి, తన శరీరముతో కప్పి తనను సజీవముగా పూడ్చిననేగాని బాబాను తాకుటకుగూడ వీలులేదని పట్టుబట్టెను. శ్రీసాయి అనుగ్రహమో ఏమో, అందుకు ఎవరునూ సాహసింపలేదు. మూడురోజులట్లే మహల్సాపతి ఆ శరీరమును అంటిపెట్టుకుని యుండెను. మూడు రోజులు గడిచిననూ శ్రీసాయి భౌతిక శరీరమునకు కాంతి తరగలేదు. నాల్గవనాడు ఉదయమగుసరికి శ్రీసాయి కనురెప్పలు కదిలినవి. కాళ్లు చేతులు చలించినవి. ఊపిరి కూడ పీల్చుచుండెను. ఉన్నట్లుండి శ్రీసాయి చివాలున లేచి కూర్చుండెను. మహల్సాపతి శ్రీసాయిని బిగ్గరగా కౌగిలించుకొనెను. పదే పదే ప్రణమిల్లెను. అతడెంతటి అదృష్టవంతుడు. ఆ చిన్మయ శరీరమును స్పృశించి కౌగిలించి ఆనందమనుభవించినాడు. పరమ యోగులకు గూడ లభ్యము గాని ఆ పదవి, మహల్సాపతిని అందుకొనెననుటకు సందేహము లేదు.

మహారాష్ట్ర దేశము నుండి, ఒక భక్తుడు బాబా దర్శనమునకని షిర్డీ చేరెను. ఆ మరుసటినాడు తెల్లవారక మునుపే అతడు బాబాను దర్శించుటకు మశీదు చేరెను. అచ్చట బాబా లేడు. సరిగదా! బాబా శిరస్సు 'ధుని' ప్రక్కన యున్నది-చేతులు గోడకు ప్రక్కన యుండెను. కాళ్లు మరియొక వైపున విసిరి వైచినట్లున్నవి. అంతియే కాదు; మొండెము మరి యొక చోట యున్నది. అతని కేమియూ దిక్కు తోచలేదు. దుష్టులెవ్వరో బాబాను హత్య చేసిరి, అని భయభ్రాంతుడై, కెవ్వున కేకవైచి చేతులతో కన్నులు మూసుకుని, బైటికి పరుగెత్తెను. బాబాను ఎవ్వరో దుర్మార్గులు నరికి చంపిరని పరుగునపోయి గ్రామస్థులతో చెప్పుదమని బయలుదేరినాడు. ఎవ్వరును లేని సమయమున అతడొక్కడే ఆ మశీదు ప్రవేశించి ఆ విషయమాతడు ఒక్కడే చూచినట్లు, తానే తెలిపినచో, తానే నేరస్థుడందురేమోయన్న భయమొదలెను. అతనికి ఒడలున చెమట క్రమ్మెను. కన్నులు చీకట్లు క్రమ్మెను. ఎట్లో తన మకాము చేరుకొనెను. భయముతో అతని శరీరము కంపించిపోయినది. అట్లే అన్న పానీయములైనను అడుగక బయటకు తొంగియైనను చూడక అతడు ఆ రోజంతయు మకామునందే, తలుపులు మూసుకుని గడిపెను. ఏ క్షణము ఎవరే వార్త తెత్తురో ఏ సమయమున తాను నోరు జారి, తాను చూసిన విషయము ఎవ్వరితోనైనను అనవచ్చునేమో! అట్లన్నచో అతనికి ఎంత ప్రమాదము, అను భయముతో ఆ రాత్రికూడా అట్లే గడిపినాడు.

కాని షిర్డీ యందలి ప్రజలలో ఎట్టి అలజడియు లేదు. బాబా లేడని గాని, హత్య జరిగినదని కానీ, ఎవ్వరునూ అనుకొనిన సందడి కూడ లేదు. ధైర్యము తెచ్చుకుని, అతడా మరుసటి ఉదయము మశీదు చేరెను. అప్పటికప్పుడే బాబా దర్బారునందుండెను. అతను ఆసనముపై, శ్రీ సాయి చుట్టునూ దివ్యకాంతితో వెలుగొందు తేజోమూర్తియగు శ్రీసాయిని చూచెను. తన కన్నులను తాను నమ్మలేదు. కన్నులు నులుముకొని, తిరిగి చూచినాడు. ప్రత్యక్షముగా శ్రీసాయి తోటి భక్తులతో భాషించుట గనుచుండెను. శ్రీసాయీ! యని పరుగెత్తి శ్రీసాయి పాదముల వ్రాలెను. చిరునగవుతో శ్రీసాయి, "బిడ్డా! ఏల అంత

భయపడితివి? నిన్న పగలు రాత్రి కూడా పానీయమైన లేక బాధనొందితివే! 'ఛా' (టీ) పుచ్చుకుని రమ్మ"ని పంపెను. ఆ తరువాత అతడు క్రిందటి ఉదయము మశీదున చూచిన వివరములన్నియు తెలిపెను. "దీనిని పెద్దలు ఖండ యోగ" మందురని, అది మహాయోగులకు గాని సాధ్యముగాదని, వారందరూ తెలిసికొనిరి.

ఇంకొక విచిత్రము. మసీదునకు 100 గజముల దూరములో ఉత్తరపు వైపున, పడమర దరిన మర్రిచెట్టు క్రింద ఒక పెద్ద బావి యున్నది. (ఈ బావి నేటికినీ యున్నది). దీనికి ప్రక్కన ఒక పెద్ద నేరేడు చెట్టు గలదు. శ్రీ సాయి మూడురోజుల కొకమారు ఆ బావి వద్దకు పోయి స్నానము చేయువాడు. ఆ రోజున ఉదరమున యుండు పెద్ద ప్రేవులను, వెడల గ్రక్కి, వానిని బైట లోపల గూడ శుభ్రపరిచి, గుడ్డలను పిండి ఉసిమినట్లు ఉసిమి, ప్రక్కనే యున్న నేరేడు చెట్టు కొమ్మపై ఆరవైచి, తరువాత తిరిగి ఆ ప్రేవులను మ్రింగెడివాడు! సాధరణముగా 'ధౌతి' చేయుట మనమెరుగుదుము. అనగా ఇరవై రెండున్నర అంగుళముల పొడవునూ, మూడు అంగుళముల వెడల్పునూ గల శుభ్రమైన గుడ్డను తడిపి, దానిని క్రమక్రమముగ లోనికి చొప్పించి, ప్రేవుల యందలి మలినమును తీసి శుభ్రపరచెదరు. అంతియేగాని, శ్రీసాయి చేసెడి ఈ 'ధౌతి' విపరీతము. అసామాన్యము. ఇతరులెవ్వరూ ఎన్నడూ ఈ తీరున 'ధౌతి' యొనరించుట వినము. అట్టిది యోగ స్వరూపుడగు శ్రీసాయికే తగినది. షిర్డీ యందలి ప్రజలనేకులు ఈ యోగమును చూచియుండిరి. అట్టి వారింకనూ కొందరు సజీవులై యున్నారు.



14

# “మృత సముద్రం” - వ్రాతప్రతుల రహస్యాలు

“దేవుని-వాక్యం”గా దాదాపు వెయ్యి సంవత్సరాలుగా ఇప్పుడున్న ఇంగ్లీష్ బైబుల్‌ను నమ్మే ప్రతీ క్రైస్తవుడూ రోజూ చదువుకునే గ్రంథం జేమ్సురాజు కాలంలో ఇంగ్లీష్‌లోకి అనువాదం చెయ్యబడింది ! ఈనాడు చర్చిల్లో, ప్రార్థనల్లోనూ, మరణించినవారి అంత్యక్రియల్లోనూ, ప్రతీ బిషప్పూ, ప్రతీ ‘ఫాదరీ’ చదివే హోలీ బైబుల్ (Holy Bible) ఒక పవిత్ర మతగ్రంథంలాగా - క్రిష్టియన్లు కానివారు కూడా - ఇది ఒక భగవద్గీత వంటి ‘దైవవాక్యం’ (Gospel) గా - ఒకే గ్రంథం అనుకునేలా సుస్థిరంగా పేరుకుపోయిన నమ్మకాన్ని - ఒక పెద్ద అణుబాంబువలే ప్రేల్చివేసినవి చారిత్రక పరిశోధన 1947 లో ఖుమ్రాన్

(Qumran) గుహలలో దొరికిన మృతసముద్రం వ్రాత ప్రతులు (Dead Sea Scrolls) అనబడే ప్రాచీన 'హీబ్రూ' బైబుల్ వ్రాతప్రతులు!!!

ఇది **1947**లో అకస్మాత్తుగా బైబుల్ పరిశోధకులకు లభించిన తోలుపై వ్రాయబడిన హీబ్రూభాషలోని అతి ప్రాచీనమైన వ్రాతప్రతులు!

బైబుల్ ఉనికినే సందేహంలో పడవేసిన ఈ వ్రాతప్రతులు ఇప్పటి ఇంగ్లీషు బైబుల్, దానిపై విశ్వాసాన్నే అగ్నిపర్వతంలా ప్రేల్చివేసిన ఈ 'మృత సముద్రం వ్రాతప్రతులు' (Dead Sea Scrolls) ఆధునిక 'బైబుల్' రూపురేఖలనే మార్చివేశాయి! అర్ధశతాబ్దంగా క్రైస్తవ ప్రపంచాన్నే భూకంపంలా కుదిపివేసే ప్రాచీన జెరుసలేము వద్ద లభించిన ఖుమ్రాన్ గుహలలోని ఈ వ్రాతప్రతులు బైబుల్ చరిత్రలోనే గొప్ప సంచలనాన్ని కలిగించాయి. ఇదేమిటో తెలియాలంటే ఖుమ్రాన్ గుహల వద్ద మృతసముద్రం (Dead Sea) తీరంలోని చీకటి గుహలలో లభించిన 'హీబ్రూ' (Hebrew) భాషలోని ప్రాచీన బైబుల్ వ్రాతప్రతులలో ఏం దొరికిందో తెలియాలి! అదేమిటో చూద్దాం!

అది **1947** వ సంవత్సరం! రెండు వేలఏళ్ళ బానిసత్వపు సంకెళ్ళు పటాపంచలు చేసి, బ్రిటీషు ప్రభుత్వ పాలన అంతరించి మన భారతదేశానికి 'స్వాతంత్ర్యం' లభించిన ఈ సంవత్సరంలోనే - మరొక బైబుల్ ప్రపంచానికి కూడా అంతే సంచలనాన్ని కలిగించే భావ స్వాతంత్ర్యాన్ని ప్రసాదించే చారిత్రక త్రవ్వకాలు లభించిన కాలం - అది బైబులుకే "స్వాతంత్ర్య" దినం వంటిది!!

అలా జెరూసలేం (Jerusalem) వద్ద జోర్డాన్ నదీ లోయకు **1300** అడుగుల సముద్ర మట్టం దిగువన 'మృత సముద్రం' (Dead Sea) వద్ద 'మోఅబ్' (Moab) పర్వతాలపై గొఱ్ఱెల్ని మేపుకొంటున్న ఆ పశువుల కాపర్లకు ఉన్నట్టుండి బైబుల్ "పాతనిబంధన" (Old Testament) గ్రంథంలో వినిపించే పేరు "జెరికో" (Jericho) అనే గ్రామం వద్ద కొండచరియల్లో "పురాతన-గుహలు" (Caves) కొన్ని బైటపడ్డాయి! కుతూహలం ఆశ్చర్యం ముప్పిరిగొని - అవి ఏమిటో చూద్దామని ఆ గుహలలోకి వెళ్ళి, సస్పెన్సుతో అడుగులో అడుగులేసుకుంటూ, చూసిన పశువుల కాపర్లకు - ఒక ప్రాచీన "ఆశ్రమం" (Monastery) వంటి యూదు (Jew) సన్యాసు లుండిన గుహ!!! ఎస్సీను (Essene) తెగ సాధువులకు చెందిన ఆశ్రమ గుహ అది!

అందులో కటిక చీకటి నిండిన గుహల్లో దాచివున్న 'జాడీ'ల (Jars) వంటి పాత్రలలో - ఎండిపోయి, మసిబారిన, మెలికలు తిరిగిపోయిన, 'తోలు' (Leather-Parchment) ముక్కలు - ఎందుకూ పనికి రానివనుకొని, ఊరికే కుతూహలం కొద్దీ ఏరుకుని, తెచ్చినవి - ప్రాచీన చారిత్రక త్రవ్వకాలు (Archeological excavations) పరిశోధించే సైంటిస్టుల కంటబడ్డాయి!

ఒక్కసారి, ఊపిరి ఆగినంత ఆశ్చర్యం గుండెల్లో రైళ్ళు పరిగెత్తించే - ఉత్కంఠ, 'సస్పెన్సు' రగిల్చే అతి ప్రాచీనమైన తోలుపై వ్రాయబడిన 'శాసనాలు' (Scrolls) అవి-అని తేలింది!!!

చీకటి గుహలలోకి ఆసక్తి కొద్దీ ప్రవేశించి వెతుకులాడిన ఆ కాపర్లకు - పెద్ద పెద్ద జాడీలలో భద్రంగా దాచి వుంచబడిన అతి ప్రాచీనమైన తోలు శాసనాల వంటి బహు పురాతన వ్రాతప్రతులు కళ్ళబడ్డాయి. అవేమిటో తెలియని ఆ వెర్రిగొల్లలకు వాటి విలువ అంచనాకైనా అందనిది! వాటిని దగ్గరి గ్రామంలోని వ్యాపారస్థులకు చూపగా 'విలువలేని తోలుముక్కల'ని విసరి తిరగ్గొట్టారు! సాధారణంగా అది అలానే పోతే - ఒక గొప్ప చారిత్రక పరిశోధనయే నశించిపోయేది నామరూపాల్లేకుండా!

అయాచితంగా అక్కడ బజారులో చారిత్రక పరిశోధకులు (Archeologists) ప్రొఫెసర్లు (Professors) కంట ఈ తోలుముక్కలు పడటంతో ప్రపంచంలో గొప్ప సంచలనం పెట్రోలు మంటలాగా ప్రజ్వలించింది!!!

II

ఫలితంగా నలభైమూడు దేశాలనుంచి చారిత్రక పరిశోధకులు (Research Scholars), పురాతత్వ త్రవ్వకాలను షరిశో ధించటానికి కాకుల్లా వచ్చి వాలారు. కోట్ల డాలర్లు ధర ఇచ్చినా లభించకుండా ఆ తోలుమీద వ్రాయబడిన వ్రాతప్రతులను జెరుసలేం ప్రభుత్వం 'ప్రభుత్వ ఆస్థి' (State property) గా గట్టి బందోబస్తుతో చట్టపరంగా నిక్షిప్తం చేశారు.

50 ఏళ్ళుగా నలభైమూడు దేశాల పరిశోధకులు నిరంతరంగా పరిశోధించి బైటపెట్టిన ఆటంబాంబు (Atom Bomb) వంటి చారిత్రక అవశేషాలు (Historical Relics) -ఈ "ఖుమ్రాన్ వ్రాత ప్రతులు" లేక మృత సముద్రం వ్రాతప్రతులు (Dead Sea Scrolls)!

"ఇంతకీ తోలుపై వ్రాయబడ్డ ఈ పురాతన హీబ్రూ భాషలోని, వ్రాతప్రతులలో లభించినది ఏమిటి?"

"యావత్ప్రపంచాన్నీ కుదిపివేసిన - సంచలనాత్మకమైన ఈ ఖుమ్రాన్ వ్రాతప్రతులు ఏయే విశేషాలను వెల్లడించాయి?"

బైబుల్ "పాత నిబంధన" (Old Testament) లోని అతి పురాతన బైబుల్ భాగాలు హీబ్రూ (Hebrew) భాషలో వ్రాయబడిన అతి ప్రాచీనమైన దస్తూరీతో, పురాతనమైన లిపిలో - ఈనాటి బైబుల్ "క్రొత్త నిబంధన"లను పోలిన భాగాలు!

ఐతే, ఇది రేడియోకార్బన్ సైన్సు పరీక్షల వల్ల తేలిందేమంటే - ఈ ప్రాచీన హీబ్రూ వ్రాతప్రతులు తోలుమీద వ్రాయబడిన వాటిలోది - ఈనాటి "కొత్త నిబంధనలు" (New Testament) లలో లభిస్తున్న దాని కంటే భిన్నమైన జీసస్ యొక్క చరిత్ర అని! ఇది ఈనాటి బైబుల్ సువార్తలు (Gospels) కంటే ఎన్నో దశాబ్దాలు కాదు - **"శతాబ్దాలు పురాతన మైనదని"** ఈ పరీక్షలు వెల్లడించాయి!!

'ఏమిటీ విచిత్రం?" ఇప్పటి బైబుల్ సువార్తల కంటే వందల సంవత్సరాలకు ముందే జీసస్ వంటి ప్రవక్తను గురించి వ్రాసినవి. ఖుమ్రాన్ వ్రాతప్రతులా?'

బైబుల్ పరిశోధకులకు తల తిరిగి పోయే టంతటి చారిత్రక ఆశ్చర్యాలే - ఈ ఖుమ్రాన్ వ్రాతప్రతులు!!!

III

యాభైయ్యారు దేశాల ప్రతినిధులూ, హీబ్రూ - జెరూసలెం యూనివర్శిటీ "ప్రొఫెసర్లూ", రోమన్ క్యాథలిక్ 'చర్చి' కి పీఠాధిపతి "పోప్" అనుచరగణం ప్రొటెస్టెంట్లు (Protestant) యూదు (Jewish) మతపరిశోధకులూ గ్రద్దల్లా వాలారు లెక్కలేనందరు క్షణాల మీద!

"ఖుమ్రాన్" - గుహల్లో లభించిన పురాతన బైబుల్ ప్రతిని "స్వంతం చేసుకోవాలని" లక్షల కోట్ల డాలర్లు కురిపిస్తూ - అర్థ శతాబ్దందాకా బైటపెట్టని రహస్యాలు ఈ ప్రాచీన "హీబ్రూ" - బైబుల్ - తోలు వ్రాతప్రతిలో ఏం వ్రాసి వున్నవి?

... అదంతా ఒక 'డిటెక్టివ్' నవల కంటే సస్పెన్సు (Suspense) ను రగిల్చే, కుట్రలు, కూటవ్యూహాలు, రహస్యనివేదికలూ, కోర్టు వాజ్యాలు - అన్నీ

చిత్రించే సంచలన గ్రంథం -

"The Dead Sea Scrolls Deception" - **మృత సముద్రం వ్రాతప్రతి మోసాలు!!!**

ఇద్దరు ప్రొఫెసర్లూ, బైబుల్ పరిశోధకులూ, ప్రాణాలకు తెగించి బైటపెట్టిన ఆశ్చర్యాలు, రహస్యాలూ - "మైకేల్ బైజెంట్" "రిచర్డ్-లైయ్"(Michael Baigent, Richard leigh) ఈ గ్రంథంలో ప్రచురించారు. అవి ఎంతమందికో కళ్ళు తెరిపించే ఆశ్చర్యాలు! ఆ అంతులేని వింతలూ!!! నమ్మశక్యంగానివి... చదవాల్సిందే!

ఇంతకీ "ఖుమ్రాన్ గుహల" లో దొరికిన 'మృత - సముద్రం వ్రాతప్రతులు' (Dead Sea Scrolls) - అర్థశతాబ్దంగా ప్రపంచాన్ని అట్టుడికించిన -"రహస్యా" లేమిటి? ఎందుకు వాటిల్లో బైటపడ్డ రహస్యాలను అణచివేసేందుకు ఈ మోసాలేమిటి? అన్న ఆశ్చర్యాలు, రహస్యాలనూ బట్టబయలు చేస్తుందీ గ్రంథం!!!

"ఖుమ్రాన్" గుహాలలో దొరికిన - "మృత సముద్రం వ్రాతప్రతులు" "Dead Sea Scrolls" అన్న ఈ అతి ప్రాచీన "హీబ్రూ" భాషలో వ్రాయబడ్డ "కొత్త నిబంధన" ల అతి ప్రాచీన అసలు వ్రాతప్రతి (Original) అని తేలింది! "రేడియో-కార్బన్" కాలమానంతో సైన్‌టిస్టులు" చేస్తే, ఈ వ్రాతప్రతుల వయస్సు - "క్రీస్తు శకం" (Christian Era) మొదలు కాక ముందు కొన్ని వందల ఏళ్ళనాటిదని తేలింది!!!

IV

"క్రీస్తు-శకం" కంటే ప్రాచీనమైనవిగా "రేడియో-కార్బన్" కాల గణితం (Radio Carbon Dating) ఋజువు చేసిన ఈ విచిత్ర వ్రాతప్రతులు బైటపెట్టిన భయంకర డైలమా (Dilemma), ఇది :

(I) జీసస్ కంటే కొన్ని వందల ఏళ్ళ ప్రాచీనమైన ఈ తోలు శాసనాలపై "హీబ్రూ" (Hebrew) ప్రతులలో - జీసస్ చరిత్ర ఎలా వున్నది?

(II) జీసస్ వంటి వ్యక్తి - క్రీస్తు పుట్టక ముందు శతాబ్దాల పూర్వమే - జీవించి వుండటం ఎలా సాధ్యం?

(III) ఈ "జీసస్" ఎస్సీను (Essene) సాంప్రదాయపు యోగి! సువార్తల కంటే ప్రాచీనుడు - ఇది ఎలాగ సాధ్యం?

(IV) "సువార్త" లనే గల్లంతు చేసే ఈ 'ఖుమ్రాన్' - గుహాలలో లభించిన

- హీబ్రూ బైబుల్ నిజమా? సువార్తలు నిజాలా?

యూభైఏళ్ళ క్రితం 1947 లో లభించిన - అతిపురాతనమైన "హీబ్రూ" (Hebrew Bible) బైబుల్ అసలు చేతి వ్రాతప్రతి (Original Manuscript) లో దాగిన సంచలనాత్మక రహస్యాలేమిటి? ఎందుకిలా యూభైఏళ్ళు, పాతిక దేశాల పరిశీలకులు "పరిశీలించి", కనుగొన్న సంచలనాత్మక చరిత్ర త్రవ్వి తీసిన భూకంపం వంటి సత్యాలేమిటి?

క్రిస్టియన్ మతాన్నే ఒక డైనమైట్ (Dynamite) మందుపాతర పెట్టి ప్రేల్చివేసినట్టు కుదిపివేసే - రహస్యాలు ఏమిటి? ఎందుకిలా గగ్గోలు పడుతున్నారు? అందులోని "వ్రాతప్రతుల యదార్థ - కాపీ" ఎందుకు అచ్చువేసి ప్రచురించలేదింకా? అనువాదం కాపీ అటుంచినా అసలు ప్రతియొక్క "మార్పులూ" "చేర్పులూ" ప్రక్షిప్తాలు చెయ్యకుండా - యధాతధంగా ఎందుకు అచ్చు వేసి ప్రచురించటం లేదు? జెరూసలెం ప్రొఫెసర్లు కోర్టు దాకా వెళ్ళి కేసు పెట్టితేగాని, బైటికిరాని ఈ ప్రాచీన 'హీబ్రూ' బైబుల్‌లోని రహస్యాలు వింతలూ ఏమిటి? ఇప్పుడిప్పుడే వీటన్నిటినీ బైటపెట్టే రెండు పరిశోధనా గ్రంథాలు బాంబులా పేల్చిన ఆశ్చర్యాలను అందించేవి:

I. The Dead Sea Scrolls Deception

- by Michael Baigent & Richard Leigh (1991-USA)

II. Jesus - "THE MAN"

by Barbara Thiering

(Corgi-Books 1992, 1993-UK)

[Double day and Co.Publ.(UK)]

అన్నవి అతి ముఖ్యమైనవి - బైబుల్‌ను కుదిపేసే ప్రాచీన రహస్యాలను తవ్వితీసిన "ఖుమ్రాన్" గుహలలో దొరికిన మృతసముద్రం హీబ్రూ బైబుల్ వ్రాతప్రతులు బైటపెట్టే సంచలనాత్మక - ఆశ్చర్యాలు! అవేమిటో చూచాయగానైనా పరిచయం చేసుకుందాం.

**"మృత సముద్రం - వ్రాతప్రతుల" మోసాలు**

Dead Sea Scrolls - Deception - by

Michael Baigent Richard Leigh

బైటపెట్టిన పరిశోధనా విశేషాలు వేరే అధ్యాయాలలో వ్రాశాను!
**"దేవుని - వాక్కు" బైబుల్ యొక్క గత చరిత్ర**
**నూరేళ్ళ - బైబుల్ పరిశోధన!**
అన్న అధ్యాయాలలో

V

దాదాపు పాతికేళ్ళుగా "ఖుమ్రాన్" (Qumran caves) గుహల వద్దనే మకాం పెట్టేసి వేరే పనులన్నీ వదిలేసి బైబుల్ రహస్యాలపైన, ఈ 'మృత-సముద్రం' గుహలను ఫొటో తీసి, అందులో లభించిన "హీబ్రూ" (Hebrew) బైబుల్ గ్రంథాన్ని అనువాదం చేసి ప్రచురించిన గ్రంథం :-

"Jesus - THE MAN" అన్న బైబుల్ పరిశోధనపై "డాక్టరేట్" Ph.D.గెల్చుకున్న పరిశోధనా ("రీసెర్చ్" - "తీసెస్" Thesis for Ph.D) గ్రంథం ప్రచురించినదో మహిళ!!! ఆమె పేరు "బార్బరా, తియరింగ్" (Barbara Thiering) Ph.D.

ఆమె ఖుమ్రాన్ (Qumran Caves) గుహలలో కనుగొన్న రహస్యాలు ఫొటోలతో సహా అప్పటి "ఎస్సీను" (Essene) "సాధువుల గుహ" లో లభించిన తోలుపై వ్రాసిన ప్రాచీన "హీబ్రూ" బైబుల్ గ్రంథంలో లభించిన ఆశ్చర్యాలేమిటి? ఆమె యథాతథంగా బైటపెట్టినవి గుండె ఆగే వింతలు:-

**(1)** జీసస్ వివాహితుడు. ఆయన వివాహం జరిగిన "యూదుల" (Jews) పంచాంగం (Calender) నుంచి సూర్య, చంద్ర గ్రహస్థితిని లెక్కించింది.

**(2)** జీసస్ "మేరీ" కి కుమారుడు. మామూలుగానే - తల్లీ తండ్రీ కలయికతో యూదుల "నిశ్చితార్థం" జరిగి "వివాహం" జరగక ముందు గర్భస్థుడయ్యాడు గనక - యూదులు (Jews) ఆచారం ప్రకారం ఆమె 'మిస్' (Miss) లేక "కన్య" గా వుండగానే జన్మించినట్టు - యూదుల మతాచారం ప్రకారం నిర్ణయించారు. ఆ విధంగా "కన్యా-పుత్రుడు" జీసస్ - కర్ణుడు కుంతికి పుట్టినట్టు.

**(3)** జీసస్ "ఎస్సీను" (Essene) సాంప్రదాయం ప్రకారం పొడుగాటి గిరజాల జుట్టూ తెల్లని బురఖా వంటి 'కఫ్నీ' (ముస్లిం 'ఫకీర్లు' ధరించే లాల్చీ, కుర్తాలు కలిసిన దుస్తులు) ధరించేవాడు.

**(4)** మేరీ - మేగ్దలీన్ (Mary Magdalene) అనే యువతిని జీసస్ వివాహం

చేసుకున్నా - తర్వాత ఆమెతో విడాకులు తీసుకున్నాడు. కాబట్టి వివాహితుడే!

(5) జీసస్ యూదులకై రాజకీయ విమోచనో(Liberation of Jews) ద్యమం నడిపాడు. అందులోని 'ఉగ్రవాది'గా జీసస్ సోదరుడు జేమ్సు (James) హత్య చెయ్యబడ్డాడు.

(6) రాజకీయ విప్లవంలో భాగంగానే "యూదులు" (Jews) రెండు పార్టీలుగా విడిపోయి - అందులోని ఒక 'అసమ్మతి - వర్గం' యొక్క రాజకీయకుట్ర ఫలితంగా "శిలువ" (Crucifixion) శిక్ష విధించబడ్డాడు! ఇందులో రోమన్ (Romans) ల ద్రోహం ఏమీ లేదు!

(7) "ఖుమ్రాన్" (Qumran) గుహలలో రాజకీయాలు జొరబడి "యూదు" (Jew) "ఉగ్రవాది" గా అరెస్టు కాబడి జీసస్ శిలువ వేయబడ్డాడు!

(8) శిలువ మీద నుంచి మరణించక ముందే దింపి ఆయనకు "మూలికా-వైద్యం" తెలిసిన ఎస్సీన్ (Essene) యోగుల మాలీసు (Massage) "అమృతాంజనం' ' వంటి లేపనాన్ని పూసి గుడ్డతో చుట్టగా కొన్ని గంటల తర్వాత ఆ వేడికి చెమట పట్టి తేరుకున్నాడు.

(9) ఆయన "శిష్యులు" ఎస్సీన్ యోగుల సాయంతో మూలికా వైద్యం యోగసాధనలతో కోలుకొని శిష్యుల ఇంట సమావేశానికి హాజరై - థామస్ (Thomas) తో బాటు అందరికీ కనిపించి తన మానీమానని గాయాలను చూపించాడు! ఇది "సువార్త" లలో కూడా వున్నది! అయితే "ప్రత్యక్షం" అయినట్టు చిత్రించారు. ప్రత్యక్షం కాదు యదార్థంగానే గాయాలతో, కట్లతో శిలువనుంచి దింపించబడి సగం కోలుకుంటున్న దశలో కనిపించి - ఖర్జూర కాయలు తిని నీళ్ళు త్రాగాడు! (ఇది సువార్తలలో కూడా వుంది!)

మామూలు శరీరం (గాయాలతో) కనకనే 'ఆహారం' తిన్నాడు. దేవతలలా పొగమంచులాటి 'ఆత్మ' తో ప్రత్యక్షం అయివుంటే ఇలా ఖర్జూరం తినటం నీళ్ళు త్రాగి రొట్టెను తినటం సాధ్యం కాదు గనక! ఆ తర్వాత ఎస్సీను (Essene) సాధువుల సాయంతో "జీసస్" - భారత్‌కు చేరుకున్నాడు. కాశ్మీర్‌లో 'రోజాబల్' లో సమాధి అయ్యాడు!

(10) అక్కడి నుంచి 'జెరూసలెం" ను విడిచి కాలినడకన పర్వతమార్గంగా

'జీసస్' ఈ శరీరంతోనే వెళ్ళిపోయాడు. ఇది ఎస్సీను (Essenes) యోగుల సహాయంతోనే జరిగింది!

తెల్లని సిల్కుధోవతులతో దేవదూతలుగా సువార్తలలో కనిపించినట్టు చిత్రించినది ఈ "ఎస్సీన్" యోగులే!!

**(11)** జీసస్ శిలువపై మరణించలేదు! పండుముసలిగా **86** సంవత్సరాల వయస్సులో తర్వాత మరణించాడు!

**(12)** "ఖుమ్రాన్" వద్ద గుహలలో దొరికిన "వ్రాతప్రతుల" లోని జీసస్ చరిత్ర ఇదే! దీనిలోని తేదీలే - కరెక్టు ఐన యూదుల పంచాంగం(Lunar Calender) ప్రకారం జీసస్ జననం - వివాహం, శిలువ వంటి వివరాలు ఆమె తన "డాక్టరేట్" Ph.D. పరిశోధనను 5 ఏళ్ళకు పైబడి ఖుమ్రాన్ గుహలలో జీవించిన ఫొటోలతో సహా "జీసస్" - ది 'మ్యాన్' అన్న తన పరిశోధనా గ్రంథంలో ప్రచురించింది! పై యదార్థ పరిశోధనా రహస్యాలను.

Jesus - "THE MAN" by Barbara Thiering బార్బరా తియరింగ్ అనే మహిళ చేసిన డాక్టరేట్ పరిశోధనా థీసెస్ ఇది!! డైనమైట్‌లాగా - బైబుల్ చదివే మనందరినీ - క్రీస్టియన్‌లనూ, ఇతర మతాల వారినీ కుదిపేసే భయంకర పరిశోధనా గ్రంథం - పుట్టుకతో క్రీస్టియన్‌గా పుట్టిన విదేశీ వనిత వ్రాసిన "సంచలన గ్రంథం" ఒక తరంపాటు మనందరి విశ్వాసాల్ని కుదిపేసే ఈ "మృత-సముద్రం" - వ్రాతప్రతుల రహస్యాలు ఈ 20వ శతాబ్దంలోనే "ఆటంబాంబు" వంటి 'సంచలనం' - కాదు "ప్రేలుడు"!!!



15

# వెయ్యేళ్ల బైబుల్ నమ్మకాలను 'బాంబు'లా ప్రేల్చి వేసిన - "ఖుమ్రాన్" వ్రాతప్రతుల చారిత్రక త్రవ్వకాలు!

ఈనాడు మనం జీవిస్తున్నది సైన్సు యుగంలో! అణుయుగంలో, అంతరిక్ష యుగంలో! అణువు గురించిన డాల్టన్ సిద్ధాంతం పటాపంచలైన మానవ పరిణామవాదంతో అసత్యమని ఋజువై బైబిల్‌లోని ఆదం సృష్టికథలాగే ఎన్నో సిద్ధాంతాలు పేకమేడలలా కూలిపోయే కాలంలో మనం జీవిస్తున్నాం! శరవేగంతో మారిపోయే మన అంచనాలు యదార్థం పరిశోధనల ధాటికి తలఒగ్గక తప్పదు! ఈ ప్రక్రియలో మనం నమ్మిన

నమ్మకాలు ఊహించిన కలలు, భక్తి విశ్వాసాలతో నిర్మించుకున్న ఊహా చిత్రాలు చరిత్ర ధాటికి కూలిపోతే బాధకలగటం సహజం! ఇది మానవ జీవితంలో బహుశా తప్పదేమో? బాల్యం నుంచీ నడివయస్సుకు చేరేవారి అభిప్రాయాలు మారిపోయినట్లే, ఇదీనూ! పై పరిణితితో మన దృక్పథం పరిపాకమైనప్పుడు చారిత్రక సత్యాన్ని తొణుకూ బెణుకూ లేకుండా యదార్థంగా జీర్ణించుకోగలం! దీనికి కొంత జీర్ణశక్తి అవసరం - ఈ నిజాన్ని జీర్ణించుకోవడానికి!

అదేమిటంటే - బైబుల్‌లోని జీసస్ ఊహా చిత్రాన్ని, చారిత్రక పరిశోధనలోని యదార్ధవిషయాలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాయి అంటే - దానికి గ్రుడ్డివిశ్వాసంతో రోమన్ కేథలిక్ బిషప్పుల ప్రచారాన్ని కళ్ళు మూసుకుని ప్రచారాన్ని జుర్రుకున్నవారిదే తప్పు! తమ వివేకాన్నీ విమర్శలనూ కోల్పోయేటంతగా మత ప్రచారకుల ప్రాపగాండాను నమ్మటం తప్పు! ఈనాటి TV లోని వ్యాపార ప్రకటనలు చూసి ఆ వస్తువులు కొనేవారి పిల్లల వంటి మనస్తత్త్వమే దీనికి కారణం! ఇది ఎంత రుచిగావున్నా నమ్మేవారి మనసులు అనుకూలంగా ఉన్నాసరే - యదార్ధసత్యంతో సాటిరాదు! యదార్థం ఎప్పుడూ నిష్ఠూరంగానే ఉంటుంది! ఇది జీవిత సత్యం! అంటారు బైబుల్ పరిశోధకులు!

మత విశ్వాసుల మనస్సులో ఊహా చిత్రంగా వున్న జీసస్ అహింసావాది - మేకపిల్లవంటి అమాయకుడు. ఇదే యదార్ధమైతే యూదుల దేవాలయంలో డబ్బులు మార్చేవానిపై జీసస్ అత్యాచారం చేయడం ఏమిటి? జీసస్ అహింసావాదియే గనుక నిజంగా అయివుంటే - తన శిష్యులను భక్తులలో సాయుధులుగా తయారుకమ్మని ఎందుకు ఆదేశిస్తాడు? అంతే కాదు పీటర్ కత్తి దూసి ఎదట వున్న వ్యక్తి చెవి తెగేలా వేటు వేయ్యడం ఏమిటి?- ఇలా అడుగడుగునా జీసస్ యదార్థ వ్యక్తిత్వాన్ని చారిత్రక సత్యమైన అతనిచేతలకు, మత ప్రచారకుల ఊహాలచే కల్పితమైన చిత్రానికీ విరుద్ధం స్పష్టంగా కనిపిస్తోంది! నిజానికి ఆనాటి క్రైస్తవ మతం యూదుమతంలోంచి ఏర్పడ్డ ఒక దైవికమైన బోధన కాదు! - ఖుర్రాన్‌లోని సాక్ష్యాధారాలు ఏమి ఋజువు చేస్తున్నాయంటే - జీసస్ ఒక విప్లవనాయకుడు! ఉగ్రవాదిఐన రాజకీయ ఉద్యమానికి నాయకుడు లేకుంటే ఆనాటి

రోమన్‌లు రాజకీయ ఉగ్రవాదులకు విధించే శిలువవంటి శిక్ష జీసస్‌కు ఎందుకు విధిస్తారు?"-అంటారు బైబిల్ పరిశోధకులైన మైకేల్ బైజెంట్, రిచర్డ్ లై అన్న జెరుసలేం యూనివర్సిటీ వద్ద పరిశోధనలు చేసిన ఇద్దరు ప్రొఫెసర్లు.

"And we discovered how fiercely the world of orthodox Bibilical scholarship was prepared to fight to retain its monoply..."

"For Christians today it is perfectly possible to acknowledge the Buddha for example or Muhammad as historical individuals, just as one might, Caesar or Alexander and to differentiate them from the Legends the traditions, the theologies that have become associated with them... so far as Jesus is concerned, however such differentiation is altogether more difficult. At the very heart of Christan belief, history and theology are inextricably entangled... each suffuses the other. Yet each, I looked at seperately, is a potential threat to the other...

On the one hand, there is historical individual, the Man who, according to most scholars actually existed and walked..."

".... on the other hand, there is the Man-God of Christian Doctrine, the Divine personage deified, extolled and promulgated by St. Paul. To examine this personage as an historical individual.... as we might regard Muhammad or Buddha, Caesar of Alexandar - is for many Christians Blasphemy."

".... As historical documents and testimony, the Gospels, as every scholar knows are notoriously unreliable... - like a novel... intended for specifically propagandistic purposes and with panel as protagonist."

"It was therefore with surprise and zest that we plunged into the background of the historical Jesus...."

".... was Jesus indeed the meek lamblike saviour of subsequent Christian tradition? Was he indeed wholly non-violent? Why, then, he embark on violent actions such as overturning the tables of the money - changers in the Temple? Why is he portrayed

as being executed by the Romans in a fashion reserved exclusively for revolutionary actvity? Why... in Gethsamane did he instruct his followers to equip themselves with swords? Why did Peter actually drew a sword... and if Jesus was infact, more militant necessity more politically committed?... such were the contradictions and prevailing confusion we found.... According to some, Christianity arose as a quietest mystery - school form of Judaism which could not therefore have any a connection with militant revolutionary nationalists such as Zealots.... Christianity was itself, at first, a form or revolutionary Judaic nationalism..."

- 'The Dead Sea Scrolls - deception' By, Micheal Baignet, & Richard Leigh (1991) USA.

అంటాడు ఖుమ్రాన్ వ్రాతప్రతులపై (Dead Sea Scrolls of Qumran) రిసెర్చి చేసిన రిచర్డ్ లై ధైర్యంగా జీసస్‌పై చేపట్టిన చారిత్రక పరిశోధనలలో తమకు ఎదురైన క్రైస్తవ ఫాదరీల యిబ్బంది గురించి! అలా బైబుల్‌లోని (picaresque) ప్రచార సాహిత్యమూ కల్పితగాధల నుంచి చారిత్రక సత్యాన్ని జీసస్ గురించి విడతీస్తూ పోతే ఎదురయ్యేది, భయంకర చారిత్రకమైన సత్యం! దానికీ మతప్రచారకులచే ప్రచారంచేయబడ్డ జీసస్ చిత్రానికీ ఎట్టి సంబంధమూ లేదు! బైబుల్ ప్రకారం చూస్తే జీసస్ అహింసావాది! చీమను కూడా చంపలేని సాధుమూర్తి! కుడి చెంప కొడితే ఎడమ చెంప చూపించే అమాయకుడు. కాని యదార్థమైన చారిత్రక వ్యక్తిగా జీసస్ గురించి ఈ పరిశోధకుని వాక్యాలు ఆశ్చర్యం గొలిపేలా వున్నాయి.

పై వాక్యాలు ఈనాటి చరిత్ర పరిశోధనలో వెల్లడైన జీసస్ జీవితంలోని ఆనాటి రాజకీయ ఉగ్రవాద పోకడలు క్రైస్తవ ఫాదరీలచే తయారు చేయబడ్డ సువార్తల ప్రచారం తలకెక్కిన వారికి కళ్లు తెరిపిస్తాయి.... త్రుళ్ళిపడేలాగ చేయకమానవు! పై పరిశోధకులను ఆశ్చర్యపరచినట్లే! దీనికి కారణాలు పై వాక్యాలలో స్పష్టంగానే వివరించారు - ఈనాడు ఇతర మతాల ప్రవక్తలగురించి గౌతమ బుద్ధుడు, మహమ్మద్ లేక ఇతర చారిత్రకవ్యక్తులు జూలియస్ సీజర్, అలెగ్జాండర్‌వంటి వారిపై చారిత్రక పరిశోధన ఎవరికీ ఎబ్బెట్టుగా కనిపించలేదు!

కాని అదే పరిశోధన చరిత్రకారులు జీసస్ జీవితంలోకి వెళ్ళి పరిశోధిస్తే అది ఓ గొప్ప దైవద్రోహము (Blasphemy) గానూ బైబిల్‌ను గ్రుడ్డిగా నమ్మేవారికి అనిపిస్తుంది!

ఎందుకంటే చరిత్ర సాక్ష్యాధారాలు వేరు. చారిత్రక వ్యక్తియొక్క యధార్థ సత్యం వేరు; మత విశ్వాసంతో ఊహించుకొని వున్న జీసస్ ఊహా చిత్రం వేరు! ఒకదానికి యింకొకటి పూర్తిగా విరుద్ధము - బహిరంగ విరోధ సత్యాలు, ఈ రెండూ" - అంటారు పై గ్రంథకర్తలు. అయినా ధైర్యంచేసి వారీ "ఖుమ్రాన్ పరిశోధనా వ్రాతప్రతుల" (Dead Sea Scrolls of Qumran) చారిత్రక కాలానికి దిగి త్రవ్వి పరిశోధన చేసి కనుగొన్న సత్యాలు ఆశ్చర్యకరమైనవి, భయంకరమైనవి!

పై విశ్లేషణవల్ల మరో ముఖ్యవిషయాన్ని స్పష్టంగా తెలియజేస్తున్నారీ బైబిల్ పరిశోధకులు...

దీనికి కావలసిన నిబ్బరం వున్నవారే - సత్యం కోసం అన్వేషణచేయాలి! అలా లేనివారు వారికిష్టమైన తియ్యని ఊహాలలోనే జీవించవచ్చు!

ఈ విషయం బైబుల్ "పాత నిబంధనల" వ్రాతప్రతులు ప్రాచీన హీబ్రూ" (Hebrew) భాషలో, తోలుపై వ్రాసినవి, "ఖుమ్రాన్ గుహ"లో లభించిన అతి ప్రాచీన గ్రంధాలైన "మృత సముద్రం వ్రాతప్రతులు" **1947**లో లభించాయి! ఈ ప్రాచీన (Dead Sea Scrolls) ను కనుగొన్న బైబుల్ పరిశోధకులు తెగించి బైట పెట్టిన "Dead Sea Scrools - Deception" అన్న సంచలనాత్మక పరిశోధనా గ్రంథంలో ఆశ్చర్యకరమైన యదార్థ సత్యాలు త్రవ్వకాలలో లభించిన బైబుల్ వింతల్ని కనుగొన్న ఈ పరిశోధనలు!!! ప్రపంచాన్నే భూకంపంలా కదిలించాయి!



16

# జీసస్ సోదరుడు జేమ్స్?

చాలామంది భక్తితో దేవుని ఏకైక కుమారుడని జీసస్‌ను విశ్వాసంతో ప్రార్థించేవారిలో చాలామందికి తెలియని విషయం - జీసస్‌కు సోదరుడు ఉన్నాడని! అతని పేరు జేమ్స్! సాక్షాత్తూ దేవుని కుమారుడైన జీసస్‌కు సోదరుడిగా జేమ్స్ నిర్వహించిన పాత్ర. వివరాలు ఇప్పుడిప్పుడే బైబులు - పరిశోధనలో బయటపడుతున్నాయి. 'సువార్తలలో స్పష్టంగా జేమ్స్ గురించిన ప్రసక్తి ఉన్నది! కాని చాలా మంది గమనికగా చదవరు.

"The new Testament itself, James is mentioned in the Gospel as one of Jesus's brothers, though the context generally are confusing" and has obviously been tampered with"

అంటారు. బైబుల్ పరిశోధకులైన మైకెల్, జైజెంట్ రిచర్డ్‌లై అనే పరిశోధకులు ప్రాచ్య పరిశోధనలో బయటపడ్డ మృతసముద్రం వ్రాతప్రతులు

(Dead Sea Scrolls) గురించిన తమ గ్రంథంలో! ఇంతకీ జేమ్స్' గురించి చరిత్రలో మరుగునపడినవి 'సువార్త'లలో సరిగ్గా ఆ ప్రాముఖ్యతగా ఏమిటో చెప్పబడినది - అది ఏమిటి? 'సువార్తలలో The General epistice of James మొదటి పేరాలోనే ఎక్కడా తాను జీసస్ సోదరుడన్న విషయం పైకి రాకుండా "James a servant of God and of the Lord of Jesus Christ...

James I (1)

జేమ్స్ గ్రంథంలో క్రీస్తు జీవితంలో కనబడని అనేక ఆశ్చర్యకరమైన అంశాలలో - జీసస్ శిష్యులు జీసస్ సోదరులు అనుచరులు పాల్గొన్న యుద్ధాలు అంతః కలహాలు డమ్మీలు చరిత్ర దృష్టికి రాకుండా మరుగుపడి ఉన్నాయి! ఇవన్నీ సంగ్రహంగా పరిశీలించిన బైబుల్ పరిశోధకులు - అసలు జీసస్‌ను శిలువ వేసి శిక్షించవలసిన గందరగోళం యూదులలో ఎందుకు ఏర్పడింది? జీసస్ పరాయివాడేమీ కాదు. స్వయానా యూదులలోనే జన్మించాడు! అంతేకాదు వారి కోసం సాయశక్తులా శ్రమించాడు! ఎన్నో మహిమలు కూడా చేసినట్టు సువార్తలలో వ్రాయబడి ఉన్నదికదా?' అలాంటప్పుడు సాటి యూదులకు జీసస్‌ను శిలువవేసి శిక్షించవలసినంత విరోధం కలిగే రాజకీయ కారణాలు ఏమిటి? అన్న అంశంపై జర్మన్ ఫ్రెంచి బ్రిటిష్ బైబుల్ చారిత్రకులు చేపట్టిన పరిశోధనలో కొన్ని ఆశ్చర్యాలు వెల్లడయ్యాయి! రోమన్ కేథలిక్ ఫాదరీల ప్రచారంలో కనిపించినట్టు ఒక చెంప కొడితే రెండవ చెంప అందించే మెత్తనివాడు. సాధువు! అహింసావాది గనక జీసస్ అయివుంటే అతడి సోదరుడు జేమ్స్ రాసిన.భాషంలో స్పష్టంగా ఈ క్రింది వాక్యాలు ఎలా చోటు చేసుకున్నాయి.

Chapter IV

"From whence come *wars and fightings* among you, come they not hence even of youcusts that war in your members.

(2) "... Yee kill and desired to have you fight and war...

Ye ... and ..."

అన్న అనేక వాక్యాలలో నిగూఢంగా ఉన్న యుద్ధాలు తిరుగుబాట్లు కామకలాపాలు (lusts) ఏవో ఆధ్యాత్మిక అంశాలు కాదు - ఆనాటి

రాజకీయ పరిస్థితుల గురించిన వాక్యాలు : జర్మన్ పరిశోధకులు రాబర్ట్ రిసెనెన్ (Rebort Reseinen - Chairman of the Department of Religious studies and Prof. Mickle Eart religions California USA) చేసిన పరిశోధనలో వెల్లడైన అంశాలు ఇలా వ్రాస్తున్నాడు.

Was Jesus indeed the meek lamb like saviour of subsequent Christian tradition? Was he indeed wholly non-violent? Why, then did he embark on violent actions?

Why is he potrayed as being the executed The Roma, in a fashion reserved exclusively for revolutionary activity? Why before is vigil in Gethsemane, did he instruct his followers to equip themselves with swords?

Why did peter actually draw a sword and lop off the ear of a minion in the High Preist's entourage? And if Jesus was in fact more militant than generally depicted, was he not also of necessity, more politically committed?

... At the Centre of the Puzzle we were to discover was a hitherto unknown connection the elusive figure of St. James, Jesus brother, whose dispute with Paul precipitated the formulation of the new religion subsequently known as Christianity.

జేమ్స్ నిజానికి ఈనాటి క్రైస్తవ మతంలో చోటు చేసుకున్న సిద్ధాంత అంశాలకు మూల పురుషుడు! జీసస్ కాదు!!! ఈనాడు రోమన్ కేథలిక్ చర్చి ఫాదరీల చేత 1800 సంవత్సరాలు రోమ్‌లో ఒక రాజకీయ కేంద్రం (Political centre) గా పోప్ పీఠాన్ని తీర్చిదిద్ది - తరతరాల మతాధిపతులుగా కాకుండా పోప్‌లు, సైన్యాలను తయారు చేసి పక్క రాజ్యాలను ముట్టడించి క్రమంగా రోమ్, జర్మనీ, ఇంగ్లండ్ దేశాలలో రాజులను యుద్ధాలతోనూ వత్తిడితోనూ మతం మార్పిడికి గురిచేసి ఈనాటి యూరప్‌ను క్రైస్తవ దేశాలుగా మార్చిన క్రైస్తవ మతం నిజానికి జీసస్ నిర్మించినది కాదు!

ఇది అతడి సోదరుడు జేమ్స్‌ది కాదు!

జీసస్ తన బోధనలలో దేవుని సామ్రాజ్యం (Kingdom of God) వస్తుంది అని చేసిన వాగ్దానం ఫలించలేదు! వచ్చింది - పోప్‌ల రోమన్ సామ్రాజ్యం, చర్చి సామ్రాజ్యం అంటాడు జర్మన్ పరిశోధకుడు ఐసెప్‌మెన్! దీనికి కారణం జేమ్స్ యొక్క నిగూఢమైన పాత్రను గురించి పరిశోధిచస్తే కాని తెలియదు!

జోసెఫ్ అనే యూదుల చరిత్రకారుడు జేమ్స్‌గురించి కొద్దిగా వ్రాశాడు. ఆతర్వాత ప్రాచీన బైబుల్ చరిత్రకారులు యూసేబియస్ (Eusebius) హసిపస్ (Hegesipus) అనే చర్చి చరిత్రకారుణ్ని సాక్ష్యాల ఆధారంగా జేమ్స్ గురించి అతడు నిజంగా ఒక ప్రవక్త ప్రైబర్ పెరిసిపస్ వంటి పవిత్ర వ్యక్తిగా వర్ణించాడు! హాళెగసిపస్ చరిత్ర ప్రకారం కలిసి జేమ్స్‌ను హత్యచేశారని రాశాడు! దీని వల్ల పాత నిబంధనల ప్రవక్త ఇసయ్యు (Isaiah B-10) చెప్పిన భవిష్యత్ జేమ్స్ హత్యను గురించి అంటాడు!

దీనికి కారణం జీసస్ అధికారమ్ము్య జేమ్స్ నాయకత్వాన్ని యూదులలో జరిగిన అంతర్యుద్ధమే! దానిక ఫలితమే జేమ్స్ హత్య, యూదులలో గలాటా చివరకు రోమన్ ప్రభుత్వం రాజకీయ ఉగ్రవాదులకు విధించే శిక్ష 'శిలువ'తో ఈటెతో జీసస్‌ను శిక్షించడం! ఈనాటి బైబుల్‌లోనుంచి తొలగించబడ్డ రాజకీయ నేపథ్యం జేమ్స్ జీవితం చూస్తేనే తెలుస్తుంది అంటాడు! జీనిడియోప్ అనే చరిత్రకారుడు; జేమ్స్‌నే హత్య చేసిన విధానం కూడా స్పష్టంగా వర్ణించాడు.

దీన్నిబట్టి ఈనాటి బైబుల్‌లో లభించని (తొలగించబడిన కేథలిక్ ఫాదరీచే) అంశాలు "హీబ్రూ బైబుల్"లో ఉండిన నిగూఢ విషయాలు - ఖుమ్‌రాన్ (Qumran) వద్ద లబించిన 'మృత సముద్ర' (Dead Sea Scrolls) వ్రాత ప్రతులలో బయటికి వచ్చింది. వ్రాత ప్రతులు దాచబడిన గుహాలలో అప్పటి రాజకీయ తిరుగుబాట్లు చేసిన రోమన్ల నుండి తప్పించుకు పారిపోయిన యూదు విప్లవ ఉగ్రవాదులు (Radical Revo-

lutionary Hebrews) తలదాచుకున్న గుహలు ప్రత్యక్షంగా లభించడం బైబుల్ పరిశోధకులకీ యావత్ క్రైస్తవ ప్రపంచానికీ కూడా దిగ్భ్రాంతి కలిగించే చారిత్రక సత్యం! ఇందులో ఇక్కడ మనకు ఆశ్చర్యం కలిగించే విషయం యూదుల మత నాయకుడుగా ఇటు జీసస్‌కు అటు సోదరుడు జేమ్స్‌కు మధ్య జరిగిన అంతః కలహం (Civil War) దీనిని గురించి

From the acts of the Apostles from Josephus and from early Christian historians, there emerges a coherent, yet still incomplete, portrait of James, the Lord's brother. He appears as an example of righteousness - so much so that the just or the Righteous is appended as a sobriquet to his name. He is the acknowledged leader of a sectarian religious community whose members are zealous for the law. he must contend with two quite.

Eusebius goes on to describe the death of James in the following manner :

So they went up and thew down the Righteous one. They said to each other let us stone James the Righteous and began to stone him as inspite of his fallhe was still alive. . . while they pelted him with stones ... (a member of a particular priestly family called out, stop! What are you doing ... Then one of them, a fuller, took the club which he used to beat clothes, and brought it down on the head of the Righteous one. Such was his martyrdom.

పై వాక్యాలలో ముఖ్యంగా గమనించదగ్గది జేమ్స్ to turn renegad prevaricate the quarrel with his superiors hijack the image of Jesus and begin preaching his own doctrine -

అన్న వాక్యాలు గమనించదగ్గవి! ఖుమ్రాన్ వద్ద తవ్వకాలలో బయట పడ్డ హీబ్రూ బైబుల్ వ్రాతప్రతులలో వెలికి తీసిన రాజకీయ చరిత్రలో జీసస్ సోదరుడు జేమ్స్ అసమ్మతి వాది గానూ తిరుగుబాటు దారుడిగానూ

(renegad) అంతేకాక మాట మార్చే అవకాశవాదిగానూ Prevanicate మాత్రమే కాక ఈనాటి రాజకీయ వేత్తవలే తన నాయకునిపై తిరుగుబాటు చేసినట్టి జీసస్‌ను పీఠం నుంచి తొలగించి యూదుల నాయకత్వాన్ని తానే వహించి తన సిద్ధాంతాన్ని చొప్పించి జీసస్ బోధనలను తర్వాత చర్చి క్రైస్తవ మతంలోనుంచి తొలగించిన ఉద్యమానికి జీవం పోసినవాడు క్రీస్తు సోదరుడైన జేమ్స్!!

ఈ విషయం తెలియకపోతే ఈనాటి రోమన్ కేథలిక్ బిషప్పులు శతాబ్దాల తరబడి బైబుల్‌లో నుంచి ముఖ్యమైన క్రీస్తు బోధనలను జీసస్ ఆధ్యాత్మిక బోధనలను తొలగించి వారి ఇష్టమొచ్చిన విషయాలను ఎందుకు చొప్పించారో అర్థంకాదు!

ఈ ఒక్క కారణం వల్లనే బైబుల్‌లో నుండి అతి ముఖ్యమైన భాగాలు ఎందుకు తొలగించబడ్డాయో నిజమైన జీసస్ చరిత్ర మనకు లభించకుండా అణచివేసి తొక్కిపట్టిన చర్చి బిషప్పుల రాజకీయ ఉద్యమానికి బీజమేమిటో బోధపడదు!

అసలు చాలా మందికి బైబుల్‌లో చాలా భాగాలను తొలగించే క్రైస్తవ సభలు ఎన్ని జరిగాయో ఎన్ని భాగాలు బైబుల్ నుంచి తొలగించబడ్డాయో కొంచెం కూడా రేఖామాత్రంగానైనా తెలియని అజ్ఞానంలో మ్రగ్గుతున్నారు!

వాటి వివరాలు వచ్చే అధ్యాయంలో తెలుసుకుందాం!



17

# "బైబుల్ పై పరిశోధన"

"పదిహేను 15- సెప్టెంబర్ 4004 B.C నాడు ఉదయం సరిగ్గా 9 గంటలకు దేవుడు ఈ ప్రపంచాన్ని సృష్టించాడు." -అని బైబుల్ ఆధారంగా బిషప్ ఆషర్ (Bishop Usher) భగవంతుని వాక్యం (Word of God) ప్రమాణంగా వ్రాశాడు ఇది అచ్చయి బైటకువచ్చి రాకముందే యూరపులోని గుహలలో పాతరాతియుగం నాటి అవశేషాలు, ఎముకలు క్రీస్తుకు పూర్వం ముప్పై వేల సంవత్సరాల నాటి కట్టడాలు, ఇతర పనిముట్లు లభించాయి!! అంటే భగవంతుని వాక్యమైన బైబుల్‌లోని సృష్టికి ఇరవై ఆరువేల (26,000) సంవత్సరాలకు ముందే మనుష్యులు పాతరాతి యుగం (Old Stone Age) లో జీవించారని నేటి సైంటిస్టులు కనుగొన్నారు. దీనితో మొదలైంది అందరికీ ఈనాటి బైబుల్‌లోని మాటలు సాక్షాత్తూ భగవంతుని ప్రత్యక్ష వాక్యం Spoken word of God అని నమ్మటానికి వీలులేదని! మరికొద్ది కాలానికి చార్లెస్ డార్విన్ (Charles Darwin)

మహాశయుడు సైన్సు పరిశోధనకై బీగిల్ (Beagle) అనే ఓడలో, అమెరికా, ఆఫ్రికా, ఇతర దేశాలు పర్యటించి అగ్ని పర్వతాలూ, జంతువులూ, వృక్షాల ప్రాచీన అవశేషాలూ, శిలాజములు (Tyilobytes) లభించాయి. దీనితో భూగర్భ శాస్త్రం లేక జియాలజీ (Geology) ఒక నిర్దుష్టమైన సైన్సులాగా రూపొందించి చేసిన పరిశోధనల ఫలితంగా ఈ భూమ్మీద రెండు వందల కోట్ల సంవత్సరాలకు పైగా జీవరాసుల సృష్టి ఉండి ఉన్నట్లు - ఈనాడు ప్రపంచమంతా నిర్ధారణ అయిన సైన్సు సత్యంగా అందరికీ తెలిసింది! దీనివల్ల ప్రతివారికీ "భగవంతుని వాక్యంగా బైబుల్‌లో వ్రాసిన వాక్యాలెక్కడివి? ఎవరు రాశారు?" అంటూ చరిత్రక పరిశోధన మొదలైంది. ఈ సైన్సు కనుగొన్న క్రొత్త క్రొత్త విషయాలవల్ల!

స్పానిష్ ఫాదరీ కాల్టెన్ కోర్టిస్ (Calten Cortis) అనేవాడు మొదటిసారిగా మెక్సికోలోని ఆదిమ నివాసుల మతాన్ని చూసి దిమ్మెర పోయారు. వారి మతంలోని ఎన్నో అంశాలు బైబుల్‌లోని విషయాలను పోలివుండటం చూసి -

పదమూడు ఊర్ధ్వ లోకాలు, ఏడు నరకాలు అందులో మ్రగ్గుతున్న జీవులూ ఆపైన విశ్వంలో వెలిగే "భగవంతుడు" వీరి మతంలో స్పష్టంగా వర్ణించబడివుండటం మరో వింత! -మానవజాతికి రక్షకుడు (Saviour) ఒక "కన్యక" (Virgin) కడుపున జన్మించాడని! ఒక సర్పం వల్ల పాపము ఫలితంగా అతడు మరణించి తిరిగి పునరుద్ధానం (Resurrection) పొందాడనీ చూసి ఆ ప్రాచీన మెక్సికన్ మతగ్రంథాన్ని తగుల బెట్టాలని నిర్ణయించారు.

"Cortes and Catholic Spain's Padres arrived in Aztec Mexico, they discovered many parallels to their own Religion, and were hard put to explain the - 13 heavens and 9 hells as purgatories to suffering souls - and a God high above all represented by Pyramids". Besides, there was already an incarnated Saviour "born to a Virgin" associated with a Serpent who died and was Resurrected".

తరువాత బైబుల్ పరిశోధకులకు తగిలే మరో ముఖ్యమైన మైలురాయి - "బైబుల్‌లోని జలప్రళయం కథ" అందులో నోవా (Noah) అనేవాడు ఒక నావలో కొంతమందిని రక్షించడం గాథ - సరిగ్గా అదే వివరాలతో కొద్ది పాఠభేదాలతో (Text diferences) సుమేరియాలోనూ, ఇరాన్‌లోనూ, జపాన్‌లోనూ అమెరికాలో ఆదిమ నివాసులైన ఎఱ్ఱ ఇండియనులోని (Red Indian) మతంలోనూ చివరికి బైబుల్‌లోని అనేక ఇతర గాథలనూ - బాబిలోనియా మతంలోని "గిల్ గామేష్ వృత్తాంతం" (Gill gamesh Epic) లోనూ లభించడంతో, ఇంకా ముందు వేదంలోనూ శతపథ బ్రాహ్మణంలోనూ మహాభారతాలలోనూ 'వైవస్వత మనువు' జలప్రళయం వచ్చినప్పుడు ఒక నావలో జీవరాశులను సప్త మహర్షులను కొన్ని లక్షల సంవత్సరాల క్రితం జరిగిన ప్రళయం నుండి కాపాడినట్లున్న ప్రాచీనగాథ చూసి బైబుల్ పరిశోధకులు ఆశ్చర్యపోయారు! దీనితో మొదలైంది - ఈనాటి బైబుల్‌కు నేపథ్యంగావున్న ప్రాచీన గ్రంథాల కోసం వేట! బైబుల్ పరిశోధన అనేది పాశ్చాత్య దేశాలలో అలా జన్మించింది!

## నిర్దుష్టమైన బైబుల్ : -

మార్టిన్ లూథర్ (Martin Luther) జర్మన్ బైబుల్‌ను 1737 A.D. లో ప్రచురించినప్పుడు కాథలిక్కులందరూ గొప్ప సంక్షోభంలో పడ్డారు! ఎందుకంటే ఈనాటి జర్మన్ బైబుల్ ఇంగ్లీలోని అధికారిక బైబుల్ (Authorised Version) జేమ్సురాజు అనువాదం చేయించిన దానికన్న నిర్దుష్టమైనది. ఇది అసలు బైబుల్ గ్రంథానికి దగ్గరగా ఉందని చాలామందికి తెలిసిపోయింది. ఎందుకే మార్టిన్ లూథర్ అనువాదం కోసం బైబుల్‌ను, నేరుగా హీబ్రూలోనుంచే జర్మన్‌లోకి అనువాదం చేసి రాశాడు.

మార్టిన్ లూథర్ అధికారిక హీబ్రూ బబైబుల్‌లోని 'పాత నిబంధన' (Old Testament) ల మూలప్రతిని తయారు చేసిన గెర్షాన్ బెన్ మోషే సొన్‌సినో (Gershan Ben Moshe Soncino) అనేవాడు 1494 A.D. లో ప్రచురించాడు. దీని మీద ఆధారపడి మార్టిన్ లూథర్ బైబుల్ని అనువదించాడు. ఆ తరువాత లాటిన్ భాషలోని వ్రాతప్రతుల నుంచి

నేరుగా తయారు చేసిన బైబుల్ 1000 A.D. ప్రాంతంలో ప్రచురించబడింది.

ఇది జరిగిన చాలాకాలానికి "ఖుమ్‌రాన్" (Qumran) వద్ద గుహాలలో రోము భాషలో వ్రాయబడ్డ ప్రాచీన హీబ్రూ శాసనం 'మృత సముద్రం' (Dead Sea) వద్ద 1947లో దొరికిందట. అందులో విషయాలు చూసి బైబుల్ పండితులు ఆశ్చర్యంతో త్రుళ్లిపడ్డారు. ఎందుకంటే అది 150 A.D. నుండి 70 A.D. మధ్య కాలం వరకూ గ్రీకుభాషలని అతి ప్రాచీనమైన పాతనిబంధనవ్రాతప్రతులు చూసి - "మాసోరెట్సు" అనే జపధ్యాన పరాయణులైన సాధువులచే కాపీ చేయబడ్డవని తెలింది. ఈ ఖుమ్‌రాన్‌లోని తోలు శాసనాలపై లభించిన పురాతన పాతనిబంధనలు జాగ్రత్తగా కాపీ చేయబడ్డవి. అందులోకి వాక్యాలను 5845గా లెక్కకట్టి చేర్పులు రాకుండా జాగ్రత్త పడ్డారు. అంతేకాదు! పదాలను 79856 అని లెక్కించి దాంతో సంతృప్తిపడక మాటలలో ఉన్న అక్షరాలను 4,00949 అన్ని హీబ్రూ భాషలో వ్రాయబడిన మొదటి 5 అధ్యాయాలూ 'పెంటట్యూక్' (Penta teuch) అనేవి, మోసెస్‌చే వ్రాయబడ్డవని యూదులచే భావింపబడే భాగం మూలగ్రంథమని తేలింది.

తరువాత ప్రొటెస్టెంటులు, కాథలిక్కులు వేరేవారు బైబుల్ ప్రతులను వారి వారి మతభేదాలకు అనుకూలంగా తయారు చేసుకోవడం చారిత్రక కాలంనుండీ జరిగింది. ప్రొటెస్టెంట్ల (Protestants)'డేనియల్' (Daniel) గ్రంథంలో 12 అధ్యాయాలు లభిస్తే బైబుల్‌లోని ఒక భాగం ఎక్కువ. బైబుల్లో 14 అధ్యాయాలు ఉన్నాయి. ఇతర క్రైస్తవ మతగ్రంథాలలో 7 అధ్యాయాలే ఉన్నాయి. ప్రొటెస్టెంట్ల గ్రంథంలోని బైబుల్లోంచి తీసివేయబడింది.

ఇలాగ పాత నిబంధనలోని (Old Testament) అధ్యయాలు తీసివేయడం, చేర్చటం జామ్నియా (Tanzania) లో 90 నుండి మొదలై లావోడేసియా (Laodacia) లో జంగిన బిషప్‌ల మహాసభ (Council of Laodacia) 303 AD లో జరిగే ఫలితంగా పోప్ లైబేరియస్ (Pope Liberius) అధ్యక్షతలో 'కొత్త నిబంధనల గ్రంథం' (New Testament) నాలుగు(4) పుస్తకాలుగా రూపొందించబడింది. కాని ఈనాటి చారిత్రకులకు ఆ పోప్ లైబేరియస్

చేర్పులూ, తీసివేతలూ చేయకముందు బైబుల్‌లో ఇలాంటి 80 గ్రంధాలింకా ఉన్నాయని తెలుస్తోంది.

ఇదిలా ఉండగా హీబ్రూ యూనివర్సిటీలోని పైన్సు పరిశోధకుడు 1960లో జెరుసలేములో లభించిన బైబుల్ ప్రతిలోని వ్రాత ప్రతిలో ఏసుక్రీస్తు గురించి కాని ఆయన జీవితం గురించి కానీ, లేకపోగా "ఈనాడు సువార్తలలో కనిపించే ఏ భాగము కాని ఈ ప్రాచీన హీబ్రూ బైబుల్‌లో లేనేలేవని తేలింది"! దీనితో బైబుల్ పరిశోధకుల కాళ్లక్రింద భూమి కంపించసాగింది. మాన్‌ఫ్రెడ్ బార్‌తెల్ (Manfred Barthel) వ్రాసిన గ్రంథం "బైబుల్‌లో ఏమున్నది?" "What the Bible Really says?" అన్న గ్రంథాలకు ఆధారమైన బైబుల్ పరిశోధనలో లభించిన కొత్త వెలుగు ఈ విధంగా వ్రాస్తున్నాడు.

In 1960, Professor Pires of the Hebrew Universty of Jerusalem published fragments of an early Christian text, that mentions an original Hebrew account of the size and on the teachings of Jesus, a Gospel Prototype, as it were, no trace of which has ever been discovered

ఇది ఇలా ఉండగా 1946 ప్రాంతంలో కాప్టిక్ (Coptic) లిపిలో వ్రాయబడ్డ వ్రాతప్రతి ఒకటి లభించింది. ఇది సెయింట్ థామస్ "సువార్త" యొక్క మూలప్రతి" అని వ్రాయబడి వుంది!! ఈనాటి క్రొత్త నిబంధనలలో ఇలాంటి "థామస్ సువార్త" (Gospel of Saint Thomas) అన్న భాగమే కనిపించటంలేదు! దీనిని గురించి ఉదహరిస్తూ ...

"The discovery in 1946, of an early coptic manuscript which purports to be the Gospel of Saint Thomas, one of the so called "Gnostic Gospels", has touched off a considerable amount of scholarly controversy...

"every year brings fresh evidence to light and raises fresh questions' and uncertainities that will compel us to reappraise our present ideas of what really "belongs" in the Bible .. These

are the sorts of questions, then that we should try to answer in the near future".

ఇప్పుడు లభిస్తున్న ప్రాచీన వ్రాతప్రతుల లో అతి ప్రాచీనమైనది పాపిరస్ మీద ఈజిప్టులో వ్రాసే తోలువంటి 'పార్చిమెంట్' పత్రం మీద వ్రాయబడ్డ పాత నిబంధనల మూలప్రతి! ఇది ఈజిప్టులోని ఫారో అఖినేటన్ వ్రాసిన సూర్యునికి చేయబడిన ప్రార్థన! ఇది సరిగ్గా పాసామ్‌లాంగ్ **104** దానితో సరిపోతున్నదని -

"It is easy enough to recognıze this as a Psalm, but it is not from the Old Testament. This is "Hymann to the Sun", written by the Egyptian Pharoah Akhnaten, who took the throne about 1330 BC..."

" in fact, the Old Testament equivalent of "Akhnates Hym to the Sun" can be found in Psalm 104

Manfred Barthel (p.30)

ఇలాంటి వెన్నో నూతన వ్రాతప్రతులు ఒకదానికంటే ఒకటి పురాతనమైనవి లభించిన వాటిని చూస్తూ, ఇందులో హీబ్రూ భాషలో ఉన్న "పాత నిబంధనలు" మూల ప్రతికంటే ప్రాచీనమైనవి ఈజిప్టులోని మోజెస్ కాలంలోనిదని అంతకుముందు కాపీ చేయబడినవనీ, పరిశోధకులు కనుగొన్నారు.

ఇవన్నీ చూసి విసుగెత్తిన బార్టెన్ మహాశయుడు

"The Bible was punctuated to be the 'Word·of God' and last and does not need to consult by secondary sources"

అని విసుగుతో వ్రాసిన వాక్యాలు గమనించతగ్గవి.

ఫలితంగా ఈనాటి పాత నిబంధనలను, మోసెస్ వ్రాసినదని నమ్మే మొదటి 5 గ్రంథాలూ నిజానికి మోసెస్ పుట్టి పెరిగిన ఈజిప్టుకు చెందినవనీ - అప్పటి ఫారోల మతగ్రంథాల నుండి ఎత్తి వ్రాయబడిన స్తోత్రముల ప్రార్థనలని - ప్రతీ అక్షరమూ సరిపోతున్నదనీ రూఢి అయినది వాటితో

ఇంతేగాక ప్రపంచ మతాలన్నింటిలోనూ మొట్టమొదటిసారిగా 'ఏకేశ్వర సిద్ధాంతం'కు మూలపురుషుడు అని క్రైస్తవులు భావించే మోసెస్ (Moses) కన్న కొన్ని శతాబ్దాల ప్రాచీన కాలంలోనే ఈజిప్టులోని ఫారో అఖినేటన్ ఆది పురుషుడని ఇప్పటికీ నిశ్చయంగా రూఢి అయింది.

ఈ ఫలితాలన్నిటినీ తుడిచేసి - "బైబుల్ భగవంతుని వాక్యం" (Word of God) - ఏకవాక్యంగా వున్న ఒకే గ్రంథము (Single Book) అన్న వాదన నిరాధారమని తేలింది. ఇది పురాతత్వ త్రవ్వకాలలో దొరికిన అవశేషాలవల్ల మరింత బలపడింది.

Archelogy has unearthed the Old Testments literary Predecessors, and this disapproved the idea that the Old Testament is a unique, unprecendented, and unified expression of God's Word!

పై ఇరవై శతాబ్దాల బైబుల్ చరిత్రను సమీక్షించిన తరువాత ప్రత్యక్షమైన చారిత్రక ఆధారాలవల్ల తెలిసిన విషయం ఇది.

"The Churches will have to realise that Not every word of the Bible was recessarily dictated by the Almighty"

పాత నిబంధనలలోని సృష్టిక్రమం (Genesics) లోని భగవంతుని తోటలో Eden ఆదిమ మానవుని స్వర్గంనుంచి బహిష్కరణ సరిగ్గా అస్సీరియాలోని మతంలో లభించిన క్యూనిసారం ఇటుక శాసనాల (Cuneiform Tablets) మీద వ్రాయబడ్డ భాగాలకు వికృతి అని (Assryia) అస్సీరియాలోని చారిత్రక పరిశోధకుల త్రవ్వకాలు ఈనాడు .ఋజువుచేశాయి.

"ఈనాడు క్రైస్తవ ఫాదరీలు, చర్చిలు గుర్తించాల్సిన విషయం ఏమిటంటే బైబుల్‌లో ఉన్న ప్రతీ మాటా దేవుడు స్వయంగా డిక్టేట్ చేసింది కాదని!"

బైబుల్ (Bible) అనగానే మన మనస్సుకు ఒకే గ్రంథం - భగవద్గీతలాగా వేదంలాగా - భగవంతుడు మానవునికి తన 'స్వంత మాటలతో' వ్రాసిఇచ్చిన "భగవంతుని వాక్యమే" (Word of God) అన్న అభిప్రాయం ఎన్నో దశాబ్దాలుగా సామాన్యుల మనస్సులో ప్రచారంవల్ల

పాతుకొనిపోయివుంది. మొదటిసారి అమెరికాలోని ఒక యూనివర్సిటీలో బైబుల్‌ను బోధించే ప్రొఫెసరుతో మాట్లాడుతూ -

"అసలీ బైబుల్ భగవంతుడి దగ్గర్నుండి యధాతథంగా మనిషికి ఎలా లభించింది? దేవుడు మాట్లాడినప్పుడు ఆయన ఏ భాషలో మాట్లాడాడు? దానిని గ్రంథస్థంచేసింది ఎవరు? దానిని వ్రాతలోకి ఏభాషలో ఎక్కించారు? ఇదంతా చరిత్రలో ఎంతకాలం క్రితం జరిగివుంటుంది?" అంటూ ఆసక్తితో ప్రశ్నలవర్షం కురిపించిన - నావంకే, ఆశ్చర్యంగానూ సానుభూతితోనూ చూస్తూ - ఆ అమెరికన్ 'ప్రొఫెసరు' ఇలా అన్నాడు!

"మీ మాటలుచూస్తే మీరు క్రైస్తవులు కారని తెలుస్తోంది! బైబుల్ అనబడేది 'ఒక గ్రంథ' మని మీరు అభిప్రాయపడుతున్నట్టూ తెలుస్తున్నది. బైబుల్ యొక్క ఈనాటి గ్రంథస్థ రూపం దాల్చకముందు గత చరిత్ర గురించి మీకు ఏమాత్రం పరిచయమున్నట్టు లేదు" అన్నాడు!

దానికి నేను ఆశ్చర్యపోతూ...

"మరి మీరు క్రైస్తవులు కారా? బైబుల్ అంతా ఒకే గ్రంథం అని మీవారు విశ్వసించరా? ఇక్కడి ఇంగ్లండు అమెరికాలలోని అందరూ క్రైస్తవులేకదా! మీరందరూ బైబుల్ భగవంతునిద్వారా చెప్పబడిన ఒకే గ్రంథమని మీ ప్రజల విశ్వాసం కదా!" అంటూ ఆశ్చర్యంతో ప్రశ్నలతో ముంచెత్తాను!

దానికాయన నిశ్శబ్దంగా కొన్ని క్షణాలు ఆలోచించి చివరకు సమాధానం చెప్పాడు. ఆ కొద్ది క్షణాలు నాకు అగాధంగా తోచాయి. - ఆ తరువాత ఆయన చెప్పిన, . ఆ పిడుగుపాటువంటి మాటలకు త్రుళ్లిపడ్డాను. . - "బైబుల్ ఒకే గ్రంథమని మీ పాశ్చాత్య దేశాలలో మీరు నమ్ముతారు కదా?' ' అన్న నా ప్రశ్నలకు అతడు

"ఇప్పుడు కాదు! "Not any longer!"

ఇది గతంలో మాట! ఈనాడు ఎవరూ ఈఅభిప్రాయాన్ని సీరియస్‌గా తీసుకోరు. ఇప్పుడు అన్ని 'యూనివర్సిటీలలో 'బైబుల్‌యొక్క చరిత్ర' - అధ్యయనం చేసే 'డిపార్టుమెంట్లు' ఉన్నాయి! అది ప్రత్యేక పరిశోధన చేసిన ప్రొఫెసర్లు కూడా వున్నారు. - అందుకని ఇవన్నీ మాకేమీ మీలాగ

క్రొత్తకాదు" అన్నాడు! నిర్ఘాంతపోతున్న నావీపు మీద సానుభూతితో చెయ్యివేసి! అపనమ్మకంతో ఆయన వంక చూస్తున్న నా సందేహాన్ని గుర్తించినట్లు చిరునవ్వునవ్వి -

"మీ సందేహం ఇప్పుడే తీరిపోతుంది! ఒక్కసారి అలాగే మా "యూనివర్సిటీ - లైబ్రరీ"లోకి వెళ్లిరండి! - అందులోనూ ప్రత్యేకం 'బైబుల్ పరిశోధన' (Bible Research) అల్మారాలున్న ఆవైపుకు వెళ్లి చూడండీ! - అన్నాడు. అక్కడి కెళితే "క్రిస్టియన్ విజ్ఞాన సర్వస్వం" (Encyclopedia of Christianitity) అన్న బలిసిన సంపుటాలు ఆ అల్మారాలోంచి తీసి నాకిచ్చాడు - అందులో మొదటగా నా దృష్టినాకర్షించిన వాక్యము లివి :-

" 'బైబుల్' అనేది నిజానికిఒకగ్రంథం కాదు! అది ఒక 'లైబ్రరీ'! అంటే అనేక సంపుటాలు అనేక భాషలలో, అనేకమంది, వేర్వేరు కాలాలతో వ్రాసిన "పుస్తకాల - సంకలనం!" గత శతాబ్దాలలో చాలాభాగం తీసివేయబడిన ఎన్నోభాగాలు తిరిగి అందులో చేర్చబడి దాదాపు వెయ్యేళ్ళలో ఒక ప్రింటింగ్ ప్రెస్‌వారు పుస్తకాన్ని పేజీలుపేజీలుగా బైండు చేసినట్లుగా సంకలనం చేయబడ్డది." అన్న ఆ వాక్యాలు నా కంటబడ్డాయి! దానిసారం నా మనస్సుకు పట్టడానికి కొన్ని నెలలు శ్రమపడి చదివిన 'బైబుల్ చరిత్ర' (History of The Bible) సారాన్ని ఈ అధ్యాయంలో కొంత తెలియజేస్తాను.

ఈనాటి ఇంగ్లీషు బైబుల్ జేమ్సురాజు (King James) కాలంలో అనేకమంది పండితులచేత అనువాదం చేయబడింది **1605** ప్రాంతంలో!!!

ఈ ఇంగ్లీషు బైబుల్‌కు ఆధారం గ్రీకు భాషలోది. దానికన్నా ప్రాచీనమైన మూలగ్రంథం ఒకటి హీబ్రూభాషలోని గ్రంథాలు! ఇందులో ఒక భాషలోంచి ఇంకో భాషలోకి తర్జుమా చేయడంలోనూ వేర్వేరు పండితుల అనువాదాలు రకరకాలుగా మార్పుగావుండటంవల్లా అనేకరకాల సాంప్రదాయాలు క్రైస్తవ మతంలోనే ఏర్పడి వారివారి బైబుల్‌ను ఎవరికి వారు వేరుగా తయారు చేసుకున్నారు.



# 18

# బైబుల్‌లోనుంచి - "పునర్జన్మ"ను తొలగించారా?

ప్రస్తుత బైబుల్ యొక్క గతచరిత్రను అధ్యయనం చేసిన విదేశీలైన "బైబుల్ చరిత్ర కారులు"-ఇటీవలదాకా ఒక గొప్ప అపోహలో ఉండేవారు! అదేమిటంటే 'కాన్‌స్టంటినోపుల్' బైబుల్ సభ (Coiuncil of Constentinople) **(553 A.D.)** లోనే కేథలిక్ బిషప్పులు చేసిన నిర్ణయం ప్రకారమే బైబుల్ మూలగ్రంథం నుంచి పునర్జను తొలగించడం జరిగింది అని! కాని అది సరికాదని ఇటీవల దొరికిన సాక్ష్యాధారాలు ఋజువు చేస్తున్న నగ్నసత్యం ఒకటుంది.

అదేమిటంటే 'కాన్‌స్టెంటినోపుల్ బైబుల్‌సభ' లో పునర్జన్మ సిద్ధాంతాన్ని బైబుల్ నుంచి తొలగించటానికి అసలు మూలకారకుడు - జస్టినియన్

అనే రోమన్ రాజు. అతడు తన భార్య ఒత్తిడివల్ల పునర్జన్మ లేదని-గతంలో మనిషి చేసిన కర్మలకు బాధ్యతగా మళ్ళీ తిరిగి ప్రతివారూ తమ పాపాలకు తగు శిక్షలనుభవించాల్సి వస్తుందన్న సిద్ధాంతాన్ని బైబుల్ నుంచి కొట్టించి వేస్తూ శాసనం-"Divine Order"గా ప్రకటించాడని తేలింది!

కానీ, అసలు 'బైబుల్' మూలగ్రంథంలో పునర్జన్మ యదార్థ సత్యమనీ, ప్రపంచ మతాలైన బుద్ధదేవుని జొరాస్త్రరు, కన్ఫ్యూషియస్, టిబెటన్, మతాలేగాక వేదకాలపు ఋషుల ఉపదేశాలను అనుసరించి కర్మ పునర్జన్మ యదార్థ సత్యాలని-నిర్ధారణ చేశాయనీ ప్రతిమనిషి పాపాలు గనక చేస్తే-పునర్జన్మలో తానే అవన్నీ తిరిగి అనుభవించాలని బైబుల్‌కూడా ఉపదేశించిన దైవ సూత్రమే! ఇది వింటే ఆశ్చర్యంగా లేదూ?

దీనికి చారిత్రక సాక్ష్యాధారాలు బోలెడు లభించాయి. 'బైబుల్ చరిత్రకు'లకు. అందులో మొదటి వాక్యం చూద్దాము :

"... Jesus - and after him all the early Christian Communities – took for granted the idea of many successive Lives, as expounded in the Eastern Doctrine of Rebirth."

అనగా అర్థం - "జీససూ, ఆయన తర్వాతివారైన ప్రాచీన క్రిష్టియన్లూ 'పునర్జన్మ' అనేది యదార్థం అని అంగీకరించారు, ప్రాచీన తూర్పుదేశాల సిద్ధాంతమైన "పునర్జన్మ" ఆధ్యాత్మిక సత్య-నిజానికిసత్యమని" అంటాడు జర్మన్ పరిశోధకుడు 'హోల్డర్ కెర్స్టెన్'! అంతేకాదు! ఆరవ శతాబ్దివాడైన 'ఒరిజెన్' (Origen 543 AD) ప్రత్యక్షంగా 'పునర్జన్మ' సిద్ధాంతాన్ని యదార్థమైన సత్యంగా: జీసస్ బోధనలను 'కొత్త నిబంధన' (New Testament) బైబుల్ గ్రంథంలోనే గ్రంథస్తం చేవాడు.

ఈయన 'పునర్జన్మ' సిద్ధాంతాన్ని బైబుల్ నుంచి తొలగిస్తూ తీర్మానం చేసిన "కాన్‌స్టెంట్‌నోపుల్' సభ (543 AD) కంటే ఎంతో ప్రాచీనుడు-'ఒరిజెన్ కాలం **185-250** AD నాటిది! దీన్ని జస్టినియన్ రాజు పోప్ అధికారం కూడా పొందకుండానే ఇలా ఎందుకు తొలగించాడు? దానికి కారణం అదీ 'తెరవెనుక - రాజకీయాలు' తెలిపే చారిత్రక సత్యాన్ని ఈక్రింది వాక్యాలే మనకు తెలియజేస్తాయి :-

"Up till now almost all Church Historians have believed that the doctrine of rebirth was officially dropped at the Council of Constantinople in the year 553 and thus declared heretical. In fact, however, the damning of the rebirth doctrine is traceable to a personal attack by the Emperor Justininan, which never entered the protocols of the Council. Justinian's ambitious wife, who actually held the reins of power, was (according to Procopius) the daughter of a bear-keeper, at the Byzantine amphitheatre.

She began her swift rise to power as a courtesan. In order to free herself of her shameful past, she later ordered the abuse and death of 500 of her earlier "coleagues". Because she would have had to suffer the full consequences of these cruel deeds in a subsequent life according to the "Karma Doctrine"-she set about, having the whole magnificent teaching of Rebirth simply abolished! Undoubtedly she was confident of her success in this annulment by "Divine Order"!

Emperor Justinian then proceeded to declare war on the teachings of Origen as early as 543 AD without considering the views of the Pope, and had them damned by a special Synod. In his words "De Principiis and Contra Celsu" the great Church Father, Origen (185 - 253 A.D.) had quite clearly acknowledged the prenatal existence of the soul and its dependence on earlier actions. He thought that only in the light of Reincarnation certain scriptural passages of the New Testament could be explained.

The council summoned by Justinian was attended by only Eastern (Orthodox) bishops and none from Rome, and the Pope

himself kept clear of it, although he was staying in Constantinople at that time.

The Council of Constantinople, the fifth of the Councils, was more or less a private meeting organised by Justinian, at which he (together with the vassals subject to him) imposed a ban and curse on the teaching of the pre-existence of the Soul, despite the protest of Pope Vigilius, with the publication of his Anathemata.

The official reports of eight Council sessions, which lasted for a total of four weeks, did have to be presented to the Pope for ratification. The fact's, however, is that these documents (the so called"Three Chapters") dealt only with the dispute about three scholars whom Justinian had declared heretical in an edict four years before. contained no mention of Origen. The following Popes Pelagius I (556-561), Pelagius II (579-590) and Gregory (590-604) speak of the fifth Council without mentioning the name Origen even in passing.

The church has clung to the conviction that the ban by Justinian - "Whoever teaches the fantastic pre-existence of the soul and its monstrous restoration shall be damned" - is part of the conclusions of the Council. The prohibition of the Rebirth doctrine, is therefore simply an error of history and is lacking in all ecclesiastical validity.

"If one manages to acquaint oneself (again) with the Doctrine of Reincarnation, then relinquishing the belief in the ascension of the physical body of the crucified Jesus will not lessen one's

faith in the truth of Jesus' own, unalloyed teachings, even for those brought up, as traditional Christians."

-Holger Kersten - "Jesus in India"

పైన ఉదహరించిన వాక్యాల సారాంశం బైబుల్ పరిశోధకుడు జన్మతః క్రైస్తవుడు హోల్గర్ కర్స్టన్ (Holger Kersten) కనుగొన్న అద్భుత చారిత్రక పరిశోధనా గ్రంథం ("Jesus In India) ఫలితంగా తేలిందేమంటే - బైబుల్ పునర్జన్మ సిద్ధాంతం హిందూమతం, బౌద్ధమతాలలో వలెనే యదార్థమైన సత్యంగా జీసస్ సమకాలికులు, ఆ తరువాతి ప్రాచీన క్రైస్తవులూ కూడా ధృఢంగా నమ్మేవారు! అదే విషయం బైబుల్‌లో కూడా గ్రంథస్థంగా ఉండి వున్నది! దీనిని క్రీ.శ. 185 A.D. ప్రాంతంవాడైన ఫాదర్ 'ఒరిజిన్' కూడా 'పునర్జన్మ సిద్ధాంతాన్ని' 'జీసస్ బోధనలలో వున్నట్టే ధృవపరిచాడు!

ఈ పరిస్థితి 6వ శతాబ్దం వరకూ యథాతథంగా కొనసాగింది! ఆ తరువాత రోమన్ రాజు 'జస్టినియన్' కాలంలో కాన్‌స్టెంట్‌నోపుల్ బిషప్‌ల సభలో అది తొలగించబడింది!

"దానికి అంతటికీ అసలు కారణం రాజకీయం - జస్టినియన్ భార్య పూర్వాశ్రమంలో ఒక ఉంపుడుకత్తె! అంతకు పూర్వం వేశ్యగా వుండి జస్టినియన్‌తో సంబంధం పెట్టుకొని చివరకు రాణిగా అవతరించింది! తానుపైకి వచ్చాక తన గతచరిత్ర తెలిసిన వేశ్యలందరినీ హింసించి చంపించింది! "పునర్జన్మ సిద్ధాంతం" ప్రకారం చూస్తే తానుచేసిన పాపాలకు తాను ఫలితం అనుభవించాల్సివస్తుంది గనక, అసలా సిద్ధాంతమే అబద్ధమని దాన్ని బైబుల్‌లోంచే తొలగించివేస్తే తనకు ఆత్మ శాంతిగా వుంటుంది! అంతేకాదు-మనిషి ఎన్ని పాపాలు చేసినా తప్పులేదు! పాపులను క్షమించేవాడు జీసస్‌ను నమ్మితే చాలు మనం చేసే ద్రోహాలు, పాపాలు వాటంతటి అవే మటుమాయం అవుతాయి!" అన్న తప్పుడు సిద్ధాంతాన్ని ఈనాటి క్రైస్తవమతంలో చొప్పించిన ఘనత-ఈ జస్టినియన్ వేశ్యదన్నమాట!

ఫలితంగా ఈ ఘనత పవిత్ర యోగిపుంగవుడు, 'జీసస్' ఉపదేశం-మనిషి తానుచేసిన పాపాలకు పశ్చాత్తాపం 'పునర్జన్మ' కర్మద్వారా విమోచనం చేసుకోవాలని బోధించిన జీసస్ బోధనలను పెడరెక్కలు విరిచికట్టి పూర్తిగా రూపుమార్చి.... 'ఎన్ని పాపాలు చేసినాసరే; ఆ పాపాల భైరవుడిగా ఎవరినో ఒకరిని నమ్మితే చాలు-అన్నీ మటుమాయం అవుతాయి' అన్న ఘోరమైన అశాస్త్రీయమైన, తప్పుడు సిద్ధాంతాన్ని ఈనాటి క్రైస్తవ మతంలో ప్రచారం చేశారు!

ఇది జీసస్ మహాశయునికే తీరని ద్రోహం! "(Tooth for Tooth - Eye for Eye)" అన్న బైబుల్ సూత్రానికే వ్యతిరేకం! పాపాలు చేసేవారికి పెద్ద 'లైసెన్సు!'

వీటన్నిటికీ కారణం 'కాన్‌స్టెంట్‌నోపుల్ సభ!'

అయినా అప్పటి పోప్ దీనికి అధికారికంగా ఆమోదించలేదు!! ఆ తర్వాత వారయిన పోప్ (Pope) పీఠాధిపతులు పెలాజియస్ - 1, రెండవ పోప్ పెలాజియస్ - 2 గ్రెగరీ పోప్‌లు కూడా అసలు విషయాన్ని తొక్కిపట్టి కాన్‌స్టంట్‌నోపుల్ సభచేసిన తప్పుడు నిర్ణయాన్ని శాశ్వతంగా చరిత్రలో బైబుల్‌మీద ముద్రించేశారు. దీనికి మూలకారణం జీసస్ మీద ప్రజలకు భక్తి కలగాలంటే ఆయనకు ఏదోవిధంగా అసంభవమైన మహిమలు అంటగట్టాలన్న ఆనాటి మూర్ఖ ఫాదరీల మూఢ విశ్వాసమే!

దీనివల్ల అసలైన బైబుల్‌లోని పునర్జన్మ సిద్ధాంతం అధః పాతాళానికి త్రొక్కబడింది!

జీసస్ నిజమైన బోధనలు మటుమాయం చేయబడ్డాయి! దీనంతటికీ రోమన్ కేథలిక్ బిషప్పుల గొప్ప ఛాన్స్! ఇలాటివెన్నో బైబుల్ పరిశోధన చదివితే బయటపడే పాపాల ఎముకలు!



19

# 'బైబుల్' - లో "దేవుని కుమారులు" - (SONS OF GOD) ఎందరు?

బైబుల్‌లో జీసస్ క్రీస్తును "దేవుని కుమారుడు" "Son of God" అని వ్యవహరించబడటం మనకి కనిపిస్తుంది. దీనినిబట్టి బైబులులో క్రీస్తు ఒక్కడే దేవుని కుమారుడని "ఏకక కుమారుడ"ని సామాన్యంగా అనుకుంటారు. అలా అనుకోవడానికి కారణం బైబులును సరిగ్గా, విమర్శనా దృష్టితో చదవకపోవడమే!

బయట చెప్పే ప్రచార వాక్యాలను పట్టుకొని చాలామంది ఈ అభిప్రాయానికి వస్తారు. ఒక్క బైబులులోనే, ఇలా భగవంతుని కుమారుడైన క్రీస్తు గురించి ఉన్నదనుకుంటారు! అంతే కాక, దేవుడు తన 'ఏకైక కుమారు'డైన క్రీస్తునే, ప్రపంచంలోకి పంపించాడనికూడా అనుకుంటారు. కాని ఇది నిజం కాదు! ఎందుకంటే, ప్రాచీన హిందూమతంలో "కుమారులు" అన్న పేరుగల్గిన, దైవాంశతో జన్మించిన కారణజన్ములను గురించి అనేక సార్లు వర్ణించారు! ఈ "కుమారులు" అన్న పేరు గల వ్యక్తులు ఒకరి కన్నా ఎక్కువ మందే వున్నారు.

"కుమారస్వామి" అన్న పేరుగల అవతారమూర్తి మహాదేవుడైన (The Great God) శివుని నుంచి పుట్టిన గాథే ఇందుకు నిదర్శనం! 'కుమార' అన్న సంస్కృత పదానికి "Son of God" అన్న ఇంగ్లీషు పదం ఖచ్చిత తర్జుమా వంటిదని ఈక్రింది పరిశోధనల వల్ల కూడా తేలుతోంది.

1. "కుమారస్వామి" దేవతల సైన్యానికి అధిపతిగా - 'దేవ సేనాపతి' అన్నపేరు కూడా మనకి బైబులులోనే కనపడుతుంది! ఇంగ్లీషులో వీరిని "Hosts in heaven" (స్వర్గములోని సేనలు) అనీ, ఈ 'దేవ సేనలకు' ప్రభువు అయిన పురుషుని "Lord of the Hosts" (దేవ సేనాపతి) అన్నీ వర్ణించినట్టుగా బైబులు చూస్తే తెలుస్తోంది."

2. 'ఇలా దేవుని కుమారుడు' అన్న పర్యాయపదముతో ఒక్క 'సుబ్రహ్మణ్యస్వామి' అన్నపేరుగల 'కుమారస్వామి'యే కాక ఇంకా ఇతర 'కుమారులు' కూడా ఉన్నట్లుగా-భగవద్గీతలోనూ, భాగవతంలోనూ, మహాభారతం లోనూ ఇవ్వబడిన సాక్ష్యాలలో చూడవచ్చు!

3. వీరు "ఆరుగురు కుమారుల" అని సంస్కృత మహాభారతంలో వ్యాసమహర్షి వర్ణించాడు.

**"షడ్వై కుమారాః పరివర్తయంతి" - ఆదిపర్వం :-**

(అర్థం : ఈ ఆరుగురు "కుమారులే" కాలచక్రములో ప్రవర్తిస్తుంటారు)

ఈ కుమారులే బైబుల్‌లో "దేవుని కుమారులు" అని వర్ణించిన, "దేయోనులైన" ప్రవక్తలు! ఇటువంటి వారు క్రీస్తుకు పూర్వం కూడా

కొందరు ఉండివున్నట్లు "బైబులు" గనక జాగ్రత్తగా చదివితే తెలుస్తుంది.

ఈవిషయం పురాణాలలోనూ, ఇతిహాసాలలోనూకూడా కనబడుతోంది! ఈ కుమారులు సృష్టికర్తయైన "బ్రహ్మ మానసపుత్రులు"లేక "భగవంతుని మనస్సు నుండి సృష్టి అయినవారు" అని తెలుపబడుతుంది.

పూర్వ యుగాలలో కూడా వీరు భూమికి అవతరించి, ఈ జగత్తులో భగవంతుని సందేశాన్ని మానవులకు ఉపదేశించారని వేదశాస్త్రాలు తెలుపుతున్నాయి. దీనినిబట్టి చూస్తే "దేవుని కుమారుడు" ఒక్కడే అని కాకుండా - దేవుని ఆదేశంతో ఈ ప్రపంచంలో దైవాంశతో అవతరించిన 'కారణ జన్మలు' లేక "కుమారులు అనేకమంది" గతంలోనూ వుండిఉన్నారని తెలుస్తోంది! భాగవతం, విష్ణుపురాణం, మహాభారతం వంటి గ్రంథాలలో ఈ దేవుని కుమారులు (Sons of God) అని పిలువబడేవారు ఆరుగురు కుమారులుగా పేర్కొనబడ్డారు. (పై శ్లోకం చూడండి)

వీరిలో "సనత్కుమారుడు" ముఖ్యుడు! ఈయన సృష్ట్యాదినుంచీ ఉన్నవాడు! ఆ తరువాతి కుమారుడు "కుమారస్వామి" అని పిలువబడ్డ వ్యక్తి - భగవంతుడైన శివుని కుమారుడు Son of God) అలానే సృష్టికర్తయైన బ్రహ్మ మనస్సునుండి పుట్టిన కుమారులు (Mind born sons of God) (బ్రహ్మ మానసపుత్రులు) మరీచి, భృగువు, వశిష్టుడు, నారదుడు మొదలైనవారు.

## ఇది 'బైబులు'కు వ్యతిరేకమా?

ఇలా దేవుని కుమారులు ఒక్కడు కాక అనేకమంది వుండటమనే - ఈ సిద్ధాంతము బైబులుకు వ్యతిరేకమా?' అని చాలామంది అనుమానిస్తారు! ఎందువల్లనంటే - వీరు - బైబులులో ఏసుక్రీస్తు ఒక్కడే భగవంతుని కుమారుడు అని కదా వ్రాసిఉంది" అనుకుంటారు! కాని నిజానికి అది సరియైన అభిప్రాయం కాదు! ప్రతీ వ్యక్తీ తనలో అంతర్యామిగా ఉన్న భగవంతుని దర్శించి, తన ఆత్మజ్యోతితో 'తాను' ఏకభావాన్ని పొందితే, అట్టివాడు భగవంతుని కుమారుడేమిటి? -

భగవంతుడే అవుతాడు!' అని బైబులులోనే ఉంది! ఈ మాటలు అన్నది ఎవరో కాదు! సాక్షాత్తూ దేవుని ఏకైక కుమారుడు" అనబడే ఏసుక్రీస్తు - సవ్యంగా పై 'హిందూమత సత్యాన్ని' తన మాటలలోనే స్పష్టంగా చెప్పడం బైబులులోనూ చూడవచ్చు! బైబులు "రివలేషన్" (Revelation) లేక దివ్యజ్ఞానం అన్న అధ్యాయంలో క్రీస్తు తన శిష్యులతో "మీరందరూ దేవుని సరస్వరూపాలే అన్న విషయం స్పష్టంగా రాసిలేదూ, మీ ధర్మంలో లో?" - అని ప్రశ్నించాడు. దీనికి ప్రత్యక్షంగా అతని ఈ క్రింది వాక్యాలు కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి!!

"Is it not written in your Law

I said, "**ye are Gods**" (Rev. 3.12)?

పై వాక్యాలలో భగవంతుని ఏకైక కుమారుడైన క్రీస్తు తన శిష్యులతో తానే స్వయముగా "మీరంతా దేవుళ్లు" (Gods) అని మీ ధర్మాల (Law) లోనే వ్రాసిలేదా? అనటం ఆశ్చర్యం! ఇది బైబులుకు వితండమైన విషయంలోకూడా గోచరిస్తుంది. క్రీస్తు ఏమిటి? భగవంతుని ఏకైక కుమారుడేమిటి? ఆయన శిష్యులేమిటి? వారిని - ఆయనే సాక్షాత్తూ దేవుళ్లే (Gods) మీరు అవటం ఏమిటి?

ఈ చిక్కు సమస్యలకు సరైన సమాధానం కావాలంటే మీరు హిందూ మతంలోని 'మహావాక్యాలే' పై బైబులు మాటలు-అని సరిగ్గా అర్థం చేసుకుంటేనే గాని బోధపడదు! వేదంలోని "మహావాక్యాల'కూ బైబులులోని పై మాటలకూ గల సంబంధం ఏమిటో ఇప్పుడే పరిశీలిద్దాము!

## దేవుని కుమారుడూ - దేవుడూ ఒక్కటే!

బైబులులో ఏసుక్రీస్తు చాలాసార్లు తాను దేవుని కుమారుడినన్న అర్థం వచ్చేలాగ భగవంతుని గురించి "దివిలోని నా తండ్రి" (My Father in heaven) అనడం - బైబులులోనే చాలాచోట్ల చూడవచ్చు! అంటే క్రీస్తు భగవంతుడిని, తన "తండ్రి"గా సంబోధిస్తున్నాడు! మరోచోట, తానూ

భగవంతుడూ ఒక్కటే ("I and my Father in Heaven are One" - John 10.30) అంటాడు!! ఏమిటి దీని అర్థం?

దీని అర్థం వేదశాస్త్ర వాక్యము మహాల అర్థం తెలిస్తేనే గాని బోధపడదు. "బ్రహ్మను (లేక భగవంతుని) తెలుసుకున్నవాడుకూడా స్వయంగా తానే బ్రహ్మ అవుతాడు" అని తెలిపే శృతివాక్యం:-

**"బ్రహ్మవిత్ -బ్రహ్మైన భవతి"**

ఇదే విషయాన్ని భగవద్గీతలో ...

"బ్రహ్మభూత ప్రసన్నాత్మా" అనీ.

"మద్భావా మానసా జాతా"

బ్రహ్మభావాన్ని అనుభూతిగా పొందినవారు నాతో ఐక్య భావమును పొందినవారౌతారు - అట్టివారే నాయొక్క మానసపుత్రులు" (Mind born Sons of Gods) అని స్పష్టంగా భగవద్గీతలో తెలుపుతాడు! పై వాక్యాలవల్ల తెలిసేదేమంటే భగవంతునితో అభేదత్వాన్ని పొందిన ఆరుగురు 'కుమారు' లే 'బ్రహ్మమానస పుత్రులనీ' వారు తామూ, భగవంతుడూ అభేదమని తెలిసిన దైవ స్వరూపులని! ఇదే "మీరూ దేవుళ్లే!" (Ye are Gods) అన్న బైబులులోని పైవాక్యాలతో రిగ్గా సరిపోతున్నది!

"అహం బ్రహ్మాస్మి" లేక "సో అహమస్మి" (I am That I am) అని! అనగా 'నేను' అని ప్రతివానిలోనూ స్పష్టంగా భాసించే మనలని ఆత్మయే పైనున్న ఆ భగవంతుడు" (దేవో జీవస్సనాతనః) అలానే పైనున్న 'బ్రహ్మయే నేను' - అని తెలిపే బ్రహ్మసాక్షాత్కారపు అనుభవమే పై శృతి వాక్యాలకు అర్థం! ఇదే అర్థం బైబులులోని 'పాత నిబంధనలు' (Old Testament) గ్రంథంలో కనబడుతోంది. ఏసుక్రీస్తు కంటే ఎంతో ముందుకాలం వాడైన 'మోసెస్' (Moses) ప్రవక్త 'సినాయ్' (Sinai) పర్వతం మీద భగవంతుని సాక్షాత్కారంలో స్పష్టంగా ఆయనను పేరు తెపమని కోరినపుడు భగవంతుడు స్పష్టంగా చెప్పిన మాటలలో "I am that I am"

అన్న విస్పష్టమైన వేదమంత్రాల అర్థమిచ్చేటట్లు తెలిపాడు!

దానిలో "అహం నేను (That) 'సో' దైవమే, 'అస్మి' అయి వున్నాను. లేక అని గుడ్డివాళ్లకు సహితం తెలిసేలాగ ఈ మాటలలో కనబడుతున్న సత్యం! తానే అంతరామియైన దైవస్వరూపుడు గనుక - అలా ఆత్మ సాక్షాత్కారం పొందిన క్రీస్తు శిష్యులు కూడా దేవుడే! (Ye are Gods) వేదంలో "అమృతస్య పుత్రాః" ఓ మృత్యువు లేని దైవ పుత్రులారా' అన్నవే ఇవి!

పైన చెప్పినట్లుగా బైబులులో భగవంతుడు 'మోసెస్' (Moses) ప్రవక్తకు తెలిపిన మహావాక్యాలనే తరువాత బైబులులో కొత్త నిబంధనలో (New Testament) క్రీస్తుకూడా మంత్రంలాగా ఆ మాటల్నే పలుకుతాడు.

పై బైబులు వాక్యాలను గనక, సమన్వయించి చూస్తే బైబుల్‌లోని మాటలు కూడా స్పష్టంగా - ఈ దేహమే దేవాలయమనీ అందులో వెలిగే జ్యోతియే దేవుని స్వరూపమనీ దాని సాక్షాత్కారం పొందినవాడే దేవుని నిజమైన "కుమారుడనీ" ఉపనిషత్తులలోని వాక్యాలే తెలుపుతున్నాయి! వేదంలో కూడా స్పష్టంగా ఉపదేశించబడ్డ మహావాక్యాలలో "అద్వైతసిద్ధి' 'ని స్పష్టంగా తెలిపే వాక్యాలు జగత్ప్రసిద్ధమైనవి కూడా సరిగ్గా ఇదే అర్థాన్ని ఇస్తున్నాయి.

మోసెస్ ప్రవక్తతో దేవుడు పలికినట్లుగానే, తనను బంధించడానికి రాజభటులు వచ్చినపుడు ఏసుక్రీస్తు పై వాక్యాలనే - "I am that I am" అని మూడుసార్లు గట్టిగా ఉచ్ఛరించినవెంటనే వాళ్లు `దూరంగావెళ్లి క్రిందపడిపోయారుట! అలా మూడుసార్లు జరిగిందట! అలా పడిపోయి, భయంతో వణుకుతూవుంటారు! ఈకథ బైబులులోనే మనకు కనబడుతుంది. ఇది, ఎంత నిజమైనా ఎప్పుడో తనకు పూర్వీకుడైన 'మోసెస్'కు భగవంతుడు తెలిపిన మహావాక్యాలనే క్రీస్తు కూడా 'నేనే భగవంతుణ్ణి' (సో అహమస్మి) లేక నేనే ఆయనను (అహం బ్రహ్మాస్మి) అన్న సత్యాన్ని తెలిపే బాటలో పలకటం చూస్తే భగవద్గీతలో శ్రీకృష్ణుడు

తానే శాశ్వతుడైన భగవంతుడిగా ప్రకటిస్తూ చెప్పిన ఈక్రింది గీతా వాక్యాలను అవి స్పష్టంగా పోలి ఉన్నాయి.

"అహమాత్మా గుడాకేశ! సర్వభూతాశయ స్థిత:

అంటూ అర్థం :- "ఓ అర్జునా! నేనే సర్వ భూతములందూ నివసించే ఆ పరమ్మాతను! నేనే (I am) - ఆ ఆత్మను (That I am) అని బైబుల్‌లో క్రీస్తు పలికిన వాక్యాలు భగవద్గీతలో శ్రీకృష్ణుడు పలికే హిందూ మత మూల గ్రంథమైన భగవద్గీతా వాక్యాలనే పోలివుండటం స్పష్టంగా గమనించవచ్చు. ఇంతేకాదు ఇంకా అనేక బలమైన సాక్ష్యాలు కూడా బైబులులో ఉన్నాయి.

హిందూమతంలో 'వడుగు' లేక "ఉపనయనం" చేసినపుడు బ్రహ్మచారికి గురువు ఇచ్చే ముఖ్యమైన ఆదేశాలు, దీక్షా నిబంధనలు తెలుపబడ్డాయి! అందులో మొదటిది తల్లిదండ్రులను గౌరవించుమని! అంతేకాదు తల్లిదండ్రులను దైవస్వరూపులుగా భావించి గౌరవించమని :-

"మాతృదేవోభవ! పితృదేవోభవ!" అని!

ఇదే విషయం బైబులులో 'మథ్యూ' (Mathew) అనే సువార్తగ్రంథంలో కనిపిస్తున్న ఈక్రింది వాక్యాలు చెబుతాయి.

"Revere thy Father and thy Mother"

– Matthew (19 : 19)

## మూడవ కన్ను (THIRD EYE) :-

హిందూమతంలో శివునికి మూడవ కన్ను ఉంటుందని అందరికీ తెలిసినదే! ఇది ఒక్క శివునికేకాక గణపతికీ (ఫాలనేత్రం) అమ్మవారికీ ఇంకా తదితర దేవతలకు కూడా ఈ "మూడవ కన్ను" (Third Eye) ఉన్నట్టు వర్ణించబడినది.

ఈ మూడవ కన్ను యొక్క రహస్యం యోగశాస్త్రంలోనూ గాయత్రీ మంత్రం ఉపదేశించే రహస్యాలలోనూ చూస్తే బోధపడుతుంది! 'ఈ

మూడవకన్ను (జ్ఞాననేత్రం)" అనేది ప్రతీయోగికీ సాధనలో తెరుచుకుంటుంది - అని యోగశాస్త్రం తెలుపుతుంది.

రెండు కళ్లకూ పైన బొట్టుపెట్టుకునే స్థానంలో ఈ "జ్ఞాననేత్రం' ' విచ్చుకుంటుంది! ఈ స్థానం పేరే "ఆజ్ఞాచక్రం!"

ఈ మూడవకన్ను తెరుచుకుంటే కనిపించే దృష్టి మామూలు చూపుకాదు! అది "దివ్యదృష్టి!" అందువల్ల ఈ మూడవ కన్నుకు "దివ్య చక్షువు" లేక "జ్ఞాననేంత్రం" అని పేరు. ఈ మూడవ కన్ను తెరుచుకొన్నప్పుడే "వెలుగు" కనబడుతుంది! నుదుట భ్రూమధ్యస్థానంలో ధ్యానంలో తన మూడవ కన్నుతో ఈ జ్యోతిదర్శనం చేసినవాడు - తాను కూడా పూర్తిగా జ్యోతి స్వరూపుడైపోతాడు అన్నది, అనాదిగా హిందూ మతంలోని యోగశాస్త్రం చెప్పే ముఖ్యసూత్రం ! ఇదే ఈనాటి బైబుల్‌లో కూడా "జాన్" (John) గ్రంథంలో స్పష్టంగా కనబడుతుంది.

"The light of the Body is thine Eye"

– John (10:9)

మూడోకన్ను :-

ఈ కన్ను (Eye) అంటే ఏమిటో 'లూకా' (Luke) "సువార్త" గ్రంథంలో ఈ విషయం ఇంకా స్పష్టంగా వుంది :-

"When Thine "Eye" is Single

thy whole body is full of Light"

–John (10:9)

ఇంతే కాదు! ఈ మూడవ కన్ను లేక దివ్య చక్షుస్సు మోక్షానికి (దేవుని సామ్రాజ్యానికి) ద్వారం అని, ఆ ద్వారం గుండా సాధనలో ప్రయాణించేవాడు ఇక తిరిగి" రాడు అని "జాన్ గ్రంథంలో ఇలా తెలుపబడి వుంది.

"I am the Door: by me if any man enter in, he shall be saved"

పై వాక్యంలో స్పష్టంగా మానవుడి మూడవ కన్ను దైవసాక్షాత్కారానికి ద్వారం (I am the Door) అనీ, అలా మూడవ కన్ను తెరుచుకొన్నప్పుడు యోగి శరీరం అంతా జ్యోతిర్మయం అవుతుందని (Whole body is full of Light) తెలిపే వాక్యాలు స్పష్టంగా వేదంలోని 'ఉపనయన' రహస్యంలోంచి గైకొన్నవే!!! అందాకా ఎందుకు? (మూడవ కన్ను) అన్న మాటకు సంస్కృతంలో -

<u>ఉపనయనం</u> = (ఉప + నయనం = అధిక నేత్రం)

ఈ మూడవ కన్ను తెరచుకున్నప్పుడు కాంతి శరీరం అంతా వ్యాపించినట్లుండే వెలుగు కనబడటం యోగ రహస్యం! సాధకునికి భ్రూమధ్యంలోని 'ఆజ్ఞాచక్రం' - తెరచుకొన్నపుడే ఇలా జ్యోతిని దర్శించి ఆ "జ్యోతి" ద్వారా తాను ఆ జ్యోతిలోనే ఐక్యం అయిపోతాడు.

"I am the Light! I am the Way" 'జ్యోతిరహం' - అంటే నేనే జ్యోతిని అని తెలుసుకుంటాడు! అపుడే శరీరమంతా వెలుగైపోతుంది! (The whole body is full of light)

ఈ వేద రహస్యం తెలియనివారికి బైబుల్ వ్యాలు అర్థంకావు. క్రిస్టియన్లైనా సరే!!

బైబుల్ వాక్యాలలోని నిజమైన అంతరార్థం తెలియాలంటే హిందూ మతంలోని ఆధ్యాత్మిక రహస్యాలు తెలియాలి! అప్పుడే బైబులులోని ఈ 'మహా వాక్యాల' నిజమైన అంతరార్థం బోధపడుతుంది! ఎందుకంటే బైబుల్‌లోని వాక్యాలూ, అవి తెలిపే భగవదనుభూతి పరమైన విషయాలూ, హిందూ మతంలోనివేనని జాగ్రత్తగా పరిశీలిస్తే స్పష్టంగా కనబడుతుంది!



20

# 'సువార్త'ల చారిత్రక కాలము

కొత్త నిబంధనలో దేవుని అవతారమైన జీసస్ వాక్యములని చెప్పబడే గ్రంథాలు సువార్తలు అని తెలుగులో 'న్యూ గాస్పెల్స్' అని ఇంగ్లీషులోనూ ఉదహరిస్తారుగదా వీటి కాలం చారిత్రకంగా ఏనాటిదై వుంటుంది? అన్న అంశంపై పరిశోధనలు చేసిన క్రైస్తవ పరిశోధకుల రీసెర్చిలో వెలికి తెచ్చిన పరిశోధనా ఫలితాలు గనుక, మనం గమనిస్తే చాలా ఆశ్చర్యంకలుగుతుంది!

"The Greek term for gospel is 'evangelion' which means "good and joyous tidings". The concept had existed for a long time before Christianity applied it to the message of Jesus. The Emperor Augustus for example, was called the "Saviour of the World" and his birthday was referred to as "The Day of the Evangelion".

"The New Testament contains four Gospels, which have

been named after Mark, Matthew, Luke and John. They are an arbitrary selection from among a great number of Gospels that were in use in the various communities and sets of early Christianity The rejected text were called apocryphal, and many were destroyed but some of, those that have survived shed a strange and mysterious light on the personality of Jesus.

ఇప్పుడు సువార్తలని చెప్పబడే మూలమైన రచనలు ఎప్పటివి? అని పరిశోధిస్తే

"It is still not possible to determine precisely when and how, these Gospels came into existence, because neither the original text, nor any early indication that there had ever been such a original existed."

ఐనప్పటికీ సుమారుగా చారిత్రక కాలమైనా నిర్ధారణ చేయడానికి పరిశీలించిన పరిశోధనాఫలితాలు ఈ విధంగావున్నాయి.

"Even an approximate dating cannot be ventured with any degree of certainty. The results of latest research date of the Gospel according to Mark at short before 70 A.D. The Gospel according to Mathew at shortly after 70 A.D., and the Gospel according to Luke at somewhere between 75 and 80 A.D. Other Gospels originated at about 100 A.D. And it appears that the Gospel according to John was not written until the first desdes of the Second Century.

పై పరిశోధనా ఫలితాలన్నిటినీ ఏక వాక్యంగా అనేకమంది విదేశీ ప్రొఫెసర్ల అభిప్రాయాన్ని జర్మన్ పండితుడు గుంథర్‌బోర్న్‌కామ్ (Gunthere Borkamm) వాక్యాలలో చెప్పాలంటే-

"The attempt to reconstruct original draft of the Gospel according to Saint Mark is a hopelss undertaking."

అనగా పరిశోధకులు చేసిన ప్రయత్నాలు మార్క్ సువార్త మూల గ్రంధాన్ని అన్వేషించడంలో చేసిన ఫలితాన్ని "శుష్క దండుగ"గా విస్తృతంగా

పరిణమించాయి, అంటాడు. ఎందుకంటే ఈ సువార్త లన్నింటిలో మార్క్ సువార్త నుండి తక్కిన సువార్తలు కాపీచేసినట్లు చారిత్రక సాక్ష్యాధారాల వల్ల తేలింది!

"The content of the gospels named after Mathew and Luke seems for the most part to have been the Gospel according to Mark. The Gospel according to Mark must therefore have existed before the Mathew and Luke. The canoncial Gospel named after Mark contains a few accounts however, that are not to be found in the Gospels of Mathew or Luke and here, they substitute other stories which are often inconsistent with or at least phrased very differently from, the accounts in the Gospel according to Mark. One might suspect that the two later Gospels used an earlier draft of the Gospel according to Saint Mark as a primary source.

కొత్త నిబంధనలలోని సువార్తలు సాక్షాత్తూ జీసస్ నోటి నుండే వెలువడ్డ దేవుని వాక్యము (Word of God) అని గాఢంగా నమ్మే గుడ్డి విశ్వాసం గల ఎందరికో పై యదార్థం పిడుగు పడ్డంత నిరుత్సాహాన్ని కలిగించవచ్చు! ఇది సహజమే! చాలాకాలంలో మనం నమ్మిన విషయం ఒకనాడు అకస్మాత్తుగా యదార్థంకాదని తెలిస్తే మనిషి ఎంతగా విలవిల్లాడి పోతాడో దానికి మన అనుభవమే ప్రమాణం! తల్లికి తనకున్న కొడుకు బయట దొంగతనం చేసి పట్టుబడడానికి ఎంతగా విలావిల్లాడిందో? - అలాంటిదే కళ్ల ఎదుట కనిపించే సాక్ష్యాలను, నమ్మజాలని తన నమ్మకం యదార్థ నగ్న సత్యాన్ని దిగమింగలేక తట్టుకోలేక కలిగే బాధవంటిదే! కాని ఎప్పటికైనా ఒకనాటికి మనిషి యదార్థాన్ని తెలుసుకోవడం అవసరం! అది ఎంత బాధాకరమైనా సరే! ఎందుకంటే ఇంకా గుడ్డి నమ్మకంలో కళ్లు మూసుకుని అంధకారంలో మోసపోయేకంటే యదార్థమేదో బాధగా వున్నా సరే, తెలుసుకోవడమే మంచిది!

ఈ బైబుల్ పరిశోధకుల మీద మనకి ఉద్రేకం క్రోధం కూడా రావచ్చు! రావడం సహజం - అది మనలోని యదార్థాన్ని తట్టుకోలేని బాధయేగాని, మన ఆలోచనకూ మన వివేకానికి పరీక్షవంటిది! మన ఆవేశంలో మనం ఇన్నాళ్లూ, నమ్మింది నిజంకాలేదన్న బాధతో యదార్థాన్ని

కనుగొన్న విదేశీ పరిశోధకులను ఏమాత్రం ద్వేషించరాదు! ఎన్నికలలో గ్యారంటీగా గెలుస్తాననుకున్న అభ్యర్థి ఓడిపోగానే ఓటర్లపై విరుచుకుపడ్డట్టే వుంటుంది. అందుకే పరిశోధనాదృష్టి అవసరం. దేనికైనా ఆలోచన ముఖ్యం! ఆవేశం కాదు! ఇదంతా ఎందుకు రాయాల్సి వచ్చిందంటే చాలామంది క్రైస్తవ సోదరులు చారిత్రక పరిశోధనలో వెలువడ్డ ఆశ్చర్యకరమైన విషయాలను చదివి బాధతోనూ ఆవేశంతోనూ వారి ఆస్తులు తగులబెట్టారు. గ్రంథాల్ని నాశనం చేశారు. పత్రికలకు ద్వేషిస్తూ మరికొందరు ద్వేషంతోనూ జాబులు వ్రాస్తున్నారు. ఇది మన భారతీయ క్రైస్తవులలోనే కనిపించే మతమౌఢ్యం లేక గుడ్డివిశ్వాసం ఫలితమే !

దీనికి కారణం ఈనాటి క్రైస్తవులు జన్మత: మన హిందువులే! రక్తంలోని ఉద్రేకం మతం మార్చినా మారదు! 'ఆరాధించడం' హిందూ రక్తంలో చోటు చేసుకున్నంతగా యూరోపియన్ జాతులలో లేదు. తెల్లవారిలో పరిశోధనా దృష్టి హేతువాదం, తర్కం కనిపించినంతగా గుడ్డి నమ్మకంలో పెరిగిన మన భారతీయులలో కనిపించదు ! ఇది సహజమే! ఎందుకంటే క్రైస్తవులుగా మారినా చాలామంది తమ కులాభిమానం వదులుకోలేక మేం ఫలానా కులం క్రైస్తవులం, అంటూ తేడాలు మరచి పోలేకపోవడం అనేక క్రైస్తవసోదరుల యదార్థ అనుభవం!

ఇది సహజమే కావచ్చు! కాని, వాంఛనీయం మాత్రం కాదు! యదార్థ దృష్టి పరిశోధనా వివేకము సత్యానికి వెలుగు చూపిస్తాయి! ఆవేశం, ద్వేషం, మనిషిని అంధకారంలోకి లాక్కుపోతాయి.

ఈ దృష్టితోనే మనం విదేశీయులైన క్రైస్తవులు చేసిన బైబిల్ పరిశోధనల సారాంశాన్ని గ్రహించి జీర్ణించుకోవాలి! ఇక ముందైనా మనం తేలికగా ప్రచారంకి గుడ్డిగా లోబడకుండా మన ఆలోచనను కట్టుదిట్టం చేసుకోవాలి! ఇది మనకు చరిత్ర నేర్పే గుణపాఠం!

బైబుల్ పరిశోధన కూడా ఈ నిజానికి కట్టుబడి వున్నదే!



21

# విదేశాలలో 'జీసస్' పై చారిత్రక పరిశోధన

క్రిందటి అధ్యాయంలో ఈనాటి క్రిష్టియన్ల పరిశోధనా ఫలితంగా తేలిన ముఖ్యాంశములు జీసస్ అనేవ్యక్తి జన్మించినట్టుగాని, అతడు రోమన్ గవర్నర్ పోంటియస్ పిలాతు చేత విచారించబడి శిలువ వేయబడినట్టుగాని లేదా జీసస్‌ను శిలువ వేసినపుడు పట్టపగలే చీకటి వ్యాపించిందనిగాని, పెద్ద భూకంపంవంటిది సంభవించిందనిగాని ఈతడు మరణించినట్టుగాని లేక తిరిగి లేచుటకాని మరేవిధమైన మహిమలు చేసినట్టుగాని  అసలు జీసస్ అనేవ్యక్తి ఉన్నట్టే ఎలాటి సాక్ష్యమూ లభించ లేదు అని నిరూపించే జీసస్ సమకాలికులైన వారి సాక్ష్యాలను పరిశీలించాము.

ముఖ్యంగా ఈ బైబుల్ పరిశోధకులు ఇంత నిశితంగా చేపట్టిన చారిత్రక పరిశోధనవల్ల ఒక చెంప జీసస్ ఉనికికే పెద్ద సందేహముఏర్పడింది.

మరొక చెంప సువార్తలనేవి చారిత్రకంగా శుద్ధ అసత్యాలని తేల్చడంతో దేవుని వాక్యం అనే సువార్తలకు గొప్ప పరువు నష్టం వాటిల్లింది! ఇప్పుడు సమకాలిక చారిత్రక ఆధారాలపైన అనేకమంది ప్రపంచ ప్రఖ్యాతులైన విదేశీ ప్రొఫెసర్లు తాము విడివిడిగా జీసస్‌పై చేపట్టిన చారిత్రక పరిశోధనల ఫలితంగా ఏ నిర్ణయాలకు వచ్చారో అన్న విషయాన్ని వారి మాటలలోనే పరిశీలిద్దాం!

ముందుగా చెప్పుకోతగ్గ వ్యక్తి "ప్రపంచ చరిత్ర"అనే బృహత్తర గ్రంథాన్ని అన్ని విదేశీ యూనివర్శిటీలలోనూ ప్రమాణ గ్రంథంగా భావించే చరిత్రను రాసినవాడు విల్ డ్యురాంట్-ఈ విషయంలో ఏమి రాశాడో తెలుసుకుందాం!

## విల్ డ్యురాంట్ - ప్రపంచ చరిత్ర :-

"Did Christ exist ? Is the Life Story of the founder of Christianity, the product of human sorrow, imagination and hope – a Myth ?

Early in the 18th Century the Circle of Bolingbroke shocking even Voltaire, privately discussed the possibility, that Jesus had never lived. Volney propounded the same doubt in his "Ruins of Empire" 1791. Napoleon meeting German Scholar Weeland in 1808 asked him (whether) he believed in the historicity of Christ."

ఈ మాటలకర్థం "క్రీస్తు నిజంగా వున్నాడా? క్రీస్టియానిటీ స్థాపకుని జీవితం మన ఊహలతో కల్పించబడిందా? కట్టుకథా? గత 18వ శతాబ్దం ప్రారంభంలో బోలింగ్ బ్రూక్ వర్గాలను గూడా ఆశ్చర్యపడేలాగా జీసస్ అనేవ్యక్తి బహుశా ఎప్పుడూ జీవించివుండలేదా?" అన్నాడు. వాల్నీ (Volney) అదేఅనుమానాన్ని 1791లోనే తన గ్రంథం 'సామ్రాజ్యాల పతనం' అనేదాంట్లో వ్యక్తం చేశాడు!

నెపోలియన్ చక్రవర్తి 1808లో ప్రఖ్యాత జర్మన్ పండితుడు

వైలాండ్‌ను కలిసినపుడు 'నిజంగా క్రీస్తు అనే వ్యక్తి చారిత్రక పురుషుడు' అనే గ్రంథంలో మీరు నమ్ముతున్నారా? అని అడిగి ఆశ్చర్యపరిచాడు! పై ఈ వాక్యాలు విల్‌డ్యురాంట్ తన **(1953)**లో 'ప్రపంచ-మత చరిత్ర' గ్రంథంలో రాశాడు.

ఇంకా జన్మత: క్రిష్టియన్ ఐన డ్యురాంట్ (Will Durant) బహిరంగంగానే ఇలా ప్రశ్నించాడు! "జీసస్ అనేవ్యక్తి నిజంగా వున్నాడని, నిజమైన మనిషే అని నిరూపించే సాక్ష్యం ఏమివున్నది?" (What evidence is there for Christ's existence?) అంటూ తన నిర్ణయాన్ని కొద్ది మాటలలో తేల్చివేశాడు!

అలాగే 'వెల్స్' (Wells) అనే చరిత్రకారుడు కూడా తన చరిత్ర పరిశోధనా ఫలితాల్నిలా వ్యక్తం చేశాడు -

"The few things that can allegedly be known of his life are *unedifying* and do not make him an appropriate object of worship."

అంటే నిశ్చయంగా జీసస్ జీవితంలో యదార్థమని నిర్థారణముగా తెలిసినదే కొద్ది. ఆ కొంచెమైనా సగౌరవమైన వ్యక్తిగా లేక ఆరాధనీయుడిగా పనికివచ్చే విషయాలు కావు అంటారు!

ప్రొ॥ ట్రిలింగ్ (Prof. Trilling) అనే క్రైస్తవ పరిశోధకుడు:-

"Not a single date in his life can be determined with certainty and that, it is indeed strange, that (despite) the modern scientific methods and enormous labour and ingenuity so little has been established.

(Fragen Zuz - Geschicht lichkeit Jesus, by W.Trilling Dusseldorf. 1969).

దీని అర్థం "జీసస్ జీవితంలో ఏవాక్య తేదీ కూడా నిర్ధారణగా ఋజువు కావడం లేదు! అంతేకాదు ఇన్ని సైన్సు పరికరాలు లభిస్తున్న ఆధునిక కాలంలో కూడా ఎంతో ప్రయాస పడ్డాక కూడా, ఋజువుకు నిలబడింది చాలా కొద్ది మాత్రమే" ఇవి చరిత్ర రాసిన గ్రంథకర్తల నిశ్చిత అభిప్రాయాలలో కొన్ని మాత్రమే!

ఆర్థర్ బి.మోస్ (Arthur B. Moss) "The Old and the New Faith" అన్న గ్రంథంలో!

"No person so called who was born of a Virgin or Crucified and afterwards rose from the dead and who performed the miracles recorded of him, ever lived in Bethelehem"

"ఏ ఒక్క వ్యక్తి - కన్యకకు పుట్టాడని కాని, శిలువ వేయబడ్డాడని కాని, తర్వాత చని పోయినవారి నుంచి లేచుట కాని, లేదా మహిమలు చేశాడని గ్రంథస్థం చేయబడ్డ వ్యక్తి ఎవ్వరూ బెత్‌లెహేమ్‌లో ఏనాడూ జీవించి వుండలేదు"

## జీసస్ చారిత్రకత - ఒక పెద్ద సమస్య

కాని జీసస్ గురించి నిర్ధారణగా చరిత్రలో మనకి తెలిసేది ఏమిటివుంది? అని పరిశోధించిన బ్రూస్ (Bruce) పండితుడు "దేవుని రాజ్యం" అన్న తన గ్రంథంలో ఇలా వ్రాస్తున్నాడు!

"We know very little about Jesus the man. The evangelists have daubed to the life image in the super natural colours that the natural colours can no longer be restored. The Jesus of History is simply a problem.

"జీసస్ గురించి మనకి తెలిసినది చాలా కొద్ది. ఫాదరీలు మతప్రచారకులు అతడి జీవిత చిత్రంపై రంగులు ఎంత ఎక్కువగా పులిమారంటే అవి ఎంత అసహజమైన రంగులో, నిజమైన జీసస్ జీవితం అందులోంచి నిర్ధారణ చేయడం అసాధ్యం! చరిత్రలో జీసస్ ఒక పెద్ద సమస్య! సమస్య దృఢమైన నమ్మకానికి పునాది ఎలా అవుతుంది? అంటూ తేల్చి పారేశాడు! జీసస్ వ్యక్తిగా జీవించివున్నాడని ఋజువుచేసే సమకాలిక చరిత్ర చూపించే ఆధారం ఏదీ లేదు సరికదా - అతడి సమకాలికులు కూడా అతని గురించి ఏమీ వ్రాయలేదన్న విషయం ఈనాడు మనకి అందులో క్రైస్తవ సోదరులకు అమితాశ్చర్యం కలిగించే

విషయం. ఇంతకన్నా మహాశ్చర్యం మరొకటుంది. జీసస్ అనే వ్యక్తి జీవించినట్టు చెప్పబడే కాలానికి ఎన్నో దశాబ్దాలకు ముందే క్రిస్టియన్లు అనే వారున్నట్లు అనేక సమకాలిక రచనలు లభించడం మరింత ఆశ్చర్యం!!!

ఎందుకంటే సువార్తలు జీసస్ జీవించాడని చెప్పే కాలానికంటే ముందునుంచే, చాలా ముందునుంచే క్రిస్టియన్లు లేక (క్రీస్టీను మతస్థులు) పాలస్తీనా రోమ్ అరేబియా ప్రాంతాలో జీవించివుండేవారంటే మరింత ఆశ్చర్యం కదూ! ఇంతకీ ఎవరీ క్రిస్టియన్లు? క్రిస్టియన్ మతస్థాపకుడు పుట్టకముందే ఉండివున్న ఆ క్రిస్టియన్ల మతం ఏమిటి అన్నదే ఒక గొప్ప చారిత్రక సమస్య!

ప్రాచీన యూదేయ చరిత్రను పరిశోధించిన ఆర్.ఎస్.మేడ్ (R.S. Mead) అనే పరిశోధకుడు ఫ్రాగ్మెంట్స్ ఆఫ్ ఎ ఫెయిత్ "Fragments of a forgotten faith"- By R.S. Mead అన్న తన గ్రంథంలో క్రీస్తుకు పూర్వమే క్రైస్తవులు అనే పేరుగల తెగ ఉన్నదని:-

> "We find a number of the distinctive doctrines of Gnostic Christianity but without the historic Christian and all those doctrines are seen to have existed for thousands of years previously by Egyption tradition especially the doctrines of Logos of the saviour and Virgin Mother and of the second birth and final union with God."

## జీసస్ కంటే ముందునుంచే క్రైస్తవులా?

అంటే చారిత్రక వ్యక్తిగా జీసస్ జీవించి వున్నాడని చెప్పే కాలాని కంటే వేల సంవత్సరాలకు ముందు కాలంలోనే ఈజిప్టు చరిత్రలో స్పష్టంగా ఒక 'రక్షకుడు' లేక పాపులను రక్షించువాడు, ఒక కన్యక అయిన తల్లి ఇంకా ద్విజన్మ (Second Birth) దేవునితో ఐక్యం పొందే 'మోక్షం' స్పష్టంగా చరిత్రలో ఉన్నాయి" (మరిచిపోయిన మతముల అవశేషాలు)

జి.ఆర్.ఎస్.మేడ్. (పేజీ 58).

ఇది మహా ఆశ్చర్యమైన విషయం! పోనీ ఇది ఎవరో ఒక చెదురు మదురు వ్యక్తి యొక్క అభిప్రాయమా అనడానికి కూడా వీల్లేకుండా ప్రఖ్యాత బైబుల్ పరిశోధకురాలు మేడమ్ బ్లావెట్స్కీ రచించిన సుప్రసిద్ధ పరిశోధనా గ్రంధం 'రహస్య సిద్ధాంతాలు' (Secret Doctrine-by H.P. Blavatsky) ఇంకా "ముసుగు తీసిన సత్యం" - "ఐసిస్ అన్‌వీల్డ్" (Isis Unveiled) అన్న రెండు గ్రంథాల్లో ఈ విషయాన్ని చాలా విస్తృతంగా చర్చించింది.

పై వాక్యాల వల్ల జీసస్ కంటే ముందు నుంచే క్రిష్టియన్లు అని చెప్పుకునే మతస్థులు ఉండటమే కాదు-అందులో ఒక తెగ (Cast) కు సంబంధించిన వ్యక్తి ఎస్సీనుల (Essenes) లో జీసస్ అనే వ్యక్తిని పోలినవాడు కనిపిస్తాడు - కాని ఇతడు సువార్తలకాలం కంటే కొన్ని వందల శతాబ్దాలకుముందే ప్రాచీనమైనవాడు అని!

ఇలాగ జీసస్‌కన్నా ముందు కాలాన్నుంచీ ఉండిన క్రైస్తవ శాఖలు దాదాపు 25 దాకా ఉండేవని నా పరిశోధనలో తేలింది. ఈ క్రింద అలాంటి ప్రాచీన క్రైస్తవులను పేర్కొంటున్నాను!

జీసస్‌కన్నా ముందు కాలాన్నుంచీ ఉండిన క్రైస్తవ - శాఖలవారు :-

1. Ophite Christians
2. Essenes
3. Gnostics
4. Simonians
5. Dositheuses
6. Docetians
7. Cleobiuses
8. Ebionites
9. Valentinians
10. Cainites
11. Peratics
12. Sethians
13. Basilidians
14. Marcionites

15. Menandrist's
16. Naasenes
17. Carpocrations
18. Epiphanes
19. Apelles Faith
20. Basilidian Gnosis
21. Monoimus

అనే వారిలో

22. Cerinthians
23. Nicholariten
24. Marceonits Basilidian Gnosis

చర్చి బోధనలు అబద్ధం ఫాదరీలచే కల్పితం అనే వారు 2వ శతాబ్దంలో ఉండేవారు!

ఇందులో ఆశ్చర్యం ఏమిటంటే - జీసస్‌ను గురించిన చర్చి బోధనలు 'అబద్ధం' అని నమ్మే సాధువులూ - సువార్తలు ఫాదరీలచే కల్పించబడనివి చరిత్ర విరుద్ధమైన అసత్యాలని నమ్మే క్రిష్టియన్ తెగలూ ముఖ్యంగా సెరింథయనులు (22) నికోలైటన్లు యార్సియోనైట్‌లు, బాసిలిషీయన్‌లు,నాస్టికులు క్రీస్తుశకం 2వ శతాబ్దంలో ఉండటమేకాక బైబుల్‌లోని జీసస్ చారిత్రక వ్యక్తి కాదని, శుద్ధ అసత్యప్రచారంవల్ల కల్పితమైన కట్టుకథ అని నమ్మేవారు! ఇందులో ఎస్సీనులు అనేవారు జీసస్ అనేవ్యక్తి లేడనే నాస్తికులలో ప్రధానమైన వారు!

ఇదే విషయాన్ని బీచర్ అనే బైబుల్ పరిశోధకుడు 'క్రీస్తు చరిత్ర' వాల్యూమ్ 2లో క్రీస్తు పుట్టడం గాని, అందులో కన్యకకు పుట్టడం మొదలగునవన్నియూ కల్పితములేకాని వాస్తవం కాదని వ్రాసివున్నాడు! మార్క్,జాన్ తమ సువార్తలలో ఆ విషయముల గురించి మౌనం వహించిరి! క్రీస్తు పుట్టినాడని చెప్పబడుతున్న కాలమునకు పూర్వం నుండీ యున్న నాటిక్స్ అనునొక క్రైస్తవ తెగ - క్రీస్తు ఊహాకల్పితుడు వాస్తవ పురుషుడు కాదన్న క్రైస్తవులు - అని పండిత కోట వెంకటాచలం గారి వాక్యాలలో చూడవచ్చు !

## క్రీస్తుకు పూర్వమే - జీసస్ :-

జీసస్ గురించిన ఈ గందరగోళం ఇలావుండగా 1945 సంవత్సరంలో జెరూసలేమ్‌కి దగ్గరలో కొన్ని గుహాలలో లభించిన పురాతన హీబ్రూలోని తోలుపై వ్రాసిన మతగ్రంథాలు ఈనాటి బైబుల్‌లోని సువార్తలకంటే ప్రాచీనమైన హీబ్రూ బైబుల్ (Original Hebrew Texts) మాతృకలు లభించాయి. ఇందులో రేడియో కార్బన్ పరిశోధనల వల్ల 740 B.C. - 698 B.C.

+ 270 కాలంలో ఈ గుహాలలో కొందరు సాధువులు బహుశా ఎస్సీనులనబడేవారు జీవించేవారని, వారు తమకంటే ముందు ఒక ప్రవక్త లేక రక్షకుడు, మెస్సయ (Messiah) జీవించి వుండేవాడని, ఆయన బోధనలు మక్కీకి మక్కీ కాపీ చేసిన ఆనాటి యూదుల మతగ్రంథాలని బయటపడింది!

దీనిపై గత 50 ఏళ్లుగా హీబ్రూ, ముస్లిం, యూదు రోమన్ కేథలిక్ మతస్థులు విడివిడిగా చూపెట్టిన పరిశోధనలవల్ల బైబుల్, క్రిస్టియానిటి పేకమేడలా కూలిపోయే చారిత్రక అవశేసాలను (Relics) తవ్వి వేశారు. వీటినే మృతసముద్రం వ్రాతప్రతులు (The Dead Sea Scro's) అన్న పేరుతో ప్రపంచాన్ని కదిలించి వేశాయి. ఈ పరిశోధనా సారాంశాన్ని మైకెల్ బైజెంట్ మరియు రిచర్డ్స్ లై అనే పరిశోధకులు రాసిన వాక్యాలు గమనించదగ్గవి!

In tracing the progress of the Dead Sea Scrolls...

We found overselves confronting a contradiction - the contradiction between the Jesus of History and the Christ... our investigation began in Israel ?

The conditions to which father can be summerised as follows:

(1) The Qumran texts were seen as dating from long before Christianity.

(2) The Qumran community must have been destroyed during the General rising in Judia in 66-73 A.D. leaving all their documents behind written for in nearby caves.

(3)... John the Baptist... won't really Christian trees of the world.

పై చారిత్రక ఆశ్చర్యాలు అర్థశతాబ్దంగా క్రైస్తవ, యూదు, ముస్లిం పరిశోధకులను తల్లకిందులు చేసే భూకంపంవంటి భయంకర పరిణామం!! ఇది ఈనాటి బైబుల్ ఆధారమైన దానినంతా ఒక్కసారిగా నేలమట్టం చేసింది! దీని వివరాలు కావాలంటే ఈ విషయంపై పరిశోధనా గ్రంధాలను ఈ అధ్యాయం చివర చూపిన వాటిలో లభిస్తాయి!

చివరిసారిగా ఒకేమాట తేలుతున్నది! బైబుల్‌పై పరిశోధన పరిశోధన చూసిన కొద్దీ దాని పునాదుల అడుగుల ఆశ్చర్యాలు యదార్థాన్ని పూడ్చి పెట్టిన మోసాలు క్రైస్తవ ఫాదరీల ప్రచారము, రోజురోజుకీ నోరువిప్పలేని రీతిలో బట్టబయలు కావడం ఒక మహాశ్చర్యమైతే ఈ విషయాలన్నీ పరిశోధించి కనుగొని తవ్వితీసిన చారిత్రక పరిశోధకులు సాంప్రదాయంగా క్రైస్తవులు లేదా యూదులు ఇంకా రోమన్ కేథలిక్ బిషప్పులు వారిలో చేరివుండడం ఇంకొక మహాశ్చర్యం!

అందుకే బైబుల్‌పై పరిశోధన ఈనాడు ఒక డిటెక్టివ్ నవలకంటే గొప్ప సస్పెన్సుగా తయారైంది! ఇది చివరకు ఎటు తిరుగుతుందో ?

ప్రఖ్యాత ఫ్రెంచి జ్యోతిష్కుడు భవిష్యత్తును దర్శించిన ద్రష్ట నోస్ట్రడేమస్ 1665లో రాసిన కాలాజ్ఞానంలో చెప్పినట్టు - క్రైస్తవమతం అనేది 1999తో అంతరించిపోతుందా?

రానున్న పోప్ మతాధిపతియే ఆఖరి రోమన్ కేథలిక్ మతానికి పీఠాధిపతి అంటాడు నోస్ట్రడమస్! పై పరిశోధనంతా పట్టిచూస్తే ఈ భవిష్యత్తు ఒకవేళ నిజంగా జరిగినా జరగనూవచ్చు... ఎవరు చెప్పగలరు?



# 22

# జీసస్-ఏ మతాన్ని స్థాపించలేదు! - షిరిడీ సాయిబాబా వంటి "యోగి పుంగవుడు!"

ఈనాడు చాలమంది క్రిష్టియన్ మతస్థులుకూడా తమ తమ మూల గ్రంథమైన బైబుల్ యొక్క చరిత్ర ఏమిటో చూచాయగా కూడా తెలుసుకోని వారు వేలసంఖ్యలో వుంటారంటేకూడా ఆశ్చర్యంలేదు!

కాని, ఈ విషయం-ఒక భారతీయ క్రైస్తవులకే వర్తిస్తుంది! ఎందుకంటే యూరప్‌లో, అమెరికాలో పుట్టుకతో క్రైస్తవులైన విదేశీయులందరికీ- ఈ బైబుల్ యొక్క పూర్తి చరిత్ర తెలుసును! అట్టి ఘోర అజ్ఞానాంధకారంలో వున్నవారు మన దేశీయులే, అన్నది తెల్లవారితో పోలిస్తే, మన నల్లజాతివారిని ఎంత మానసిక బానిసత్వంతో వుంచారో అవగతమౌతుంది.

ఈ వాక్యానికి అర్థం తెలియాలంటే కొంచెమైనా 'బైబుల్ చరిత్ర' 'క్రైస్తవమత చరిత్ర' తెలియాలి! అదేమిటో ఇక్కడ, 'బైబుల్ గత చరిత్ర' లో గమనిద్దాం!

## బైబుల్-చరిత్ర:-

ఈనాడు బైబుల్ ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ, దేవుని సొంతవాక్యమని గుడ్డిగానమ్మి చదివే, ఈ 'బైబుల్' గ్రంథంయొక్క పూర్వచరిత్ర 140 AD నుంచే మనకు లభిస్తున్నది. ఈనాటి బైబుల్ ఇంగ్లీషులోకి గ్రీకు భాషనుంచి అనువాదం చెయ్యబడ్డది. ఇది కొత్త నిబంధనలు లేక క్రీస్తుకాలానికి సంబంధించి వ్రాయబడ్డ బైబుల్ విషయం! ఇక పాతనిబంధనలు బైబుల్ హీబ్రూ భాషనుంచి అరమిక్ (Aramic) భాషనుంచీ అనువదించబడ్డాయి. గత 1500 సంవత్సరాల పరిశోధన యూరప్‌లో చేపట్టిన ఫలితంగా ఈ క్రింది అంశాలు ముఖ్యమైనవని తెలుస్తున్నాయి!

## క్రీస్తుశకం ప్రారంభం - ఎప్పట్నుంచీ ?

1. క్రీస్తుశకం మొదలుపెట్టిన తేదీ జనవరి 1. 194 వ ఒలింపియాడ్ యొక్క 4 వ సంత్సరంలో ప్రారంభమైంది !
2. ఇదే రోమ్ కట్టిన 750 వ సంవత్సరం, జూలియస్ శకం 4714 సంవత్సరం దీనితో సరిపోతాయి!
3. ఈ "క్రీస్తుశకం" ప్రారంభించినవాడు 'డయోనీసియస్-ఎగ్జిగస్' (Dionysius Exigus) అనే క్రైస్తవసన్యాసి. క్రీస్తు తరువాత 532 A.D సంవత్సరంలో స్థాపించాడు!

   అంటే దీని అర్థం క్రీస్తు మరణించినట్లు చెప్పబడే 532 సంవత్సరముల తరువాతే ఈ 'క్రీస్తు శకాన్ని' డయోనీసియస్ అనే క్రీస్తు సన్యాసి స్థాపించాడు!
4. కానీ ఈ 'క్రీస్తు శకాన్ని' చాలాకాలం వరకూ ఎవరూ అంగీకరించలేదు! ఎక్కడా వ్యాప్తి చెందనూ లేదు.
5. దీన్ని మొట్ట మొదటిసారిగా గుడ్డిగా అమలు చేసినవాడు జర్మనీ రాజైన మూడవ ఛార్లెస్. అదీ 879 A.D లోనే జరిగింది.

6. ఈ 'క్రీస్తుశకం' అందరూ అమలు చెయ్యాలని నిర్ణయించినది బిషప్, మహాసభ 'చల్సా' (Chelasa) లో 816 A.Dలో రిజల్యూషన్‌గా పాస్ చేసి - క్రీస్తు జన్మించింది, 4 A.D అని ఏకపక్షంగా నిర్ణయించాడు.
7. అంటే, ఈ నిర్ణయంలోని 'అసంగతం' క్రీస్తు మరణించిం తరువాత 4-వ సంవత్సరంలోనో లేక 4A.D లోనే క్రీస్తు జన్మించాడుట.
దీనిని ఈ క్రిందివాక్యమే రుజువులతో తెలుపుతోంది.

"The year of our Lord or grace, of the incarnaton, of the circumscision, and of the crucifixion, the Christian Era commenced 1 January in the middle of the 4th year of, the 19th Olympiad and 753rd year of the building of Rome and in 4714 of the Julian, period.

The Era was invented by a monk Dionysius Exigus, about 532 A.D..It was introduced in the 6th century and ordered to be used by Bishops by the council of Chelsa in 816, but was not generally employed for several centuries.

Charles II, of Germany was the first who added "in the year of our lord." to his reign 879 A.D.

It was held that Christ was probably born in the year 4 or 5 A.D. (-Anno Domini.)

అంటే దీని అర్థం :-

'ఎన్నొడామిని" (A.D.) 'మన ప్రభుత్వము యొక్క సంవత్సరము' అనగా మన ప్రభువు యొక్క అవతారమున్నో పరిశుద్ధమైన "సుంతీ" కర్మచేయబడుట, శిలువ వేయబడుట, తటస్థమైన కాలము 'క్రీస్తుశకము.' 1వ జనవరి 194వ ఒలింపియడు యొక్క నాలుగవ సంవత్సరములో ప్రారంభమైనది. మరియు రోముకట్టబడిన 753 సంవత్సరమున్నూ, జూలియస్ శకము 4714. "సంవత్సరమున్నూఐ వున్నది. ఈ శకము 532 A.D. సం.లో "డయోనీసియస్ ఎగ్జిగస్" అను రోము సన్యాసి వలన కల్పించబడినది. ఆరవ శతాబ్దములో ఇటలీలో వాడుటకు ప్రవేశ పెట్టబడినది.

మత. గురుపులవలన వాడబడుటకు చాల్సియా సంఘము వారి వలన 816వ సంవత్సరములో రిజల్యూషన్ (Resolution) చేయబడినది. గాని, పిమ్మట ఇది అనేక శతాబ్దముల వరకూ వాడబడి యుండలేదు. జర్మనీరాజైన మూడవ ఛార్లెసు తన పరిపాలనలో మన ప్రభువుయొక్క 879 A.D అని మొదటి సారిగా ప్రారంభింపడినది. క్రీస్తు జననము ఈ శకములో 4 లేక బహుశః 5వ సంవత్సరముగా ఉండియుండవచ్చునని ఊహించి నిర్ణయింపబడినది." అని!

## ఇది బిషప్‌ల - క్రిస్టియానిటీ !-

కాబట్టి చారిత్రకంగా క్రైస్తవమతం ఒక మతంగా పనిచెయ్యడం మొదలు పెట్టింది. ఈ శకాన్ని అధికారికంగా అమలులోకి తెచ్చిన 879 A.D లోని **బిషప్‌ల మహాసభతోనే!** ఇది చరిత్రలో మనకి కనిపించే అక్షర సత్యం!!!

ఈ విషయం మన క్రైస్తవులలో నిజంగా ఎందరికి తెలుసు? క్రీస్తు అనే వ్యక్తి మరణించనట్టు, చెప్పబడే *879 సంవత్సరాలకుగాని ఇదొక మతంగా రూపు చెందలేదని,* క్రీస్తు *శకంగా* అమలు జరిగింది కూడా 8వ శతాబ్దంనుంచే అని - అంతకు ముందునుంచీ ఈ క్రీస్తు మతం ఎందుకని అమలులో లేదు?

ఇదే చరిత్రకు అంతుబట్టని ప్రశ్న!

## జీసస్‌కు మందే "క్రిస్టియన్" మతం?

జీసస్ - క్రీస్తు పుట్టక ముందే - వెయ్యేళ్లకు ముందే 'క్రిస్టియనులు' అనేవారు రోమ్ పాలించే నగరాల్లో వున్నారని చరిత్ర తెలిపే సాక్షానికి ఆధారం యొక్క అర్ధం ఏమిటో? ఇప్పటికైనా క్రైస్తవమత చరిత్రను పరిశోధించదలచుకున్న ప్రతీ క్రైస్తవభక్తుడూ సత్యాన్ని కనుగొనాలంటే చరిత్రను తవ్వి పరిశోధించి, పై ప్రశ్నలకు సమాధానం రాబట్టుకోవాలి! అంతవరకూ గుడ్డిగా జీవిస్తున్నట్టే!

## జీసస్- ఏ మతాన్నీ స్థాపించలేదు!

జీసస్ తాను బ్రతికివుండగా ఏ క్రొత్త మతమూ స్థాపించలేదు. అనీ,

ఆయన ఒక యోగిపుంగవుడూ, అనేకులకు తన యోగ సిద్ధులతో రోగాలు తగ్గించి, దృష్టి నిచ్చి, దైవ చింతనను వారికి బోధించాడనీ ఆయన ఈ నాటి సాధుసత్పురుషులలో శ్రీ షిరిడీ సాయిబాబాలాంటి - మతానికతీతమైన విశ్వమానవ ప్రేమను ఆచరించే ఆధ్యాత్మిక పురుషుడిగానే చరిత్ర తెలుపుతోంది!

ఈనాటి మతద్వేషానికి రగిల్చే ఏ మతాలనూ స్థాపించలేదని, ఈనాటి క్రిష్టియన్ ప్రచారకులు మతంతో వ్యాపారం చేసే బిషప్పుల మతం, అనీ, జీసస్-స్థాపించలేదని?

ఆయన యూదులలో జన్మించిన యోగిగా 'ఎస్సీను' (Essene) గానే మరణించాడనీ, ఆయన సమాధి కాశ్మీరులోనే వుందనీ, నేటికీ దానివి మనం చూడవచ్చుననీ; ఆయన బోధించినది 'సర్వ మానవాళినీ ప్రేమించు' అన్న అహింసాజ్యోతి బుద్ధదేవుని వంటి ధర్మాన్ని అనీ దీనికి ప్రచారంతో ద్వేషాన్నీ, యుద్ధాలనూ చిత్రహింసలనూ సజీవదహనాలతో మతంమార్పిడి వంటి అత్యాచారాలు 18వందల ఏళ్ళు నడిపి 'పోప్' (Pope) లులోకాన్ని దండుకున్న - 'శిలువ మతం' (Corsstianity) లేక క్రీష్టియానిటీ కాదనీ చరిత్రను పరిశోధిస్తే ఈనాటికీ ప్రత్యక్షంగా ఘంటాపథంగా ఋజువు చేస్తున్న సాక్ష్యాలే చాటి చెబుతున్నాయి.

జీసస్-బోధనలు ఆయన 'సమాధి' అడుగున 'కాశ్మీర్'లోనే సమాధి ఐనాయి! అసలు జీసస్ యొక్క నిజమైన జీవితాన్ని అణచిపెట్టి ఆయన సమాధి కాశ్మీరులో వున్న విషయం కూడా క్రైస్తవులకి సయితం తెలియకుండా అణచివేయడమేకాక మత్వ్యాపారులుగా బిషప్పులు వెయ్యేళ్ళు పైబడి - 'దేవునివాక్యం' (Word of God) 'బైబుల్' అన్న భయంకూడా లేకుండా ఇష్టంవచ్చినట్టు మార్పులూ చేర్పులూ చేస్తూ వందల ఏళ్ళుగా కాలేజీ సిలబస్‌లా బైబుల్‌లోని గ్రంధాలను సువార్తలనూ మార్చి ఇష్టారాజ్యంగా ఏలుతున్న భిషప్పుల మతానికీ జీసస్ బోధించిన అహింసామతానికీ పూర్తి వ్యతిరేకమనీ చరిత్రలో 'జోన్ - ఆఫ్ - ఆర్క్' ('Joan - of Arc') వంటి నిజమైన క్రైస్తవులను కాల్చి చంపి, తరువాత వారినే 'సెయింట్సు' (Saints)

గా ప్రకటించిన ప్రచారమతం ఒక రాజకీయ వ్యాపారం అని చరిత్రయే చాటి చెబుతోందని, - ఏనాటికైనా నిజమైన క్రీస్తు బోధనలను, జీసస్- జీవిత హిమాలయ పర్వతాలలో రహస్యంగా తాటియాకుల గ్రంథాలలో నిక్షేపించబడివున్న 'యోగీ ఈశా రహస్య చరిత్ర' (Secret life of Yogi Isa) ను ఏనాటికైనా వెలికి తీసి ప్రపంచాన్ని వెలుగులోకి రానివ్వాలని ప్రతీక్రైస్తవుడే కాదు ప్రతి ఒక్క మానవతా వాదీ కాదనలేని మనందరి పవిత్రమైన డ్యూటీ!

నిజం - తెలుసుకోకుండా, నిజమైన బైబుల్ యొక్క చరిత్రను పరిశోధించకుండా ఇన్ని రహస్య విషయాలు వెలుగులోకి ఎలా వస్తాయి?

ఇంత శ్రమ ఎందుకూ అంటే - నిజమైన క్రైస్తవులకైనా - జీసస్ యదార్ధ బోధనలనే అనుసరిస్తే ముక్తి కలుగుతుందా ? లేక బిషప్పుల ప్రచారమతాన్ని వ్యాపార సంస్థగా జీసస్‌ను అణచి క్రాస్‌ను పూజించే క్రీస్టియానిటీ యొక్క రాజకీయ ఎన్నికల వాగ్దానాల వంటి ప్రచారం మాటలు ఆచరిస్తే తరిస్తామా?

జీసస్ మహాత్ముడు! ఆయన దైవశక్తులు గల యోగి అన్న విషయం గనక మనం విశ్వసిస్తే-బిషప్పుల మార్పులూ చేర్పులూ, 'సువార్త'ల నుంచి తీసివేతలూ-యిన్నేళ్ళుగా ఎందుకు చేయవలసి వచ్చింది? యూరప్‌లోని రాజకీయాలలో పోప్‌ల యుద్ధాలు దండయాత్రలు ధనదాహం, హింస రాజకీయమైన పనిముట్టుగా చెలాయించిన మతంతో - జీసస్ బోధనలకు ఎట్టి సంబంధమూ లేదు అని తెలియటానికి పోప్‌ల చరిత్రను 'జీసస్ రహస్య జీవితం'తో పరిపోల్చితే చాలు! రెండింటికీ తేడా తెలుస్తుంది.

ఏనాటికైనా నిజందాగదు-అనుకోకుండా లభించిన ఖుమ్రాన్ వ్రాత ప్రతులు కనుగొనడంతో పురాతన హీబ్రూ (Hebrew) భాషలోని మూల ప్రతి (original, manuscript) బైబుల్ 'యదార్ధ పాఠాలు' లభ్యమైనాయి 1947లోనే!

కానీ 45 సంవత్సరాలపాటు వీటిలో ఏమివున్నదో పైకిరాకుండా తొక్కిపట్టిన చర్చి బిషప్పుల కుతంత్రాలను బైట పెట్టే పరిశోధనాగ్రంథం.

'The Dead Sea Scrolls - a Deception' చదివితే ఎలాంటి క్రైస్తవుడికైనా కనువిప్పు కలుగుతుంది!

బిషప్పులు కల్పనలతో మార్చిన ఈనాటి సువార్తల (Gospels) కూ, అసలైన హీబ్రూ భాషలోని బైబుల్ మూలప్రతులలోని యదార్ధ చరిత్రకూ పోలికే లేదు!

ఇవి వివరంగా ఇంకో అధ్యాయంలో పరిశీలిస్తే మనకే ఆశ్చర్యం వేస్తుంది, జీసస్ యదార్ధ జీవితం గురించి మనకి ఎంత మాత్రమూ తెలియదు అని!

నిజమైన బైబుల్ చరిత్రకై **'యోగి-ఈశా రహస్యజీవితం'** గురించి అన్వేషిద్దాం!

సంస్కృత పురాణాలలో జీసస్ గురించిన అంశాలు, "ఖుమ్రాన్‌లో లభించిన బైబుల్ వ్రాత ప్రతులతో" కలిపి పరిశీలిస్తే లభించే యదార్ధం ఏమిటో-అన్వేషిద్దాం! దర్జాగా తెల్లదొరలు ఏ మందు నూరిపోస్తే అదే నల్లముందుగా మింగే బానిసజాతులైన నీగ్రోలు, ఆఫ్రికన్‌లుతో పాటు మన నల్లభారతీయులు కూడా మింగాలా?

## క్రీస్తు - తెల్లవాడు కాదు! మనవాడు!

ఇంకొక సత్యం క్రీస్తు విదేశీయుడు కాదు! ఆయన యూరోపియన్ కాడు ! అంటే తెల్లజాతివాడు కానేకాడు ! **ఈయన ఆసియా జాతీయుడు!** అసలే నల్లని జుట్టు నల్లనికళ్ళు చామనఛాయతో వుండే **ఆసియా జాతివాడే!** ఇది ఎందరు భారతీయులకు తెలుసు? క్రీస్తు జీవితంలో ఎన్నో అణచివేసి తెల్లజాతులవారి స్వార్ధ రాజకీయకుట్రల కోసం చరిత్రను తారుమారు చేసి క్రీస్తుమహాశయుని నిజమైన ఆధ్యాత్మిక బోధనను. భక్తులైన భారతీయ క్రైస్తవులకు అందకుండా చెయ్యడం ఘోరమైన అన్యాయం!

దీనికి భారతీయులమైన మనం సగర్వంగా పరిశోధనచేసి ధైర్యంగా క్రీస్తుమహాశయుని నిజమైన జీవితం, ఆయన యొక్క బోధనలూ పరిశోధన చేసి ధైర్యంగా వెలికి తీయాలి!

క్రీస్తు యదార్ధ బోధనలు అణిచి పెట్టిన రోమన్ కేథలిక్ చర్చిపూజారుల, ఫాదరీలను మతాధిపత్యం నుంచి క్రైస్తవ చరిత్ర యదార్ధమైన స్వరూపాన్ని మనం వెలికితీయాలి! ఇది ప్రతీఒక్క క్రైస్తవుడి పవిత్రధర్మం ! ఈ వాక్యం ఎందుకింత దృఢంగా రాయవలసివస్తుందో ఈక్రింది అంశాలను చూస్తే మీకే తెలుస్తుంది!

1. క్రీస్తు మహాశయుడు భారతదేశం వచ్చాడన్న విషయం 1900 సంవత్సరముల కాలం మన భారతీయులకు తెలియకుండా ఈ శ్వేతజాతి క్రైస్తవులు, బిషప్‌లు, ఆర్చిబిషప్‌లు ఎందుకిలా అణచివేస్తున్నారు?

2. క్రీస్తు భారతదేశం వచ్చాడంటే ప్రతిభారతీయుడికీ గర్వకారణం కాదా? ఈ విషయం చారిత్రకంగా ఋజువు చేయబడిన చారిత్రక సత్యాలను కొన్ని రానున్న అధ్యాయాలలో మీముందు పెట్టాను? దీనిని పరిశోధించడం, తెలుసుకోటమూ అందరి క్రైస్తవుల కనీసధర్మం!

3. అలానే క్రీస్తు మహాశయుని 'సమాధి' - కాశ్మీరులో వుందని ఎందరు క్రైస్తవులకు తెలుసు?

ఇలా తెలియకుండా అణచిపెట్టిన బ్రిటిష్ ప్రభుత్వ రాజకీయ విద్రోహామే - బుద్ధి పూర్వకంగా చెయ్యబడిన మోసం అని - అనాటి బ్రిటిష్ ప్రభుత్వ రెసిడెంట్‌గా పనిచేసిన 'సర్ చార్లెస్ యంగ్ హజ్బెండ్' (Sir Charles Young hunsband) వ్రాసిన ప్రత్యక్షవాక్యాలే క్రీస్తుసమాధిని కాశ్మీరులో ఆయన చూశాడన్న సత్యాన్ని - చూసి బ్రిటిష్‌వారు దాచి పెట్టారన్న మహాసత్యాన్ని ఎంతటి గుడ్డివారికైనా కనువిప్పు కలిగిస్తాయి! ఈ క్రిందివాక్యాలు చూస్తే!

> "There resided in Kashmir some 1900 years ago a Saint of the name of yus Asaf, who preached in parables as Christ used as per instance, the parable of the sower. His Tomb is in Srinagar and theory of the founder of the Wadiani Sect is that "Yus Asaf" and Jesus are one and the same person".
>
> – Sir Francis Youghusband
>
> British Govt. Resident in Kashmir (1909-11)

క్రీస్తు సమాధి గురించి ఇప్పటివరకూ చూసిన సాక్ష్యమే కాక ఇంకా బోలెడు పరిశోధనా రహస్యాలు వేరే అధ్యాయంలో ఇచ్చాను! ఇక్కడ ఇంతకంటే ఆశ్చర్యకరమైన మరో వింత చరిత్ర మనకి పరిశోధనతో తవ్వి మనముందు పెట్టింది. అదేమిటి? అది :-

## మేరీ మాత సమాధి !

ఈనాటి బైబిల్‌లో ఎక్కడా - క్రీస్తు ఎక్కడ మరణించాడో? ఆయన శరీరం ఎక్కడ సమాధి చెయ్యబడిందో తెలిపే చారిత్రక రహస్యాలన్నీ శ్వేత జాతీయులైన రోమన్ కేథలిక్, బిషప్‌లు బైబుల్ నుండి తొలగించారు. ఇలా చాలా విషయాలు బైబుల్ నుండి తొలగించారు!!! అవేమిటో ఈక్రింద వివరిస్తున్నాను. కాని, అన్నిటికంటే ఘోరమైన విషయం మేరీమాత సమాధి కాశ్మీరులో వుందని తెలియనిస్తే వీళ్లకేం కష్టం? వీరికి ఏం పాపం చుట్టుకొంటుంది? కనీసం ప్రతీక్రైస్తవ భక్తుడూవెళ్ళి జీవితంలో ఒక్కసారైనా ఆ మాతృమూర్తి సమాధిని దర్శించి ఆనందపడగలడు కదా! ముసల్మానులు అంతా మక్కాయాత్ర చేసినట్టే ప్రతీ భారతీయ క్రైస్తవుడు జీవితంలో తప్పక చేయ్యాల్సిన ఒక పవిత్రమైన "హాజియాత్ర" వంటిదిగా "యాత్ర" చేసుకొని కాశ్మీరులో వున్న మేరీమాతవ సమాధిని, క్రీస్తు మహాశయుని సమాధిని దర్శించుకుంటారు గదా అని, నేను మీకు, నాకు యాదృచ్ఛికంగా లభించిన ఆ సమాధి యదార్ధ ఫొటోను ఈ



జీసస్ తల్లి 'మేరీ' మాత సమాధి

గ్రంథంలోనే ప్రచురిస్తున్నాను! దీన్ని కనుగొన్న వారు కూడా - తెల్లదొరలే! కాని, తెల్లజాతి బిషప్‌లు మాత్రంకాదు!

## మోసెస్ - 'సమాధి', 'మూసా' మంత్రదండం:-

ఇదే విధంగా బైబుల్‌లోని మోసెస్ ప్రవక్త సమాధికూడా ఇటీవలనే హిమాలయాలలో కనుగొనబడింది!



'జీసస్' మంత్రదండం

అబ్రహాం మోసెస్‌వంటి పాతనిబంధనల మతగురువుల యదార్థ చరిత్రను తారుమారు చేసిన విషయం ఈనాటి వారి సమాధులఫోటోలే ఋజువుచేస్తున్నాయి! దీని వివరాలు విడిగా ఒక అధ్యాయంలో రాసుకుందాం!

ఈ విషయాలు తెలిస్తే రోమ్‌లోని చర్చ్‌ల రాబడి మహత్యం పోతుందని ఈ గొప్ప పవిత్రరహస్యాలను అణచి వెయ్యడానికి కారణం పరిశోధిస్తే మనకి ఏక్రిస్టియనుకైనా సరే కనిపిస్తాయి! అసలు క్రీస్తుకు, మేరీ మాతకూ లేని ప్రాముఖ్యత ఈ క్రైస్తవమత బిషప్‌లకు సుఖంగా జీవించే ఫాదరీలకూ వుండాలా? ఇదేనా నిజమైన క్రైస్తవమతం? క్రైస్తువుడు ఆలోచించవలసిన ఘోరమైన (Historical Truth!) చారిత్రక సత్యం!



23

# నూరేళ్ళ బైబుల్ పరిశోధన రోమన్ చరిత్రతో విదేశీయుల కనుగొన్న-ఆశ్చర్యాలు!!

ఇంతదాకా ప్రపంచవ్యాప్తంగా బైబుల్ పరిశోధకులు గత 150 సంవత్సరాలుగా చేసిన పరిశోధనా రహస్యాలను కొన్ని గమనించాము. అందులో "జీసస్ చారిత్రక వ్యక్తియా?" - అన్న విషయంపై ఈనాడు విదేశీ యూనివర్శిటీల పరిశోధనలలో నెలకొన్న నిర్ణయాలను ఇక్కడ సంగ్రహంగా అంచానవేసి వారేమి తేలోచరో "సువార్త"లు ఎన్ని? ఏనాటివి? జీసస్ తర్వాత ఎన్ని శతాబ్దాల తర్వాత రాయబడ్డవి? బేరీజు వేద్దాం;

## సువార్తల చారిత్రక కాలము

హిమాలయాల మంచుశిఖరాలపై బౌద్ధఆశ్రమంలో అనుకోకుండా

లభించిన పురాతన తాళపత్రగ్రంథం "యోగి ఈశా- జీవితచరిత్ర" అలెగ్జాండర్ నోటోవిచ్ అన్న రష్యన్ రాయబారికి లభించడంతో క్రైస్తవ ప్రపంచంలో ఒక బాంబు పుట్టినట్లైంది.

ఈ గ్రంథంలో శతాబ్దాల తరబడి బౌద్ధులు పవిత్రంగా పూజిస్తున్న యోగుల చరిత్రలో లభించిన "జీసస్ చరిత్ర"- ఎన్నో ఆశ్చర్యకరమైన విషయాలు బైబుల్‌ని 'సువార్త'లలో ఎక్కడా సమాధానం దొరకని ప్రశ్నలపై సమగ్రమైన వివరాలతో లభించిన చారిత్రక ఆధారాలు- జీసస్ హిమాలయాలకు వచ్చాడని భారతదేశం దర్శించాడనీ, సందేహానికి తావులేకుండా ఒక నికరమైన చారిత్రమైన సాక్ష్యాధారం లభించింది! ఇది మొదటి మెట్టు!

ఇది నిజమా? యదార్థమేనా? అన్న సందేహాలకు సమాధానంవలే "సువార్తలలో కనిపించిన 'జీసస్ - జీవిత రహస్యాలు' జీసస్ 13వ ఏడు నుంచీ అతడి 30వ సంవత్సరం దాకా ఉన్న ఖాళీ (gap) లేక "గండి' 'కి ఈ ప్రాచీన తాళపత్ర గ్రంథం ఇవ్వలేని సరైన సమాధానాలను ఇవ్వడంతో దీని చారిత్రకత మరింత ధృవపడింది!

ఈ గ్రంథాన్ని ప్రచురించవద్దని 'రోమన్-కేథలిక్' పీఠమైన 'పోప్' (pope) కాథలిక్ చర్చి నుండి నోటోవిచ్‌పై విపరీతమైన వొత్తిడి తేవడమూ, అతడికి డబ్బు ఆశ కూడా చూపి దాని ప్రచురణను విరమించమనే ప్రయత్నాలు చేయడంవల్ల ఇంకో విషయం కూడా వెల్లడైంది! అదేమిటంటే రోమన్ కేథలిక్ పీఠాధిపతులే తమ 'కల్పనలు' బయట పడతాయని జీసస్ యదార్థ జీవితాన్ని పైకి రాకుండా అణగదొక్కే ప్రయత్నం చెయ్యటం వల్ల అది 'తాళపత్ర గ్రంథం' యదార్థమని మరింత గట్టిగా బలపడింది!

## జీసస్ సమాధి

ఇకపోతే కాశ్మీరులోని శ్రీనగర్‌లో లభించిన 'జీసస్ సమాధి' (Tomb of Jesus) మరొక్క టైంబాంబు!

జీసస్ గనక భారతదేశం వచ్చివుండకపోతే ఆయన 'సమాధి'

శ్రీనగర్‌లో ఎందుకు వుంటుంది? అంతేకాదు అసలు ఈసమాధి ఉన్నట్టే క్రైస్తవ భక్తులకైనా తెలపకుండా తెల్లదొరలు బ్రిటిష్ ప్రభుత్వం రోమన్ కేథలిక్కు బిషప్పుల కూటమి కుట్రతో కావాలనే దీన్ని అణచివేశారని నిర్ధారణంగా తేలింది. దీనికి కారణం 'జీసస్-సమాధి' - భారతదేశంలోనే వున్నదనే వార్త ప్రపంచమంతా దావాగ్నిలా వ్యాప్తిస్తుంది. మరుక్షణంలోనే వేలాది, లక్షల మంది క్రైస్తవ భక్తులు దీనిని పవిత్ర యాత్రాస్థలంగా భావించి ముస్లింలు మక్కాయాత్ర చేసినట్టుగా భారతదేశంకే జనప్రవాహం తరలిపోతుంది. ఇక "పోప్" (Pope) నుగాని, ఆయన అనుచర గణమైన 'బిషప్పుల'ను గాని వారి మొహం చూసేదెవరు? వారి కోట్ల డాలర్ల ఆదాయం 200 మిలియన్ కోట్ల డాలర్ల నిధి 'వాటికన్'లో పడిపోవడం ఖాయం.

అంతేకాదు కాశ్మీరులోని జీసస్ సమాధి ముస్లింలది కాని మరెవ్వరిదీ కాదనీ, దాని మీద హీబ్రూ భాషలోని శాసనాలే ఉండటంవల్ల స్థిరపడుతున్నది. ఇంకొక సాక్ష్యాధారం-ఈ సమాధి ముస్లింల సమాధివలే కాక 'యూదు'ల సమాధులవలే 'ఉత్తర - దక్షిణాల'కి తిరిగి ఉండటం, అక్కడ స్థానికులను ఎవర్ని అడిగినా ఇది "ఈశా-నబీ" (Isha Nabi) లేక "యోగి"- 'ఈశా' సమాధి" అని ఇప్పటికీ చెపుతారు!

ఈ సమాధిని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూనుంచీ అప్పటి బ్రిటిష్ వైస్రాయ్ సైతం దర్శించి అక్కడి 'సందర్శకుల గ్రంథం' (Visitor's Book) లో సంతకాలు కూడా చెయ్యడమే దీనికి అధికారికమైన గుర్తింపు!

'జీసస్ - సమాధి' ఇలా భారతదేశంలోనే వుండడం-రెండవ భూకంపం వంటి చారిత్రక సత్యం!

ఎందుకంటే-జీసస్ శిలువపై మరణించి ఆకాశంలోకి ఎగిరిపోయిన కథ "కట్టు కథ"గా ఋజువు చేస్తున్నదీ-ప్రత్యక్షంగా కళ్లకు కనిపిస్తున్న 'సమాధి.'

మద్రాసువద్ద సాంథోమ్ (Santhome) 'చర్చి'లో ఈనాటికీ క్రిస్టియన్లు పూజించే జీసస్ శిష్యుడు సెయింట్ థామస్ శవం ఉండటమే అతడు

జీసస్‌తో కలిసి భారతదేశానికి రావడాన్ని మరింత బలపరుస్తోంది!

## శిలువపై మరణించలేదా?

జీసస్ గనక కాశ్మీరులో మరణించివుంటే ఆయన శిలువ వెయ్యబడటం శిలువపై మరణించడం, మరణించిన మూడవరోజు తిరిగి 'లేచుట' (Resurrection from the Dead) అన్న "సువార్త" కథలలోని విషయాల మాటేమిటి?

శిలువపై మరణించి వుంటే-జీసస్ సమాధి ఇక్కడ భారతదేశంలో ఎలా వుంటుంది? కాబట్టి ఈ రెండు గాథలలో ఏదో ఒక్కటే నిజమై వుండాలి! అటు శిలువపై మరణించడమో-ఇటు భారతదేశంలో సమాధి కావడమో ఒక్కటే నిజం రెండోది కల్పితం! కంటికి కనిపించే సమాధిని కాదనటం ఎలా? కనక సువార్తలలోని కథకు వ్యతిరేక సాక్ష్యం ఈ సమాధి!

## "సువార్త"ల సాక్ష్యం - 'శిలువపై మరణించలేదని! :

పై మూడు సాక్ష్యాధారాలవల్ల బైబులులోని 'సువార్త'లే గనక క్రిస్టియన్లు భావించినట్లు ప్రమాణపూర్వకమైన యదార్థం అయితే రోమన్ సైనికుడు 'సెంచూరియన్' శూలంపెట్టి పొడిచినప్పుడు రక్తం, నీళ్లూ చిమ్మిందని జాన్ (John) సువార్త సాక్ష్యాన్ని యదార్థమని నమ్మాలి!

## "సువార్త"ల సాక్ష్యం!

మరణించినవాడి శరీరంలోనుంచి రక్తం చిమ్మదు కాబట్టి 'సువార్త' ప్రకారం, - జీసస్ శిలువపై మరణించలేదు!

జీసస్ రహస్య జీవితం శిలువపైనుండి దించబడిన తర్వాతనుంచీ ఇక్కడ కాశ్మీరులో సమాధి చెందేవరకూ ఆయన ఏంచేశాడో తెలిపే ఏకైక చారిత్రక సాక్ష్యాధారం "రష్యన్ రాయబారి అలెగ్జాండర్ నోటోవిచ్"కు లభించిన "యోగి ఈశా జీవితచరిత్ర"లోనే లభిస్తున్నదన్నమాట!

"సువార్తలు," జీసస్ సమాధి హిమాలయాలలోని పవిత్ర గ్రంథాలూ, అన్నీ కలిసి జీసస్ శిలువపై మరణించలేదన్న విషయాన్నే ధృవపరుస్తున్నాయి! ఇది విదేశీయులు నిర్ధారణ (conclusive proof) గా వచ్చిన నిర్ణయం! దీనికి మరింకేమైనా ఇతర స్వాతంత్ర సాక్ష్యాధారాలు (Independent Evidence) చారిత్రకంగా రూఢీ అయినది లభిస్తున్నాయా?

IV ప్రాచీన రోమ్ చరిత్ర తిరగవేస్తే అందులో జీసస్ కథలో చెప్పబడిన "హెరాడ్ రాజు" (King Herod) పసిపిల్లలని వధించడం అందులో జీసస్ తప్పించుకుని బ్రతికి బయటపడటం ఒక కట్టుకథ అని ఋజువు చేసే చారిత్రక ప్రమాణం ఒకటి లభించింది. 'జీసస్ జన్మించడానికి చాలా ముందే హెరాడ్ రాజు మరణించడం' వల్ల!

V జీసస్‌ను శిలువ వేసి శిక్షించిన రోమన్ అధికారి ప్యాంటియాస్-పిలాట్ ప్రభుత్వ ఉద్యోగి. ఆయన విధివశాత్తు అధికారిగా ఎప్పటికప్పుడు తన పరిపాలనలో జరిగే విషయాలను రోమన్ చక్రవర్తికి నివేదిస్తూ "రిపోర్టులు" పంపేవాడు కదా? మరి వాటిలో ఎక్కడా కూడా జీసస్ అనే ప్రవక్త గాని, అప్పటి "యూదు" మత గురువులలో గందరగోళం జరిగినట్టుగానీ, ఏ సాక్ష్యమూ ఆవగింజంతైనా లభించలేదు!

దీన్నిబట్టి 'రోమన్ అధికారి పాంటియాస్ పిలాట్' (Pontius Pilate) జీసస్‌ను శిలువ వేయ్యలేదు' అని ఋజువౌతోంది!!!

VI ఇంతేకాక 'జీసస్‌ను శిలువవేసిన శుక్రవారంనాటి సంఘటనలు' అని చెపుతూ "సువార్త"లలో ఆశ్చర్యకరమైన వింతలు పట్టపగలే చీకటి కమ్మడం, భూమి నిజంగా గడగడలాడటం, సూర్యుడు పట్టపగలే నల్లబడిపోవడం వంటివి గనక జరిగితే ఆనాటి చారిత్రకులకు ఇది నిశ్చయంగా భయంకరమైన ప్రకృతిమార్పును - వింతగా చూసి వాటిని చరిత్ర పుటలలో నిశ్చయంగా 'రికార్డు'చేసి ఉండేవారు! అలా ఎక్కడా పిసరంత కూడా సూర్యుడు నల్లబడిపోవడం గాని, భూకంపం గాని, ఇలాటి 'మహిమ'లేవీ కూడా, ఆనాటి చరిత్రలో రికార్డు కానే కాలేదు!! ఎందుచేత? అలాటి మహిమలేవీ జరుగలేదు కనుక!!!

ఎందుకంటే ఈ మహిమలు జరిగేది అసలు జీసస్ నిజంగా మరణించివుంటేనే కదా! జీసస్ శరీరంలోంచి రక్తమూ, నీరూ రావడంతో ఆయన మరణించలేదని "సువార్త"ల్లోని "మెడికల్" సాక్ష్యాధారాలే ఋజువు చేస్తుండగా ఇక ప్రకృతి వింతలు గాని, భూకంపాలు గాని, పగలే చీకటి రావడంగాని, సృష్టించాల్సిన అవసరం దేవునికెందుకుంటుంది. జీసస్ ఎంతటి గొప్ప ప్రవక్త అయినా కాని, అతడు మరణించకుండానే, ఏ మహిమలూ, దేవుడు ఎందుకు చూపిస్తాడు? ఈ ప్రశ్నలకు సమాధానం క్రైస్తవమత చరిత్రలో లభించలేదు!

జీసస్ జీవించాడని బైబుల్‌లో చెప్పే కాలం ఇంకా అంతకు ముందు నుంచే, రోమనుల చరిత్రలో "ప్రకృతి వింతలు" (Prodigies) ఒకవేళ జరిగితే అవి వారు గురి తప్పకుండా తమ "రికార్డు"లలో చారిత్రకంగా రిజిస్టరు చేశారు, గతంలో! ఇలాటివి, సీజర్ చక్రవర్తి హత్యకు ముందూ, ఇంకా రోమ్ నగరం విధ్వంసం కావడానికి ముందూ ఇంకా అనేకసార్లు కూడా, "ప్రకృతి-ఉపద్రవాలు" తోకచుక్కలు, ఉల్కాపాతాలూ, పగలే చీకటి వంటివి కనిపించినట్టు రోమన్ చరిత్రలో సాక్ష్యాధారాలు స్పష్టంగా రికార్డు చేయబడి ఉన్నాయి!

అలాటపుడు జీసస్ శిలువ వేసినప్పుడు జరిగినట్టు "సువార్త"లలో రాసివున్న వింతలు మాత్రమే రికార్డు చెయ్యబడక పోవడంలో ఆంతర్యమేమిటి?

సమాధానం ఒక్కటే 'జీసస్ శిలువపై మరణించక పోవడమే!' అని తేలుతోంది.

VII రెండు వేల సంవత్సరాలుగా క్రైస్తవ ఫాదరీలు "సువార్త"లలో ఏ భాగాలు ఉండాలో ఏవి తీసెయ్యాలో నిర్ణయించే క్రైస్తవ సభలు (Councils) క్రిస్టియన్ కౌన్సిల్ ఆఫ్ నైసీ కాన్‌స్టంట్ నోపుల్ (Christian Counncil of Nice Constantinople) వంటి సభల రికార్డు పరిశోధిస్తే ఈనాటి దేవుని వాక్యం అని అనేకులు గుడ్డిగా నమ్మే "సువార్త"లు

లెక్కలేనన్ని సార్లు మార్పిడికీ చేర్పిడికీ గురికాబడినాయని వాటి చారిత్రక విలువ (Historical Evidence) వారపత్రికలలోని కథానికలకూ, నవలలకూ, ఇంకా ఆనాటి కల్పిత రచనలకూ ఎంత వుంటుందో అంతేనని విదేశీ బైబుల్ పరిశోధకుల నిశ్చితాభిప్రాయం. జర్మన్ చరిత్రకారుడు విల్ డ్యూరాంట్ Will Durant ఫ్రెంచి రచయిత రేనాన్ (Ernes Reynan) వంటి ఫ్రెంచి పరిశోధకులూ లూయీ జెకోలియో (louis Jacolliott) ఇంకా రష్యన్ యోగిని మేడమ్ బ్లావెట్స్కీ (H.P. Blavatsky) వంటి మేధావులు పరిశోధకులు సువార్తలలోని జీసస్ జీవిత వర్ణనను - ఆయన మరణించిన చాలా కాలానికి అనేకమంది చేత అనేక భాషలలో ఎలా మార్పులు చేర్పులు చెందబడి చివరికి జేమ్స్ రాజు కాలంలో ఇంగ్లీష్ బైబుల్‌లోకి అనువాదం ఎల్లా చేశారో ఆ చరిత్ర చూస్తేనే ఎవరికైనా బోధపడుతుంది!

ఇది ఇలా ఉండగా 1947లో జీసస్ జీవించాడని, శిలువ వేయబడ్డాడని, బైబుల్‌లో వర్ణించిన జెరూసలేమ్‌కు దగ్గరలో ఖుమ్రాన్ గుహలలో లభించిన పురాతన హీబ్రూ భాషలో తోలుపై వ్రాయబడ్డ "వ్రాత ప్రతులు" అసలే కొన ఊపిరితో ఉన్న బైబుల్ "సువార్త"లకు ఆటంబాంబులా చావుదెబ్బ కొట్టాయి!

ఇందులోని రచనలు సైన్సు పరికరాలైన 'రేడియో కార్బన్ డేటింగ్' (Radio Carbon Dating) పద్ధతిద్వారా వాటి కాలాన్ని నిర్ణయించగా 276 B.C. నుండీ 100 A.D. వరకూ చెందినవని తేలింది. దీనివల్ల "సువార్త'లలో వర్ణించబడ్డ జీసస్ కాలానికి ఇంకా అంతకంటే ప్రాచీనమైన కాలానికే చెందివున్న ఖచ్చితమైన పురాతన చారిత్రక హీబ్రూ రికార్డులని ఈ ఖుమ్రాన్ వ్రాతప్రతులను, పరిశోధకులు సైంటిస్టులు ఖరాఖండీగా తేల్చారు!

ఇందులోని పరిశోధనా విషయాలు బయటికి రాకుండా రోమన్ కేథలిక్ పీఠం పోప్ వర్గం దాదాపు ఏభైఏళ్ల కాలం అవి ప్రచురించకుండా అణచి వేశారు! చివరకు బైబుల్ పరిశోధపై ప్రపంచంలో గందరగోళం చెలరేగి - విషయం కోర్టులదాకా వెళ్ళి ఇజ్రాయిల్ ప్రభుత్వంమీద వత్తిడి కూడా తెచ్చాక గతిలేక ఇప్పుడిప్పుడే ప్రచురించారు; వాటిలోని రహస్యాలను

: అంటే ఒక్క వ్రాత ప్రతిలోని 121 పంక్తులను చదివి అనువాదం చేసుకుని బయటి ప్రపంచానికి ప్రచురించడానికి 50 ఏళ్లు పట్టిందీ? అంటే దీంట్లో ఏదో గొప్ప ఆశ్చర్యమేదో ఇమిడివుందన్నమాట! ఈనాటి ఇంగ్లీష్ బైబుల్ అనువాదం చేసిన 'బైబుల్ మాతృక' (Original Bible) గ్రీకు బైబుల్ కంటే ప్రాచీనమైన హీబ్రూ బైబుల్‌యొక్క 'అసలు మాతృక' గ్రంథాలు ఈ ఖుమ్రాన్ (Qumran-Dead Sea Scrolls) వ్రాతప్రతులలో లభించాయన్నమాట! ఇందులో బయటపడ్డ విషయాలు క్రైస్తవ ఫాదరీలకు మరింత భయంకరమైన సత్యాలు!

## జీసస్ సోదరులు :-

VIII ఇందులోని మొదటి అంశం జీసస్ శిలువపై మరణించలేదు అని! రెండవ అంశం ఇతడు కన్యకకు పుట్టనే లేదు! మేరీ మామూలుగానే జీసస్‌ను సోదరులు నలుగురినీ కన్నట్టే జీసస్‌కూ జన్మనిచ్చింది! జీసస్ సోదరులలో 'జేమ్స్' (James) 'జోసెఫ్' (Joseph) 'జూడే' (Jude) మరియు 'సైమన్' అనే సోదరులున్నట్లు వెల్లడైంది! వీరి తల్లి 'మేరీ' (Mary) సంసారపక్షంగానే వీరిని కన్నది!

## జీసస్ సోదరుని హత్య :-

IX ఖుమ్రాన్ వ్రాతలు (Qumran Scrolls) బయటపెట్టిన అనేక ఆశ్చర్యకర విషయాలలో జీసస్ సోదరుడు జేమ్స్ దారుణంగా హత్యచేయబడ్డాడు! ఇది ఒక రాజకీయ విప్లవానికి అంతర్భాగంగా 'ఉగ్రవాదుల' కార్యకలాపంతో ఏర్పడిందని, దీని పూర్తి వివరాలు ప్రతీ పేజీలోని ప్రతీమాటా అనుభవంతోపాటు 'ఖుమ్రాన్ గుహల' ఫోటోగ్రాఫులు దాని ప్లాను అందులో రికార్డు చేయబడ్డ చారిత్రక సంఘటనలూ ఏ తారీఖులలో ఎన్ని గంటలకు జరిగాయో ఆనాటి తిథులతో సహా అంటే పూర్ణిమ, అమావాస్యలతో సహా అనువదించి ప్రచురించింది. "బార్బరా థేరింగ్" (Barbara Thiering) అన్న మహిళ తన Ph.D. కోసం చేసిన పరిశోధనా గ్రంథంలో! ఇందులో ఏవాక్య ముక్కని, వాక్యాన్ని ఖండించాలన్నా

ఖుమ్రాన్ గుహలలో వుండి అక్కడి భాషలను నేర్చుకొని కష్టపడి బార్బరా చేసిన పరిశోధనలో కనీసం సగమైనా చెయ్యాలి! ఇది ఎవరూ చేపట్టలేరు సరికదా "బార్బరా" చేసిన పరిశోధనకు చిన్నత్తు ప్రతిఘటన కాని, వ్యతిరేకమైన పరిశోధనగాని, ఖండనగాని (Contradictary Evidence) క్రైస్తవ ప్రపంచం ఏమీ చెయ్యకుండా మౌనం వహించింది; దిమ్మెర పోయినట్లు! అదే ఋజువు చేస్తుంది ఈ గ్రంథంలోని సత్యాన్ని!

## ఊపిరి పోయే ఆశ్చర్యాలు :-

బార్బరా పరిశోధించి తేల్చిన అత్యాశ్చర్యకరమైన విషయాలేమిటంటే:-

1) జీసస్ శిలువపై మరణించలేదు!

2) జీసస్ అహింసావాది కాడు!

3) సాయుధ విప్లవకారులకు అండర్ వర్ల్డ్ ఉగ్రవాదులకు (Under World Terrorist) నాయకుడు.

4) సాయుధ విప్లవకారులకు రోమన్ సేనలకు ఈనాటి నక్సలైట్లు ఎన్‌కౌంటర్ల వలే జరిగిన యుద్ధకాండలో భాగంగా ఖుమ్రాన్ గుహలలోని యూదులు శిలువ వేయ బడ్డారు. కాని "ఈ చెంపకొడితే ఆచెంప చూపించు" అన్న అహింసా వాదులేమీ కాదు జీసస్, అతని అనుచరులు!.

## జీసస్-వివాహితుడు!

అన్నిటికంటే అత్యాశ్చర్యకర విషయం జీసస్ వివాహితుడు! అంతేకాదు ఇతడి భార్య మేరీ మెగ్దాలిన్. జీసస్ తన ప్రథమ భార్యకు డైవోర్సు (విడాకులు) చేసి ఈమెను పెండ్లాడగా జీసస్ శిష్యులలో దీనిపై అసమ్మతి ఏర్పడింది! వారిలో ఒకడైన జూదాస్ (Judas) జీసస్ వివాహం చట్టరీత్యా చెల్లదని వారించాడు.

ఇవి కొన్ని దశాబ్దాల పాటు (1947-1985) ఖుమ్రాన్ వ్రాతప్రతులపై

అహర్నిశలు పరిశోధించి బార్బరా ప్రచురించిన "Jesus the Man" అన్న గ్రంథంలోని చారిత్రక పరిశోధన వెల్లడించిన బాంబులు !

వీటన్నిటివల్లా ధృవపడుతున్నదేమంటే 1) జీసస్ శిలువపై మరణించలేదు!

2) కాశ్మీరులోని బౌద్ధ ఆశ్రమంలోవుండి తపస్సు చేశాడు!

3) అతడు శ్రీనగరు చేరి వృద్ధాప్యంలో అక్కడ సమాధి చెందాడు!

4) అతడు కన్యకకు పుట్టలేదు! బ్రహ్మచారి కాడు; ఆయన వివాహితుడు.

5) అతడికి సోదరులున్నారు. వీరందరూ రాజకీయాలలో పాల్గొన్నవారే!

6) అంతేకాదు రంజిత్‌సింగ్ మహారాజు పరిపాలనలో "యోగి హరిదాసు" సజీవంగా భూమిలో పూడ్చిపెట్టబడి మూడురోజుల తర్వాత మరణావస్థ నుంచి యోగప్రక్రియ ద్వారా పునర్జీవితుడు కావడం కళ్ళారా చూసిన బ్రిటిష్ సాక్షులు రికార్డుచేసిన వింత యదార్థ సత్యం!

జీసస్ కథకు క్రైస్తవ ఫాదరీలు కల్పించిన సువార్తల గాథకు చారిత్రత ఆధారం ఏదీ లేదు!

7) అలాటి "యోగ రహస్యాలు" గాని, యోగ సిద్ధులు గాని, మొరటు వారైన హీబ్రూలకు జీసస్ అనుచరులకు అసలేమీ తెలియదు!

8) దీనికి ప్రబలమైన సాక్ష్యాధారం బలపరిచేది జీసస్‌ను శిలువ నుంచి కిందకు దింపుతూవుంటే కళ్ళారాచూసిన వ్యక్తి మిత్రునకు రాసిన జాబు "అలెగ్జాండ్రియా ప్యాపిరస్" (Papyrus) లలో లభించినది చికాగోలో ఒక బుక్‌స్టాల్ పబ్లిషర్ ప్రచురించాడు **1907**లో! అది ప్రత్యక్షంగా జీసస్‌ను పునరుజ్జీవనం చేసే 'మూలికా' మందులు స్పృహతెప్పించే వైద్యవిధానాలు కళ్ళారా చూసి వర్ణించిన చారిత్రక సాక్ష్యం!

9) ఆ తర్వాత కాలినడకన జెరూసలేమ్‌ను విడిచిపెట్టి ప్రయాణంచేసిన విషయాన్ని కూడా, ఈ 'ప్యాపిరస్' (Papyrus) ధృవపరుస్తోంది!

10) పై అద్భుత చారిత్రక సాక్ష్యంతో బాటు ఈనాడు కాశ్మీరులో లభించే జీసస్ సమాధివద్దకు చేరిన జీసస్ జీవిత చరిత్ర హిమాలయ పర్వతాలలోని బౌద్ధుల ఆశ్రమంలో దొరికిన గ్రంథంలోని విషయాలూ మరింత బలంగా రూఢి చేస్తున్నవి!

ఇవి-సంగ్రహంగా ప్రపంచ వ్యాప్తంగా విదేశీయులు చేసిన బైబుల్ పరిశోధనా వింతలు! ఇవి జీసస్ జీవితానికి సంబంధించినంత మాత్రమే!

బైబుల్ 'పాత నిబంధనల'లో మోసెస్ చరిత్ర - మోసెస్ సమాధి కాశ్మీరులో లభించడం, 'మోసెస్ మంత్రదండం' (Staff of Moses) సాల్మన్ రాజు మందిరం (Temple of Solomon) ఇవన్నీ ఋజువుచేసే ఆశ్చర్యకర అంశాలను రాబోయే గ్రంథంలో పరిశీలిద్దాం! ఇంతవరకూ చాలు!

ఈనాటికైనా యదార్థ 'చారిత్రక సత్యాలను' నిష్పక్షపాతంగా పరిశోధించి త్రవ్వి తీసి మనముందుంచిన ఈ క్రింది బైబుల్ పరిశోధకులకు నివాళి అర్పిస్తూ - ఈ గ్రంథ రచనకు ఆధారమైన 'ప్రమాణగ్రంథాలను' (Bibilography) ఈ క్రింద పట్టికగా మీముందు వుంచి, ఋజువులు చూపిస్తాను.

ఈ అధ్యాయాన్ని ముగించే ముందు జీసెస్ జీవితంపై పరిశోధనలు చేసిన క్రైస్తవ పరిశోధకుల రచనలు సంగ్రహంగానైనా మీ ముందు ఉదహరిస్తాను.

జీసెస్‌పై పరిశోధనా గ్రంథాలు :-

1. "The Paganism in om Christianity"

-Albert Weigall.

2. 'The Quest of the Historical Jesus"

-Albert Schweitzer

Transl. W. Montgomery (London 1911)

3. "Tarikh - 1 - AzamiI" of Kashmeer 200 years old book on Yus Ashaf's Tomb in Kashmir

4. Jesus in India - by Hazrat Mirza Ghulam

Ahmad

(Qadian (Punjab) (1973))

5. "If Jesus did not Die on the Cross?"

A study in Evidence : Ernst Brongham Docker.

(District Court Judge Sydney (London Robert Scott-1920)

6 "The Unknown Life of Jesus Christ" - Alexander Nicholas Notovitch

(Rand NC - Nally & Co Chicago and Newyork - 1894)

7. "Where did Jesus Die" - J.D. Sharms London.



# 24

# 'దేవుని వాక్కు' బైబుల్ యొక్క గత చరిత్ర!

ఈనాడు చాలమంది క్రిష్టియన్ మతస్థులుకూఢా తమ తమ మూలగ్రంథమైన బైబుల్ యొక్క చరిత్ర ఏమిటో చూచాయగా నైనా తెలుసుకోనివారు వేలసంఖ్యలో ఉంటారంటే కూడా ఆశ్చర్యంలేదు!

కాని, ఈవిషయం ఒక భారతీయ క్రైస్తవులకే వర్తిస్తుంది! ఎందుకంటే యూరప్‌లో, అమెరికాలో పుట్టుకతో క్రైస్తవులైన విదేశీయులందరికీ ఈ బైబుల్ యొక్క చరిత్ర పూర్తిగా తెలుసును! అట్టి ఘోర అజ్ఞానాంధకారంలో వున్నవారు మనదేశీయులే.

దీనివల్ల తెల్లవారితో పోలిస్తే, మన నల్లజాతివారిని ఎంత మానసిక

బానిసత్వంలో వుంచారో అవగతమౌతుంది. ఈ వాక్యానికి అర్థం తెలియాలంటే కొంచెమైనా "బైబుల్ చరిత్ర" 'క్రైస్తవమత గత చరిత్ర' తెలియాలి. అదేమిటో ఇక్కడ గమనిద్దాం:.

## గ్రీకు బైబుల్-నుంచీ అనువాదం :-

ఈనాడు బైబుల్ ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ దేవుని సొంత వాక్య (Word of God) మని గుడ్డిగా నమ్మి చదివే, ఈ గ్రంథం యొక్క పూర్వ చరిత్ర 140 A.D. నుంచీ మనకి లభిస్తున్నది. ఈనాటి బైబుల్ ఇంగ్లీషులోకి గ్రీకుభాష నుంచి అనువాదం చెయ్యబడ్డది. కొత్త నిబంధనలు లేక క్రీస్తుకాలానికి సంబంధించి వ్రాయబడ్డ, బైబుల్ విషయం! ఇక పాత (Old Testament) నిబంధనలు బైబుల్ 'హిబ్రూ' (Hebrew) భాషనుంచి, అరబిక్ భాష నుంచీ అనువదించబడ్డాయి. యూరప్‌లో చేపట్టిన గత 1500 సంవత్సరాల పరిశోధన ఫలితంగా ఈ క్రింది అంశాలు ముఖ్యమైనవని తెలుస్తున్నాయి!

## క్రీస్తుశకం ప్రారంభం - ఎప్పట్నుంచీ ?

1. క్రీస్తుశకం మొట్ట మొదటగా మొదలుపెట్టిన తేదీ జనవరి 1, 194వ ఒలింపియాడ్ యొక్క 4వ సంవత్సరంలో ప్రారంభమైంది!

2. ఇదే రోమ్ కట్టిన 750వ సంవత్సరం జూలియస్ శకం 4714 సంవత్సరం దీనితో సరిపోతాయి!

3. ఈ క్రీస్తుశకం ప్రారంభించినవాడు 'డయోనీసియస్-ఎగ్జిగస్' (Dionysius Exıgus) అనే క్రైస్తవ సన్యాసి, క్రీస్తు తరువాత 532 A.D. సంవత్సరంలో స్థాపించాడు! అంటే దీని అర్థం క్రీస్తు మరణించినట్లు చెప్పబడే 532 సంవత్సరముల తరువాతే, ఈ "క్రీస్తు శకాన్ని" డయోనీసియస్ అనేక్రీస్తు సన్యాసి స్థాపించాడు !

4. కానీ ఈ శకాన్ని చాలాకాలం వరకూ ఎవరూ వాడలేదు; అంగీకరించనూలేదు! అందుచేత ఎక్కడా వ్యాప్తి చెందనూ లేదు.

5. దీన్ని మొట్ట మొదటిసారిగా గుడ్డిగా అమలు చేసినవాడు జర్మనీ రాజైన మూడవ ఛార్లెస్. అదీ 879 A.D. లోనే జరిగింది.

6. ఈ క్రీస్తుశకం అందరూ అమలు చెయ్యాలని నిర్ణయించింది బిషప్‌ల, మహాసభ చల్సా (Chelsa) లో 816 A.D. లో 'రిజల్యూషన్' గా పాస్. చేసి - క్రీస్తు జన్మించినది 4 A.D. అని ఏక పక్షంగా నిర్ణయించాడు.

7. అంటే ఈ నిర్ణయంలోని అసంగతం ఏమిటంటే క్రీస్తు మరణించిన తరువాత 4వ సంవత్సరంలో లేక 4 A.D. లో క్రీస్తు జన్మించాడుట. దీనిని ఈ క్రింది వాక్యమే రుజువులతో తెలుపుతోంది.

"The year of our Lord or grace, of the incarnation, of the circumscision, and of the crucifixion. The Christian Era commenced, 1 January in the middle of the 4th year of, the 19th Olympiad and 753rd year of the building of Rome and in 4714 of the Julian, period. The Era was invented by a monk Dionysius Exigus about 532 A.D. It was introduced in the 6th century and ordered to be used by Bishiops by the council of Chelsa in 816, but was not generally employed for several centuries. Charles II, of Germany was the first who added in the "year of our lord." to his reign in 879 A.D.

It was held that Christ was probably born in the year 4 or 5 A.D. (Anno Domini).

అంటే దీని అర్థం :-

"ఎన్నో డొమిని" A.D. మన ప్రభుత్వము యొక్క సంవత్సరము అనగా మన ప్రభువు యొక్క అవతారము. పరిశుద్ధమైన "సుంతీ" కర్మ చేయబడుట, శిలువ వేయబడుట, తటస్థమైన కాలము క్రీస్తు శకము, 1వ జనవరి 194వ ఒలింపియడు యొక్క నాలుగవ సంవత్సరంలో ప్రారంభమైంది. మరియు రోముకట్టబడిన 753 సంవత్సరమున్నూ,

జూయస్ శకము 4714. "సంవత్సరమునూ వున్నది. ఈ శకము క్రీ.జ.వె. 532 సం.లో "డయోనీసియస్ ఎగ్జిగస్" అను సన్యాసివలన కల్పించబడినది. ఆరవ శతాబ్దములో ఇటలీలో వాడుటకు ప్రవేశ పెట్టబడినది. మత గురువుల వలన వాడబడుటకు చాల్సియా 'సభ' వారి వలన 816వ సంవత్సరములో రిజల్యూషన్‌గా చేయబడినది. గాని, అనేక శతాబ్దముల వరకూ ఉక్కడా వాడబడి వుండలేదు. జర్మనీ రాజైన మూడవ ఛార్లెసు తన పరిపాలనలో మన ప్రభువుయొక్క సంవత్సరము 879 A.D. అని మొదటి సారిగా ప్రారంభింపబడినది క్రీస్తు జననము ఈ శకములో 4 లేక 5వ సంవత్సరముగా బహుశః ఐవుండియుండవచ్చునని కూడా నిర్ణయింపబడినది." అని!

## బిషప్‌ల - క్రిస్టియానిటీ :-

కాబట్టి చారిత్రకంగా క్రైస్తవమతం ఒక మతంగా పనిచెయ్యడం మొదలు పెట్టింది, ఈ శకాన్ని అధికారికంగా అమలులోకి తెచ్చిన 879 A.D. లోని బిషప్‌ల మహాసభతోనే! ఇది చరిత్రలో రికార్డు కాబడి, కనిపించే అక్షర సత్యం!!

ఈ విషయం ఈనాటి మన భారతీయ క్రైస్తవులలో ఎందరికి తెలుసు? క్రీస్తు అనే వ్యక్తి మరణించినట్టు, చెప్పబడే 879 సంవత్సరాల తర్వాత గాని ఇదొక మతంగా రూపుచెందలేదని, క్రీస్తు శకంగా అమలు జరిగింది కూడా 8వ శతాబ్దం నుంచే అని!

అంతకు ముందునుంచీ జీసస్ పుట్టిన రోజు నుంచీ ఈ క్రీస్తు గురించిన మతం ఎందుకని అమలులో లేదు? ఇదే, చరిత్రకు అంతుబట్టని ప్రశ్న! జీసస్ - క్రీస్తు పుట్టక ముందు - వెయ్యేళ్ల ముందే 'క్రిస్టియనులు' రోమ్ పాలించే నగరాల్లో వున్నారని చరిత్ర తెలిపే సాక్షానికి ఆధారం అర్థం ఏమిటో? ఇప్పటికైనా క్రైస్తవమత చరిత్రను పరిశోధించదలచుకున్న ప్రతీ క్రైస్తవ భక్తుడూ సత్యాన్ని కనుగొనాలంటే చరిత్రను తవ్వి తీసి పరిశోధించి, పై ప్రశ్నలకు సమాధానం రాబట్టుకోవాలి! అంతవరకూ గుడ్డితనమే!

## ఇంకో ముఖ్య విషయం:-

జీసస్ తాను బ్రతికివుండగా ఏ క్రొత్తమతమూ స్థాపించలేదు. అనీ, ఆయన ఒకయోగిపుంగవుడూ, అనేకులకు తనయోగ సిద్ధులతో రోగాలు తగ్గించి దృష్టినిచ్చి, దైవ చింతనను వారికి బోధించాడనీ ఈ నాటి సాధుసత్పురుషులలో శ్రీ షిరిడీ సాయిబాబాలాంటి - మతానికతీతమైన విశ్వమానవ ప్రేమను ఆచరించే ఆధ్యాత్మిక పురుషుడిగానే ఈనాటి మతద్వేషానికి రగిల్చే మతాలను స్థాపించలేదని, ఈనాటి క్రిష్టియన్ ప్రచారకులు మతంతో వ్యాపారం చేసే బిషప్పుల మతం, జీసస్ - స్థాపించలేదని? ఆయన యూదులలో జన్మించిన యోగిగా 'ఎస్సీను' (Essene) గానే మరణించాడనీ, ఆయన సమాధి కాశ్మీరులోనే ఉందనీ, నేటికీ దానిని మనం చూడవచ్చు. ఆయన బోధించినది 'సర్వ మానవాళినీ ప్రేమించు' అన్న అహింసాజ్యోతి బుద్ధదేవుని వంటి ధర్మాన్ని! దీనికి ప్రచారంతో ద్వేషాన్నీ, యుద్ధాలనూ చిత్రహింసలనూ సజీవదహనాలతో మతం మార్పిడి వంటి అత్యాచారాలు 18వందల ఏళ్లు నడిపి 'పోప్' (Pope) లు లోకాన్ని దండుకున్న - 'శిలువమతం' లేక క్రీస్టియానిటీ కాదనీ చరిత్రను పరిశోధిస్తే ఈనాటికీ ప్రత్యక్షంగా ఘంటాపథంగా ఋజువు చేస్తున్న సాక్ష్యాలే చాటి చెబుతున్నాయి.

అసలు జీసస్ యొక్క నిజమైన జీవితాన్ని అణచిపెట్టి ఆయన సమాది కాశ్మీరులో ఉన్న విషయం కూడా క్రైస్తవులకి సయితం తెలియకుండా అణచివేయడమేకాక మత్వ్యాపారులుగా బిషప్పులు వెయ్యేళ్లు పైబడి - 'దేవునివాక్యం' (Word of God) బైబుల్ అన్న భయం కూడా లేకుండా ఇష్టంవచ్చినట్టు మార్పులూ చేర్పులూ చేస్తూ వంద ఏళ్లగా కాలేజీ సిలబస్‌లా బైబుల్‌లోని గ్రంథాలను సువార్తలనూ మార్చి ఇష్టారాజ్యంగా ఏలుతున్న బిషప్పుల మతానికీ జీసస్ బోధించిన అహింసామతం పూర్తి వ్యతిరేకమనీ చరిత్రలో 'జీన్-ఆఫ్-ఆర్క్' (Joan of Arc) వంటి నిజమైన క్రైస్తవులను కాల్చి చంపి, తరువాత వారినే 'సెయింట్సు' (Saints) గా ప్రకటించిన ప్రచారమతం ఒక రాజకీయ వ్యాపారం అని చరిత్ర చాటి

చెబుతోందని - ఏనాటికైనా నిజమని క్రీస్తు బోధనను, హిమాలయ పర్వతాలలో రహస్యం తాటియాకుల గ్రంథాలలో నిక్షేపించబడివున్న 'యోగీశా రహస్య చరిత్ర' (Seget life of Yogi Isa) ను ఏనాటికైనా వెలికి తీసి ప్రపంచాన్ని వెలుగులోకి రానివ్వాలని ప్రతీ క్రైస్తవుడే కాదు ప్రతి ఒక్క మానవతావాదీ కాదనలేని పవిత్రమైన డ్యూటీ!

నిజం - తెలుసుకోకుండా, నిజమైన బైబుల్ యొక్క చరిత్రను పరిశోధించకుండా ఇన్ని రహస్య విషయాలు వెలుగులోకి ఎలా వస్తాయి?

ఇంత శ్రమ ఎందుకూ అంటే - నిజమైన క్రైస్తవులకైనా - జీసస్ యదార్థ బోధనలనే అనుసరిస్తే ముక్తి కలుగుతుందా? లేక బిషప్పుల ప్రచారమతాన్ని వ్యాపార సంస్థగా జీసస్‌ను అణచి క్రాస్‌ను పూజించే క్రిస్టియానిటీ యొక్క రాజకీయ ఎన్నికల వాగ్దానాల వంటి ప్రచారం మాటలు ఆచరిస్తే తరిస్తామా? జీసస్ మహాత్ముడు ఆయన దైవ శక్తులుగల యోగి అన్న విషయంగనక మనం విశ్వసిస్తే బిషప్పుల మార్పులూ చేర్పులూ, సువార్తల నుంచి తీసివేతలూ ఇన్నేళ్ళుగా ఎందుకు చేయవలసి వచ్చింది? యూరోప్‌లోని రాజకీయాలలో పోప్‌ల యుద్ధాలు దండయాత్రలు ధనదాహం, హింస రాజకీయమైన పనిముట్టుగా చెలాయించిన మతంతో - జీసస్ బోధనలకు ఎట్టి సంబంధమూ లేదు అని తెలియటానికి పోప్‌ల చరిత్రను జీసస్ రహస్య జీవితంతో సరిపోల్చితే చాలు! రెండింటికీ తేడా తెలుస్తుంది.

ఏనాటికైనా నిజందాగదు - అనుకోకుండా లభించిన ఖుమ్రాన్ వ్రాతప్రతులు కనుగొనడంతో పురాతన హీబ్రూ (Hebrew) భాషలోని మూల ప్రతి (original manuscript) బైబుల్ యదార్థ పాఠాలు లభ్యమైనాయి **1947లోనే!** కానీ 45 సంవత్సరాలపాటు వీటిలో ఏమివున్నదో పైకి రాకుండా తొక్కిపట్టిన చర్చి బిషప్పుల కుతంత్రాలను బైట పెట్టే పరిశోధనా గ్రంథం.

"The Dead Sea Scrolls - a deception చదివితే ఎలాంటి క్రైస్తవుడికైనా కనువిప్పు కలుగుతుంది! బిషప్పులు కల్పనలతో మార్చిన ఈనాటి

సువార్తల (Gospels) కూ అసలైన హీబ్రూల భాషలోని బైబుల్ మూల ప్రతులలోని యదార్థ చరిత్రకూ పోలికే లేదు ! ఇవి వివరంగా ఇంకో అధ్యాయంలో పరిశీలిస్తే ఆశ్చర్యం వేస్తుంది. జీస్ యదార్థ జీవితం గురించి మనకి ఎంతో తెలియదు!

నిజమైన బైబుల్ చరిత్రకై 'యోగి ఈశా రహస్య జీవితం' గురించి అన్వేషిద్దాం! సంస్కృత పురాణాలలో జీసస్ గురించిన అంశాలు, ఖుర్రాన్‌లో లభించిన బైబుల్ వ్రాత ప్రతులతో కలిపి పరిశీలిస్తే లభించే యదార్థం ఏమిటో - అన్వేషిద్దాం! దర్బారుగా తెల్లదొరలు ఏ మందు నూరిపోస్తే అదే నల్లమందుగా మింగే బానిస జాతులైన నీగ్రోలు, ఆఫ్రికన్‌లుతోపాటు మన నల్లభారతీయులు కూడా మింగాలా?

## క్రీస్తు - తెల్లవాడు కాదు !

ఇంకొక సత్యం క్రీస్తు విదేశీయుడు కాదు ఆయన యూరోపియన్ కాడు ! అంటే తెల్లజాతివాడు కానేకాడు! ఈయన ఆసియా జాతీయుడు ! నల్లని జుట్టు నల్లని కళ్లు చామనచాయతోవుండే ఆసియా జాతివాడే! ఇది ఎందరు భారతీయులకు తెలుసు? క్రీస్తు జీవితంలో ఎన్నో అణచివేసి తెల్లజాతులవారి స్వార్థ రాజకీయ కుట్రలకోసం చరిత్రను తారుమారుచేసి క్రీస్తు మహాశయుని నిజమైన ఆధ్యాత్మిక బోధనను భక్తులైన భారతీయ క్రైస్తవులకు లందకుండా చెయ్యడం ఘోరమైన అన్యాయం కాదా? దీనికి భారతీయులైన మనం సగర్వంగా పరిశోధన చేసి ధైర్యంగా క్రీస్తు మహాశయుని నిజమైన జీవితం, ఆయనయొక్క బోధనలు పరిశోధనచేసి ధైర్యంగా వెలికి తీయాలి! క్రీస్తు యదార్థ బోధనలు అణిచి పెట్టిన రోమన్ కేథలిక్ చర్చిపూజారుల, ఫాదరీలను మతాధిపత్యం నుంచి క్రైస్తవ చరిత్ర యదార్థమైన స్వరూపాన్ని మనం సత్యాన్వేషణ దృష్టితో వెలికి తీయాలి! ఇది ప్రతీఒక్క క్రైస్తవుడి పవిత్రధర్మం! ఈ వాక్యం ఎందుకింత దృఢంగా రాయవలసి వస్తుందో ఈక్రింది అంశాలను చూసే తెలుస్తుంది!

క్రీస్తు మహాశయుడు భారతదేశం వచ్చాడన్న విషయం **19**

సంవత్సరముల కాలం మన భారతీయులకు తెలియకుండా ఈ శ్వేతజాతి క్రైస్తవులు, బిషప్‌లు, ఆర్చిబిషప్‌లు ఎందుకు అణచి వేస్తున్నారు? క్రీస్తు భారతదేశం వచ్చాడంటే ప్రతి భారతీయుడికీ గర్వకారణం కాదా? ఈ విషయం చారిత్రకంగా ఋజువు చేయబడిన చారిత్రక సత్యాలను కొన్ని రానున్న అధ్యాయాలలో మీముందు పెడతాను? దీనిని పరిశోధించడం తెలుసుకోటమూ అందరి క్రైస్తవుల కనీస ధర్మం!

క్రీస్తు మహాశయుని 'సమాధి' - కాశ్మీరులో వుందని ఎందరు క్రైస్తవులకు తెలుసు? ఇలా తెలియకుండా అణచిపెట్టిన బ్రిటిష్ ప్రభుత్వ రాజకీయ విద్రోహమే - బుద్ధి పూర్వకంగా చెయ్యబడిన మోసం అని - ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వ రెసిడెంట్‌గా పనిచేసి 'సర్ చార్లెస్ యంగ్ హజ్బెండ్' వ్రాసిన ప్రత్యక్ష వాక్యాలే క్రీస్తు సమాధిని కాశ్మీరులో ఆయన చూశాడన్న సత్యాన్ని - చూసి బ్రిటిష్‌వారు దాచి పెట్టారన్న మహాసత్యాన్ని ఎంతటి గుడ్డివారికైనా కనువిప్పు కలిగిస్తాయి ఈ క్రింది వాక్యాలు !

> There resided in Kashmir some 1900 years ago a saint of the name of Yus Asaf, who preached in parables as Christ used as per instance, the parable of the sower. His tomb is in Srinagar and theory of the founder of the Wadiani Sect is that Yus Asaf and Jesus are one and the same person"
>
> – Sir Francis Youghusband, British Govt.Resident in Kashmir 1909-11)

క్రీస్తు సమాధి గురించి ఇప్పటి వరకూ చూపిన సాక్ష్యమే కాక ఇంకా బోలెడు పరిశోధనా రహస్యాలు వేరే అధ్యాయంలో ఇచ్చాను! ఇక్కడ ఇంతకంటే ఆశ్చర్యకరమైన మరో వింత చరిత్ర మనకి పరిశోధనతో తవ్వి మనముందు పెట్టింది. అదేమిటి?

## మేరీ మాత సమాధి :

ఈనాటి బైబుల్‌లో ఎక్కడా - క్రీస్తు ఎక్కడ మరణించాడో?

ఆయన శరీరం ఎక్కడ సమాధి చెయ్యబడిందో తెలిపే చారిత్రక రహస్యాలన్నీ శ్వేత జాతీయులైన రోమన్ కేథలిక్, బిషప్‌లు బైబుల్ నుండి తొలగించారు. ఇలా చాలా విషయాలు బైబుల్ నుండి తొలగించారు!!! అవేమిటో ఈక్రింది వివరిస్తున్నాను. కాని, అన్నిటికంటే ఘోరమైన విషయం మేరీమాత సమాధి కాశ్మీరులో వుందని తెలియనిస్తే వీళ్లకేం నష్టం, వీరికి ఏం పాపం చుట్టుకొంటుంది? కనీసం ప్రతీ క్రైస్తవ భక్తుడూ వెళ్లి జీవితంలో ఒక్కసారైనా ఆ మాతృమూర్తి సమాధిని దర్శించి ఆనందపడగలడు కదా! ముసల్మానులు అంతా మక్కా యాత్ర చేసినట్టే ప్రతీ భారతీయ క్రైస్తవుడు జీవితంలో తప్పక చెయ్యాల్సిన ఒక పవిత్రమైన "హాజీ యాత్ర" వంటిదిగా "యాత్ర" చేసుకొని కాశ్మీరులోవున్న మేరీమాత సమాధిని, క్రీస్తుమహాశయుని సమాధిని దర్శించుకుంటారు గదా అని, నాకు యాదృచ్ఛికంగా లభించిన ఆ సమాధి యదార్థ ఫొటోను ఈ గ్రంథంలోనే ప్రచురిస్తున్నాను! దీన్ని కనుగొన్న వారు కూడా - తెల్లదొరలే! కాని, తెల్లజాతి బిషప్‌లు మాత్రంకాదు !

## మోసెస్ - 'సమాధి', మంత్రదండం :-





జీసస్' మంత్రదండం

ఇదేవిధంగా బైబుల్‌లోని మోసెస్ ప్రవక్త సమాధికూడా ఇటీవలనే హిమాలయాలలో కనుగొనబడింది! అబ్రహాం మోసెస్ వంటి పాతనిబంధనల మత గురువుల యదార్థ చరిత్రను తారుమారు చేసిన విషయం ఈనాటి వారి సమాధుల ఫోటోలే ఋజువు చేస్తున్నాయి! దీని వివరాలు విడిగా ఒక అధ్యాయంలో తెలుసుకుందాం!

ఈ విషయాలు తెలిస్తే రోమ్‌లోని చర్చ్‌ల రాబడి మహాత్యం పోతుందని ఈ గొప్ప పవిత్ర రహస్యాలను అణచి వెయ్యడానికి కారణంగా పరిశోధిస్తే మనలో ఏ క్రిష్టియనుకైనా సరే కనిపిస్తాయి! అసలు క్రీస్తుకు, మేరీ మాతకూ లేని ప్రాముఖ్యత ఈ క్రైస్తవ మత బిషప్‌ళకు సుఖంగా జీవించే ఫాదరీలకూ వుండాలా? ఇదేనా నిజమైన క్రైస్తవమతం? ప్రతి క్రైస్తవుడూ ఆలోచించవలసిన ఘోరమైన చారిత్రక సత్యం ఇది (Historical Truth!)

## బైబుల్‌పై - సైంటిఫిక్ పరిశోధన :-

ఇలాగ బైబుల్‌పై పరిశోధన ఒక ప్రత్యేకమైన విభాగంగా, అమెరికా బ్రిటన్ జర్మనీలలోని యూనివర్శిటీలలో శాఖలు "Department of Religious Studies, Comparative Religion" అన్న వివిధశాఖల రూపంలో ఏర్పడి ఉన్నాయి. ఇందులో పనిచేసే ప్రొఫెసర్లు పరిశోధకులు దాదాపు నూటికి నూరుపాళ్లు క్రైస్తవ మతస్థులే!

ఐనా ఇది సైన్స్ యుగమైన మనకాలంలో విదేశాలలో ఏర్పడుతున్న పురోగతి దృక్పథం యొక్క ఫలితం! దీని పర్యవసానం అతి ముఖ్యమైనది. అదేమిటంటే బైబుల్ ఒక మత గ్రంథంగా సైన్సు దృష్టితో పరిశోధన చేపట్టడం గతంలో ఒక గొప్ప అపరాధంగా (blasphemy) లేక దైవద్రోహంగా భావించే మనస్తత్వం క్రమేణా మార్పు చెంది సంస్కరణ దృష్టి (Reform) చోటు చేసుకుంది.

ఈ మాటలకు పూర్తిగా అర్థం తెలియాలంటే గతంలో బైబుల్ గ్రంథంపై పరిశోధన లేక స్వయంబుద్ధితో విమర్శనాత్మకంగా విశ్లేషణ చేసి

చర్చించడం అనేది ఎంత ఘోరమైన 'అపరాధంగా' నేరంగా భావించేవారో అనేది గత బైబుల్ చరిత్ర తెలిస్తేనేగాని బోధపడదు.

## సైన్సూ చర్చీ విభేదాలు:-

ఉదాహరణకు భూమిచుట్టూ సూర్యుడు తిరగడంలేదు. సూర్యుడు చుట్టూ తిరుగుతున్నది భూగోళమే అన్న సైన్స్ సిద్ధాంతాన్ని ప్రతిపాదించినందుకు కోపర్నికస్ గెలీలియో వంటి వారికి మరణశిక్ష విధించారు క్రైస్తవ మత ఫాదరీలు! ఎందుకంటే బైబుల్ దేవునివాక్యం కాబట్టి! అందులోని ఏ అక్షరము పరమసత్యం! ఇంతేకాదు దేవుని వాక్యంకు వ్యతిరేకమైన సిద్ధాంతాలను ప్రతిపాదించటం లేదా సొంత పరిశోధన నా దృష్టితో బైబుల్‌లో వ్రాసింది యదార్థమా? అని నిజానిజాలకై అన్వేషణ చేయడమే - ఘోరమైన దైవాపరాధం, దైవదూషణతో సమానమైన నేరంగా మరణశిక్షగాని చిత్రహింసలుగాని, లేక కనీసం చీకటికొట్లో మావజ్జీవ బందీగా కాని, విధించబడే కనీస శిక్ష ఈ దృష్టిమారి విదేశాలలో ఈనాడు బైబుల్ గ్రంథంపై సైంటిఫిక్ (Scientific)గా నిర్భయ పరిశోధనలు చేపట్టటం అనేది క్రైస్తవ మత ఫాదరీల మనస్తత్వాలకు దాదాపుగా అసాధ్యం అన్నంతటి గొప్ప మార్పు!!!

ఈ మార్పు అంత తేలికగా ఏమీరాలేదు! డార్విన్ (Charles Darwin) మహాశయుడు తన జంతుశాస్త్ర పరిశోధనల ఫలితంగా మానవుడు కోతి నుంచి పరిణామం చెంది కోట్ల సంవత్సరాలుగా నడిచిన వాతావరణ మార్పుల ఫలితంగా ఈనాటి స్థితికి చేరుకున్నాడన్న పరిణామసిద్ధాంతం (Evolution Theory) ప్రతిపాదించగానే ఒక్కసారిగా క్రైస్తవ ఫాదరీల నుండి గగ్గోలు ఎదురైంది. బైబిల్‌లో దేవుడు మనిషిని మట్టినుంచే తయారుచేసాడని "బైబుల్"లో వ్రాసినదానికి వ్యతిరేకంగా డార్విన్ (Darwin) పరిణామసిద్ధాంతం ప్రతిపాదిస్తాడా? అని ఆగ్రహంతో ద్వేషంతో విరుచుకు పడ్డారు. ఛాందసవాదులైన క్రైస్తవ ఫాదరీలు!

కాని పూర్వంలో లాగా డార్విన్‌ను శిలువవేయడానికిగాని, ఇన్‌క్విజిషన్

(Inquisition) గా వెయ్యకుండా, థామస్, హెన్రీ హక్స్లీలు, (Hexley) ఇంకా అనేక సైంటిస్ట్‌లు డార్విన్‌కు అండగా నిలిచారు. దాదాపు అర్థశతాబ్దం తర్జనభర్జనలు విధృతమైన స్థాయిలో నడిచాయి. అతికష్టంమీద సైన్స్‌కు లభించిన సాక్ష్యాధారాలను కాదనలేక ఆనాడు బైబిల్‌మీద ఉండే దేవునివాక్యం (Word of God) అన్న గుడ్డివిశ్వాసం దిగమింగుకోనూలేక ఆనాడు యూరప్ మేధావులు పడినపాట్లు చరిత్రాత్మకమైన ఈ మార్పుతెచ్చాయి! దీని ఫలితమే "బైబుల్‌పై పరిశోధన" అన్న అంశం! అన్ని యూనివర్శిటీలలోనూ సైన్స్ పరిశోధన అనేది సగౌరవమైన న్యాయమైన విశ్లేషణగా ఒక అధికారిక స్థానాన్ని సంపాదించుకుంది! అయితే ఈ బైబుల్ పరిశోధన ఏమిటో దాని పర్యవసానం ఎటువంటిదో ఫలితంగా ఈనాడు యూరప్ అమెరికాలలో క్రైస్తవ ప్రపంచమంతా బైబులును ఒక మతగ్రంథంగా కాక, ఒక ప్రాచీన చారిత్రక అవశేషంగా సైన్సు దృక్పథంతో విశ్లేషిస్తున్నాయి. మన దేశంలో ఇదంతా ఇంకా ఏమాత్రం తెలియని అంధకారంలో మగ్గుతున్న మన భారతీయ సోదరులకు దీని అవగాహన రాలేదు. మన భారతీయ క్రైస్తవులను విదేశీ క్రిష్టియన్‌లతో పోల్చి బైబుల్‌పై పరిశోధనా దృక్పథం లోపించడంవల్ల అందుకే 900 సం॥లు వెనుకబడి వున్నారు. ఈ విషయం కొన్ని ఉదాహరణలతోగాని స్పష్టంగా అర్థం కావడం కష్టం! కొన్ని ఉదాహరణలు మనం పరిశోధనా దృక్పథంతో పరిశీలిద్దాం!

## ఈనాటి బైబుల్ చరిత్ర :-

ఈనాటి ఇంగ్లీష్ బైబుల్ నేరుగా భగవంతుని నోటినుండి వెలువడ్డ దేవుని వాక్యం ఏమీ కాదు! జేమ్స్ రాజు కాలంలో ఇంగ్లీష్‌లోకి అనువాదం చేయబడ్డ భాషాంతరీకరణ (Translate into English) మాత్రమే! ఇందులో పాల్గొన్న వందలమంది అనువాదకుల గురించి తెలుసుకున్నాము!

ఇలా ఇంగ్లీషులోకి అనేకసార్లు బైబుల్‌గా అనువదించిన అసలు మూలగ్రంథం ఏ భాషలోనిది? అని ఆలోచిస్తే గ్రీకు బైబుల్ (Greek Bible) దీనికి మాతృక! కాని ఈ గ్రీకు భాషలోని బైబుల్‌కూడా అనువాదమే!

అది అంతకంటే ప్రాచీనమైన వేరే హీబ్రూ భాషలోని పాతనిబంధనల మూల మాతృకనుండి గ్రీకుభాషలోకి అనువాదం చేశారు! ఇది చారిత్రకమైన సాక్ష్యాధారాలతో లభిస్తున్న యదార్థం!

అయితే ఈ 'పాతనిబంధనలు' కొత్త నిబంధనలూ, ఒక్క కాలానికి చెందినవికావు సరికదా ఒకే **మూలగ్రంథం మాతృకగా అనువాదం** చేయబడ్డవి కూడా కాదు!

ఉదాహరణకు ఇంగ్లండులోనే ఎనిమిదవ హెన్రీ (Henry VIII) కాలంలో రోమన్ కేథలిక్ చర్చిలో ఏర్పడ్డ అంతర్మథనం (Reformation) లో జర్మన్ అసమ్మతి వర్గీయుడు మార్టిన్ లూథర్ (Martin Luther) రోమన్ కేథలిక్ పీఠాధిపతి పోప్ అధికారంపై తిరుగుబాటుచేశాడు! ఫలితంగా ఇంగ్లీష్ క్రైస్తవులకూ, జర్మన్ క్రైస్తవులకూ కొంచెం మత స్వాతంత్ర్యం ఇచ్చారు.

## సొంత బుద్ధినుపయోగించటం నేరం కాదు!!

అంటే సొంతబుద్ధితో ఆలోచించి బైబుల్ గురించి సహేతుకంగా బుద్ధినుపయోగించే అధికారం పర్మిషన్ లభించిందన్నమాట! దీని ఫలితంగా ఎక్కడెక్కడో మారుమూల పండితుల వద్ద, బైబుల్ మూల గ్రంథాలు వందలు వేలసంఖ్యలో బయటపడ్డాయి. ఫలితంగా అసలు బైబుల్ ఎన్ని గ్రంథాలుండాలి? అన్న విషయంలో ఈనాడు **బైబుల్‌లో** లేని భాగాలు, గ్రంథాలూ, లెక్కలేకుండా చేరుకున్నాయి! వీటిని కంట్రోలు చేయడానికి అప్పటి మతాధికారులు ఇలాంటి వ్రాతప్రతులన్నీ లాక్కొని తగలపెట్టేశారు! రహస్యంగా అలా దాచుకున్న పండితులు పరిశోధకులను అరెస్టుచేయడంనుంచి మరణశిక్ష దాకా, ఇంకా అనేక హింసలకు గురిచేశారు. ఇది కొన్ని దశాబ్దాలపాటు రోమన్ కేథలిక్ చర్చి ఆధ్వర్యంలో నిరంతరం జరిగిన **మతఛాందస** (Inquisition) **హింసాకాండ!** దీనిలో వేలాదిమంది మరణించారు! ఎంతోమంది హింసలకు గురిచేయబడ్డారు! ఇదంతా ఒక పెద్ద చారిత్రక గ్రంథంగా అనేకమంది క్రైస్తవులే ఆధారికాలో

ఫోటోలతో సహా ప్రచురించారు. ఇది ఇట్లావుండగానే మరోవంక రోమన్ కేథలిక్ బిషప్‌లు పీఠాధిపతులూ, బైబుల్‌లో ఏ అధ్యాయాలు తొలగించాలి? ఏఏ భాగాలను చేర్చాలి? అన్న అంశంపై మళ్లీ శాసన సభలు పెట్టారు. నిర్ణయాలు రిజల్యూషన్స్‌గా ఓటింగుపెట్టి తొలగించిన బైబుల్ భాగాలూ, చర్చి కలిపిన చేర్పుళ్లూ ఇప్పటికీ లభిస్తున్న ఆ మీటింగుల వివరాలూ మరొక అధ్యాయంలో పరిశీలించవచ్చు! ప్రస్తుతానికి ఇందులో మనకి కావలసిన అంశం బైబుల్ గ్రంథం యొక్క ఈ గత చరిత్ర ఎలా నడిచింది?

## బైబుల్ ఒకే గ్రంథం కాదు!

ఇలాగ అనేక తర్జన భర్జనల ఫలితంగా ఏర్పడిన బైబుల్ మూలగ్రంథం "ఒక వ్యక్తి రాసినది ఒకే గ్రంథం కూడా కాదు" ఇది, అనే కాలాలలో వేరు వేరు భాషలలో అనేక మంది రాసిన గ్రంథాలయొక్క కూడలి లేక (Library) లైబ్రరీగా ఏర్పడ్డది అన్న విషయమే యూరప్‌లోని యూనివర్సిటీలన్నీ నిర్ధారణకు వచ్చిన చారిత్రక సత్యం!

మోసెస్ ప్రవక్త స్వయంగా భగవంతుని నుండి లభించిన అయిదు గ్రంథాలు పాత నిబంధనలలోని "పెంటట్యూక్" (Pentateuch) అన్న భాగాలు కూడా నిజంగా మోసెస్ కాలంలో రాజబడలేదని తెలిసే సాక్ష్యాధారాలు బయటపడ్డాయి! ఇది క్రైస్తవ భక్తులందరినీ గొప్ప సంక్షోభంలో ముంచెత్తింది! ఏమిటో ఈ సాక్ష్యాధారం?

ఉదాహరణకు బైబుల్‌లోని మోసెస్ జననం అయి ఈజిప్ట్ రాజవంశంలో రహస్యంగా పెంచబడటం, ఆ తర్వాత దేశ బహిష్కరణకు గురియై ఎడారిలో బాధలు పడడం, ఆతర్వాత 'సైనాయ్' (Sinai) గుట్టపై దేవుడు ఆయనకు వెలుగుగా ప్రత్యక్షమై ఇచ్చిన 10 శాసనాలు (Ten Commandments) ప్రాచీన యూదు మతానికి మూల స్థంభాలు!!! ఇవే పాత నిబంధనలకు పునాది!

ఇలాగ 'మోసెస్ ప్రవక్త (Moses) రచించాడని చెప్పబడే బైబిల్

భాగంలోనే' మోసెస్ మరణించాడని ఆయనను ఫలానా చోట సమాధి చేశారని మనకి ఈనాటికీ కనిపిస్తుంది! అయితే యూరప్‌లోని బైబుల్ పరిశోధకులకు కలిగిన అనుమానం, మోసెస్ ప్రవక్తయే గనక స్వయంగా దీన్ని రచించి వుంటే ఈ గ్రంథంలో **ఆయన మరణం గురించి** ఆయనే ఎలా రికార్డుచేస్తాడు? ఇది అసాధ్యం! కాబట్టి ఇది 'మోసెస్ గ్రంథాలన్న' సాంప్రదాయంతో మరొకరు ఎవరో, గ్రంథస్తం చేసి వుండాలి! ఇది మొదటి కరెంటు షాక్ వంటి కనువిప్పు.

మోసెస్ ప్రవక్తకు యహోవా (Jehova) దేవుడు బానిసలైన హీబ్రూలకు దాస్యం నుంచి విముక్తి ప్రసాదిస్తానని వారికి తేనే, పాలు ప్రవహించే భూలోక స్వర్గంలాంటి ప్రదేశాన్ని ఇస్తాననీ నమ్మచెప్పి తీసుకురాగా ఈజిప్టు నుంచి కాందిశీకులుగా **40** సంవత్సరాల పాటు పడరాని కష్టాలు పడుతూ కాలినడకన వేలమంది మరణిస్తూ అంతులేని బాధలుపడ్డారు! ఇవన్నీ "పాత నిబంధనల" (Old Testament) గ్రంథంలో కూడా కనిపిస్తాయి గదా? ఇంతకీ బ్రిటిష్ పరిశోధకులు అమెరికన్ ప్రొఫెసర్లకు కలిగిన సంశయం ఒక్కటే - ఇలా వారికి వాగ్దానం చేసిన భూతల స్వర్గం చేరకుండానే మోసెస్ ప్రవక్త మరణించాడు! అసలు వారు ఇంకా ఇలాగే బాధలనుభవిస్తూ యూదులు (Jews) గా రెండవ ప్రపంచ యుద్ధం (1945) దాకా హిట్లరు వంటి నాజీ నియంతల హత్యాకాండ **1945** దాకా ఇంకా బలి అవుతూనే వున్నారు! కాబట్టి వీరికి "జెహోవా" హామీ ఇచ్చిన ఆదర్శ భూమిని చేరుకున్నట్టు ఎక్కడా 'పాత నిబంధన'లలో నిదర్శనయే లేదు! అలా చేరుకొని వుంటే యూదులు హీబ్రూలుగా (Hebrews) ఈనాటి వరకూ ఇన్ని బాధలు పడివుండరు! ఇది యదార్థంగా కనిపిస్తున్న చారిత్రక సాక్ష్యం! బైబుల్ పరిశోధనలో ఇది మరో గొప్ప మలుపు!

ఇటీవలనే కాశ్మీరువద్ద మోసెస్ (Moses) ప్రవక్త యొక్క సమాధిని ఒక యూరోపియన్ పరిశోధకుడు ఫోటో తీసి, దాన్ని ప్రచురించగా యూరప్‌లో పెద్ద కలకలం, సంక్షోభం చెలరేగించిన ఆ 'మోసెస్ సమాధి' (Moses' Tomb) చిత్రం ఈ పక్క పేజీలో చూడవచ్చు!

అదే గ్రంథంలో ఏసుక్రీస్తు తల్లి 'మేరీ సమాధి' కూడా కనుగొన్న ఫోటోను ఆ పరిశోధకుడే ప్రచురించాడు!

పై ఆశ్చర్యకరమైన పరిశోధనా ఫలితాల వల్ల బైబుల్ చరిత్రలోనే గొప్ప మార్పును తెచ్చిపెట్టింది. అందులో ముఖ్యమైనది. ఈనాడు "పాత నిబంధన"ల గ్రంథంలో నేరుగా భగవంతుడే తన వాక్యాలలో ఇచ్చిన నోవా జలప్రళయ గాథ ప్రపంచంలో అనేక ప్రాచీన మతగ్రంథాల నుంచి కాపీ చేసి సేకరించివున్నదని బయటపడటమే!

ఈనాటి గ్రీకు బైబిల్‌కు మాతృక అయిన హీబ్రూ బైబుల్ కూడా ఆ జాతివారు నివసించిన బేబిలోనియా, (Babylonia) మెసపోటేమియా చాల్డియా ప్రాచీన ఈజిప్టు దేశాలలోని మతగ్రంథాలలోంచి (Chaldean Epics) సేకరించినదేనని, ఈ అనువాదాలవల్ల బయటపడడం మరో ఆశ్చర్యం!!! దీనిని రెండు ఉదాహరణలు పూర్తిగా స్పష్టంగా చేస్తాయి.

"For Christians today, it is perfectly possible to acknowledge the Buddha for example, or Muhammad as historical individuals, just as one might, Caesar or Alexander and to differentiate them from the legends concerned. However such differentiation is altogether more difficult for Christ Because at the very heart of Christian belief, history and theology are inextricably entagled... yet, each, if looked at separately, is a potential threat to the other... on the one hand, there is the historical individual, the man who according to most scholars actually existed and walked... on the other hand, there is the Man-God of Christian Doctrine, the divine Personage deified extolled and promulgated by St. Paul. To examine this personage as an histrical individual... as we might regard Muhammad or Buddha, Caesar or Alexander is, for many Christians a blasphemy.

(Preface xv-xvi)

## THE BIBLE IS NOT A 'BOOK' BUT A LIBRARY

"After all, the Bible is really a kind of anthology, an assortment of incredible, stylistic diversities – Songs, Chronicles, Riddles, Fables, Proverbs and Revelations – which makes the epithet "Book of Books" very apt, in a strikingly literal sense."

"... the contents of these various books were brought together off, over some 1500 years. The earliest writings date from about 1200 B.C. and the latest around 150 A.D."

"... Even so, these original texts of the Bible were not the text, that the scholars who produced our modern translations, had, in front of them. The Latin manuscripts of the Bible... date from A.D. 1000. By then Charlemagne had been dead for 186 years. The Vickings have long since settled down in Norman and the Ventian fleet already ruled the adriatic... how many scribal errors and mis translations crept in, this span of a thousand years or more?"

"The Bible is not just "The Bible," because the "Word of God" exists in both Protestant and Catholic versions... the Protestant book of Daniel has twelve Catholic versions... the Protestant book of Daniel has twelve chapters; the Catholic, fourteen."

"In 1960 Prof. Pines of Hebrew University of Jerusalem published fragments of an early Christian text, that mentions an original Hebrew account of the life and teachings of Jesus. . no trace of which has ever been discovered."

"The discovery in 1946 of an early Coptic manuscript which

purports to be the Gospel of St. Thomas, one of the Gnostic Gospels, has touched off a considerable amount of scholarly controversy... all this raises fresh questions and uncertainties, that will compel us to reappraise... what 'really' belongs in the Bible..."

"Since 1977 six Biblical Scholars from five different countries working under the auspices of the International Bible Society in Stuttgart have been trying to produce a definitive reading for more than 3000 disputed passages in the old testament"

"...A person's life was at stake even to hint that so much as a single verse of the Old Testament.. has been lifted from some alien tradition.

The Bible was proclaimed to be the "Word of God" and God clearly does not need to consult any secondary sources."

"The Churches will have to realize that not every word of the Bible was necessarily declared by the Almighty..."

అంటే దీని అర్థం:-

"బైబుల్" అనేది ఒక్క గ్రంథం కాదు (అందరూ అనుకునేట్టు) అది ఒక "లైబ్రరీ" అంటే అనేక గ్రంథాల "సంకలనం" Anthology. అనేక కాలాలలో అనేక రచయితల, అనేక శైలుల అనేక రకాల గాధలు, పొడుపు కథలూ, పాటలు (Psalms) "సామ"ములు. నీతి గాథల కలగలుపు "కలగూర గంప" - అదే ఈ నాగి మనం "ఒకే గ్రంథం"గా నమ్మే బైబుల్ యొక్క అసలు స్వరూపం!!!

క్రిస్టియనులు గుర్తించాల్సిన సత్యం-ఈ గ్రంథ సంకలనం (Bible) లోని ప్రతి మాటా అవశ్య దేవునియే నోట నుంచి వచ్చిన "మాట" కానక్కరలేదు!! ఒకానొకప్పుడు గతంలో "బైబుల్"లోని మాటను శంకించిన పాపానికి ఆ వ్యక్తి ప్రాణాలకే మోసం వచ్చేది!

కాని ఈ నాటి బైబుల్ పరిశోధన తెలియచేసే యదార్థ సత్యం- ఇలా వుంది!

గత 1960లో ప్రొఫెసర్ సర్ పైన్స్, హీబ్రూ యూనివర్సిటీ వారు తెలిపిన పురాతన క్రిష్టియన్ గ్రంధ పాఠంలోని 'ఖండిక'లు జీసస్ బోధనలంటూ (ప్రచురించిన గ్రంధానికి... అసలు మూలం పత్తాయే దొరకలేదు? అలానే 1946లో దొరికిన "కాప్టిక్" లిపిలోని సెయింట్ తామస్ "సువార్త" - 'గ్నాస్టిక్' "సువార్త" లోనిది... బైబుల్ పరిశోదకులలో పెద్ద కలకలం రేపింది!

ఈనాటి పరిస్థితి ఏమిటంటే 1977 నుంచీ - 5 దేశాల బైబుల్ పండితులూ, పరిశోధకులూ- "అంతర్జాతీయ బైబుల్ సొసైటీ" (International Bible Society) ఆధ్వర్యంలో జర్మనీలోని "స్టుట్‌గాడ్" (Stuttgart) లో కూర్చుని తలలు పగలగొట్టుకుని యోచిస్తున్నా బైబుల్‌లోనివని చెప్పబడే 3000ల "అనుమానాస్పద" వాక్యాలు ప్రిక్షిప్తాలా అసలు బైబుల్‌లోనివా? అని తేల్చలేక-అసలు బైబుల్ యొక్క స్వరూపాన్ని పట్టుకునేందుకు కొట్టుకు ఛస్తున్నారు! ఐనా "పాత నిబంధనలు"లోని 3000-ల వాక్యాలకు-అసలవి బైబుల్లోనివా కావా? తేలటం లేదు! ఇదీ "బైబుల్' ' "గ్రంధం" గా ఈనాటి పరిస్థితి-బైబుల్ ఒక్క గ్రంధం కాదు-ఒక్క "లైబ్రరీ" (Library) అన్న "క్రైస్తవ విజ్ఞాన సర్వస్వం" (Encyclopedia of Christianity) యొక్క "బైబుల్" అంటే నిర్వచనం ఒక్క గ్రంధం కాదు అన్న నిర్వచనానికి 150 ఏళ్ల వెనకటి చరిత్ర నేపధ్యం!

- ఇదీ బైబుల్ పరిశోధన పరిస్థితి!



25

# బైబుల్‌లో జలప్రళయ గాథ

బైబుల్‌లో 'సృష్టిక్రమం' (Genesis) అధ్యాయాల(6-7)లో దేవుడు జలప్రళయాన్ని ఎలా పుట్టించాడో ఈ క్రిందివిధంగా వర్ణించబడివున్నది.

"And God saw that the wickedness of man was great in the earth, and that every imagination of the thoughts of his heart was only evil ..."

– Genesis (6-5).

"And it repented the Lord that he had made man on the earth, and it grieved him in his heart. (6...6).

"And God said unto Noah, "The end of all flesh is come before me; for the earth is filled with violence through them; and behold, I will destroy them with the earth."

– Genesis (6..13)

అంటే అర్థం : దేవుడు మానవుని దుష్టత్వాన్ని గమనించి మనిషి యొక్క ప్రతియొక్క ఆలోచనా, చెడుగాను, అతని గుండె పాపముతోనూ, దుర్మార్గంతోనూ నిండి ఉండటం చూసి పశ్చాత్తాపం చెందాడు. (5)

దానితో భగవంతుడు మానవజాతిని నశింపచేస్తానని సంకల్పించాడు. మనిషిని జంతువులను, పాకే జీవులను, ఎగిరే పక్షులను కూడా నశింప చెస్తానని, వాటిని సృష్టించిన నాకు పరితాపముగా ఉన్నది అనుకున్నాడు (ట!) (6)

(Noah) 'నోవా' సన్మార్గములో నడిచి దేవుని మార్గాన్ని అనుసరించడం వల్ల ఆయన దయను పొందాడు.

"అప్పుడు దేవుడు నోవాతో ఇలా అన్నాడు "అన్ని జీవుల వినాశము నా ముందుకు వచ్చి ఉన్నది, భూమి అంతా దుర్మార్గముతో క్రూరత్వముతో నిండివున్నది. వీరినందరినీ నాశనం చేస్తాను" (13)"

ఈ విధమైన వాక్యాలతో మొదలైన "నోవా" (Noah) కథ ఈనాడు బైబుల్‌లోని జెనిసిస్ (Genesis) గ్రంథంలో - 6 నుంచి మొదలై 10 అధ్యాయాలలో వర్ణించబడివుంది!

ఇంకా దేవుడిలా అన్నాడు - "make the an ark of Gopher wood;.... and shalt pitch it within and without with pitches"

".... The length of the ark shall be three hundred cubits, the breadth of it, fifty cubits and the height of it thirty cubits."

".... to every clean beast thou shalt take to thee by seven, the male and his female; and of beasts that are not clean by two, the male and his female...

"For yet seven days, .. I will cause it to rain on earth forty days and forty nights...."

"... and the rain was up on earth, forty days and forty nights."

– Genesis (7.. 2&12)

"Fifteen cubits upwards did the water prevail...

..."and all flesh died, that moved upon the earth..."

..."And every living substance was destroyed..."

..."And the water preailed upon the earth and hundred and fifty days" (7,24)

"And God remembered Naoh... God made a wind to the earth and water assuaged." (8-1)

పై విధంగా దేవుడు ప్రళయాన్ని నిశ్చయించిన తరువాత 'నోవా' ను ఒక నావ కట్టమని తారుతో పూత పూయమని చెప్పి దాని కొలతలు **300 × 50 × 30 క్యూబిట్లుగా నిర్మించమన్నాడట - మూడు అంతస్తులుగా! (6... 14×16)**

ఆ తరువాత దేవుడు ప్రతి జంతువుయొక్కా ఒక్కొక్క జంటని నావలోకి తీసుకొని రక్షించి ఉంచమని ఆజ్ఞాపించాడు. ఆపైన 40 రాత్రులూ పగళ్లూ వర్షం కురిసిందట! (7..4) నోవా తన కుమారుడితో భార్యతో నావనెక్కి ఆ జలప్రళయంపై తేలుతూ 40 రోజులు గడిపాడు! ఆ జలం 15 క్యూబిట్లు ఎత్తు పెరిగాయట (7..20)

దానితో అన్ని జీవులూ నశించాయి! మనిషీ, జంతువూ, పాకేదీ, అన్నీ నశింపచేయబడ్డాయి! ఆతరువాత 150 రోజులు ఆ వరద (Flood) జలం నిలచివున్నదట! ఆతరువాత భగవంతునికి 'నోవా' ఉన్నట్లు జ్ఞాపకం వచ్చి వర్షాన్ని ఆపుచేశాడట! (8..1).

7వ నెలలో 17వ రోజున అరారత్ కొండపై నావను ఆపు చేసేడు. ప్రళయ జలాలు తగ్గిపోసాగినవి. 10వ నెల మొదటి మాసంలో పర్వతాల శిఖరాలు కనిపించాయి. 40 రోజుల చివర 'నోవా' నావ కిటికీలు తెరిచి చూసి ఒక పావురమును బైటికి పంపి వరద తగ్గడం గ్రహించాడు. నోవా యొక్క 600వ సంవత్సరంలో ఈ జలప్రళయం జరిగింది. 601 సంవత్సర మొదటి నెల, మొదటి రోజున నోవా గట్టి నేలను కనుగొని దేవుని ఆదేశం ప్రకారం నేలపై దిగటమూ, ఆప్రకారంగానే, మిగతా జీవరాసులుకూడా నావనుంచి బైటపడి జలప్రళయం నుంచి రక్షించబడ్డాయట!

– Genesis (8 4, 5, 6, 13)

"And the Ark rested in the seventh month, on the seventeenth day of the upon the mountains of Ararat .... (8..4)

"... in the tenth mounth, of the first day of the month, were the tops of mountains, seen" (Genesis 8..5)

"And ıt came to pass at the end of forty days, that Noah opened the window of the ark.... .. and he sent forth a raven..."

"And it came to pass in the Six hundredth and first year, in the first year, ın the first month, the first day of the month, the water were dried up from off the earth. ."

- Genesıs (8,, 4, 5, 6, & 13)

పైవిధంగా 'పాత నిబంధనలు' (Old Testament) లోని 'జల ప్రళయ' గాథ మనకీనాడు బైబుల్‌లో కనిపిస్తోంది. సైన్సు దృష్టితో పరిశీలిస్తే ఈ జలప్రళయగాథలో కొన్ని విచిత్రాలు మనకి కనిపిస్తాయి.

**1. 40** - రోజులు వర్షంకురిస్తే ఆనీళ్లవల్లనే - భూమి యావత్తూ మునిగిపోతుందా?

**2.** జలం **15** క్యూబిట్ల ఎత్తు నీటిమట్టం పెరిగినంతనే భూమ్మీద పర్వతాలన్నీ ముణిగిపోతాయా? ఈనాటి ఎవరెస్టు శిఖరమే సుమారు **26** వేల అడుగుల ఎత్తుకు పైగా వున్నదికదా?

**3.** దేవుడు మనిషి యొక్క దుష్టత్వాన్ని చూసి పశ్చాత్తాపం చెంది, అతడిని నాశనం చేయాలనుకుంటే - ఏ పాపమూ ఎరుగని జంతువులూ, పక్షులూ ప్రాకే జీవరాసులూ మిగతా జీవులన్నిటినీ జలప్రళయంలో నాశనం చెయ్యాలా? ఒక్క మనిషిని మాత్రమే నిర్జీవుడిని చేయలేడా? ఆదము ఒక్కడికే ప్రాణవాయువు ఊది బ్రతికించినట్టే మానవజాతిని మాత్రమే నశింపజేయవచ్చు కదా? మిగతా జీవరాసులన్నిటినీ కూడా నశింపచేయాలా?

ఒకవేళ అలా చేయాలనుకుంటే దేముడు - 'నోవా' నావలోకి తిరిగి ప్రతి జీవరాశినీ ఒక్కొక్క జంటను ఎక్కించమని చెప్పి (మంచి జంతువులూ చెడువీ కూడా) మళ్లీ నావలో ఎందుకు రక్షించినట్లు ఎందుకు వర్ణిస్తున్నది?

ఇలా ప్రపంచమంతా మునిగిపోయే 'జలప్రళయం' వస్తే ఆ నీరు ఒక్క ఏడాదిలోనే ఇగిరి పోతుందా? - ఈనాటి వాతావరణ శాస్త్రం (climatology) ప్రకారం ఇది సంభవమా? ఒక్క నదికి వరదలు వస్తేనే ఆ వరదల నష్టం పంటలపై కొన్ని నెలలదాకా బాధిస్తుంది. కొన్ని పొలాలు రెండు మూడేళ్ల దాకా సేద్యానికి నిరుపయోగమౌతాయి కదా!

ఇలాంటివెన్నో తార్కిక దృష్టితో చూస్తే బైబుల్‌లోని "జల ప్రళయ" గాథ స్వతంత్రంగా చూసి, ప్రళయం జరుగుతూంటే వర్ణించింది కాదనీ - అది, ప్రాచీన బాబిలోనియా (Babylonia) లోని, మెసపోటేమియా, ఈజిప్టుదేశాల పురాణ గ్రంథం (Epic of Gilgamesh) నుంచి, కాపీ చెయ్యబడినదని విదేశాలలోని బైబుల్ పరిశోధకులు పరిశోధించి, కనుగొన్నారు. ఇప్పుడు "జలప్రళయ" గాథలు ప్రపంచంలో అన్ని మతాల గ్రంథాలలోనూ కనిపిస్తాయి! 'ఇది జరిగి ఎంత కాలం క్రితం జరిగి వుంటుంది?' - అని పరిశీలిస్తే ఇతర మతగ్రంథాల "జలప్రళయ" గాథలను 'తులనాత్మక పరిశీలన చేసిన విదేశీ 'యూనివర్సిటీ' లు కనుగొన్న ఆశ్చర్యాలు కొన్ని మనకిక్కడ బైబుల్ గురించి "జల ప్రళయ" గాథ యొక్క పుట్టు పూర్వోత్తరాల గురించీ ఏమి తెలుస్తుందో పరిశీలించి చూద్దాము.

## "బైబుల్"లోని - జలప్రళయ (Flood) గాధ! యొక్క చరిత్ర!

ఈ 'జలప్రళయం' జరిగి అంతకుముందు బైబుల్ ప్రకారం 'సృష్టి' జరిగిన కాలాన్ని క్రైస్తవ బిషప్ అషర్ (Bishop Usher) అనే, బైబుల్ పండితుడు వెనక్కి గణితం చేసి బైబుల్ ప్రకారం సృష్టి జరిగినది **4004** BC సెప్టెంబర్ **23** ఉదయం **9** గం।7లకు - అని నిర్ధారణచేశాడు!

అంటే **3000** BC ప్రాంతంలో బైబుల్ ప్రకారం "సృష్టి" జరిగినట్టు ఊహించవచ్చు! మన ప్రాచీన భారతీయ ఋషుల లెక్క ప్రకారం సరిగ్గా **3100** BC నాడే ఈ కలియుగం ఆరంభమై ఆ సమయంలో గొప్ప ప్రళంయ సంభవించి దానిలో ద్వారక పూర్తిగా మునిగిపోయిందని **'వ్యాసభారతం'లో** కూడా సాక్ష్యాధారాలు లభిస్తున్నాయి! అపుడు జరిగిన

జలప్రళయమే 'యూదు' జాతికి, పాత నిబంధనల రూపంలో నోవా కథగా రికార్డు కాబడిందా?

ఇంకొక ఆసక్తి కరమైన అంశం: ఈ 'జలప్రళయ' గాథ బైబుల్ పాత నిబంధనలలోని బేబిలోనియన్ (Babylonian) దేశం ప్రాచీన పురాణగాధల (Legends) నుండి హీబ్రూ భాసలోకి కాపీ చేయబడిందని చారిత్రక పరిశోధనలవల్ల బైబుల్ పండితులు ఇటీవలనే కనుగొన్నారు.

ఇదే గనుక నిజమైతే దీనియొక్క ప్రతిధ్వనివంటి గాధలే ఇతర మతాలలోకూడా లభిస్తున్నవా? అని, చూస్తే ఆసక్తికరమైన విషయాలెన్నో బైబుల్ పరిశోధనలో లభిస్తున్నాయి!

## "సుమేరియా ప్రళయ గాథ :"

సుమేరియన్, బేబిలోనియన్ పురాణంలో గ్జిసుత్రస్ (Xisuthrus) లేక కసిపిత్ర అనే మానవజాతి పితామహుడు పూర్వ జలప్రళయం సంభవించినప్పుడు ఒక పెద్ద 'నౌక' అయిదు స్టాడియాలు పొడుగూ, అంతే వెడల్పూ తనకు సెకరిటియన్ బంధువర్గంతో పాటు జంతువులు పక్షులనుకూడా రక్షించాడని ఈ నౌక ఆర్మేనియా సమీపంలో జోర్సిన్ పర్వతాలో కట్టి వేయబడి ప్రళయం అయిన తరువాత ఒడ్డుకు చేరుకున్నదట!

ఈ జలప్రళయం ఒక భయంకర జలపాతం నుంచి పంపు గొట్టంలా నీళ్లను చిమ్మి ఆకాశానికి సముద్రం ఎగదన్ని - అన్ని నదులూ సముద్రంవైపు నుంచి వెనక్కి నిగడదన్ని పొంగి వరదలై మిగతా జీవరాశి యావాత్తు మరణించారని ఆ దేశం గాధ చెబుతున్నది!

అలానే అస్సీరియన్ పురాణ గాధలలో ఉభారతూతూ (Ubaratutu) లేక ఖసిసత్ర (Khasi satra) అనే పేరుగల మూలపురుషుని కాలంలో సముద్రం ఉప్పెనలా పొంగి వచ్చిందని జలం పంపు గొట్టాలలాగా సర్వత్రా చిమ్మి జీవరాసులన్నీ మరణించాయని, చచ్చిన జంతువుల మనుష్యుల కళేబరాలు నీటిపైన, నాచులాగా తేలివున్నాయిని - ఈ జలప్రళయం ఆరు రోజులు ఆరు రాత్రులు ఏక ప్రళయంగా నిలిచిందని రాయబడి

ఉన్నది!

ఆ సమయంలో దేవుని అనుగ్రహంతో 600 క్యూబిట్ల పొడవు, గల 60 క్యూబిట్లు ఎత్తు అంతే వెడల్పూ ఉన్న ఒక పెద్ద నౌకను నిర్మించి అందులో 'ఉబారుతూతు' తన అనుచరులూ, రక్షింపబడ్డారని తెలుస్తోంది! ఈ ప్రళయం అనంతరం నిజార్ పర్వతం వద్దకు ఈ నావ చేరగానే ఖసిసత్ర ప్రజాపతి ఒక పావురాన్ని, ఒక నల్లని రాబిన్ పక్షిని బయటికి నేలను వెతకడానికి ఎగర వేశాడు! పావురం మాత్రం తిరిగి వచ్చింది! రాబిన్ పక్షి తిరిగిరాలేదు! ఇది సరిగ్గా ఇలాగే బైబుల్‌లో 'నోవా' కథలో కూడా రాసివుంది! ఇది ఎస్సీరియన్‌ల ప్రళయ గాథ!

## అస్సీరియా-'జలప్రళయ' గాథ :

ఇటీవలనే 'అసుర్' బనిపాల్ (Asshur - banipal) అతని వంశస్థులైన అస్సుర్ Assur అనే పేరుగల రాజులూ క్రీస్తుపూర్వం 3000 B.C. - 4000 B.C. ప్రాంతంలో పరిపాలించినట్టు తెలిపే వారి "మట్టి ఇటుకలు" (Clay tallets) లభించాయి!

ఇవి క్యూనిఫారం భాషలో (Cunelform Script) చెక్కబడి ఉన్నాయి! ఇందులో గ్రహాల నడకలు, జ్యోతిష గణితము, రాశి చక్రములోని అప్పటి గ్రహస్థితులు, ఇంకా ఒక మిలియన్ సంవత్సరాల వరకూ, రాబోయే గ్రహణాలూ పట్టికగా లభించాయి!

ఇది గొప్ప ఖగోళగణిత శాస్త్ర పండితులైన అస్సీరియన్ ఋషుల చేత గణితం చేయబడ్డ "జలప్రళయా" నికి ముందు 10 - మంది రాజులు కలిసి 432,000 సంవత్సరములు పరిపాలించారని ఈ కాలంలో ఏర్పడ్డ "జలప్రళయం"లో 'ఉత్నపిష్టిం' (Utnao pishtim) అనే మూలపురుషుడూ, అతడి అనుచరులూ, జీవరాసులూ రక్షింపబడ్డారని ఆ నౌకలో రక్షించబడ్డవారు జీవరాశికి విత్తనముల వంటి వారని ("The Seed of Life on the Boat") అని వ్రాయబడివున్న ఈ జలప్రళయం ఆరు రోజులు ఆరు రాత్రులు నిరాఘాటంగా గడిచిందని, ప్రళయం అయిన తర్వాత భయంకరమైన నీరు జలపాతాలతో నిండి ఉన్నదని అంతకుముందున్న మానవజాతి

మట్టికొట్టుకు పోయారని (Mankind has gone back to mud) అని స్పష్టంగా రాయబడి వుంది!

ఈ 'జలప్రళయ' గాధలో విశేసం ఇతర మతగ్రంథాలలో వలే లేకుండా స్పష్టమైన గ్రహగణితం ఆధారంగా ఈ జలప్రళయాలు ఎప్పుడు ఏర్పడతాయో అని "నాలుగు యుగాలు" గా విభాగం చేయబడి వ్రాయబడివున్నాయి! వృషభరాశిలో మొదటే, రాశిచక్రము 'ప్రారంభ-బిందువు' ఉండేదట!

అస్సీరియన్ల కాలంలోని (4100 B.C.) నాలుగుయుగాల ఈ కాలగణితం భారతీయ పురాణాలలోని చతుర్యుగాలను పోలి ఉన్నది! అందులో ఎస్సీరియన్ల (Assyrian King dynasties) రాజులు వంశం సరిగ్గా 432,000 - సంవత్సరాలు మన కలియుగం లెక్కతో సరిపోవడం పరమాశ్చర్యం!

దీని నుండే ఇంత పెద్ద లెక్కలు తగ్గించి హీబ్రూలు యూదులు వీరి గాధలనే, కాపీ చేస్తున్నారనీ - కాని, స్పష్టమైన గ్రహస్థితి వీరెవ్వరి మతగ్రంథాలలోనూ లభించలేదు! ఒక ఎస్సీరియన్, బాబిలోనియా వారి, "గిల్ గమేష్" (Epic of Gilgamesh) పురాణం అని ఇంగ్లీష్‌లోకి, అనువాదంచేయబడ్డది!

## 'పర్షియన్ల'- జలప్రళయ గాథ:-

పర్షియాదేశ చరిత్రలో వారిపురాణ గ్రంథంలో "ఈమా" (Yima) అనే వారి మూలపురుషుడు జలప్రళయం వల్ల ప్రపంచం అంతటా నశించగా "భూకంపాలు, సముద్రపు ఉప్పెనలు, పర్వతాలలోంచి మంటలూ'' (Earth quakes, floods and fires destroyed the World) జరిగిన "ప్రళయము" అని అతి సహజంగా వర్ణించబడి ఉంది!

ఎందుకంటే భూగోళంలో పెద్ద పెద్ద మార్పులు జరిగినపుడు అగ్ని పర్వతాలు బద్దలై మంటలు వస్తాయి! ఈ అగ్ని పర్వతాలు సముద్రం అడుగున, నిద్రిస్తూవుండి ఒక్కసారిగా పేలితే సముద్రంలోంచి మంటలు వస్తాయి! అపుడు భూమి గడగడలాడే సమయంలో "ధృవాల"-మంచు

కరిగి జలప్రళయం సంభవించి ఉండటాన్నిబట్టి ఇది యదార్థమైన వర్ణనగా బైబుల్ పరిశోధకులు గ్రహిస్తున్నారు! ఈ జలప్రళయంలో ఒక కోట లేక వర (Vara) (భూగర్భంలో బిలద్వారం) ద్వారా మూయబడి 'నేలమాళిగ' వంటి కట్టడంలో గుర్రాలు జంతువులు వెయ్యేసి దంపతుల జంటలు పక్షులూ రక్షించబడ్డారు! ఈ భవంతి మూడు (3) అంతస్థులు లోతూ కలిగి విశాలమై వీధులు రస్తాలు ఉండేవనీ. ఈ ప్రళయంనుండి "ఈమా" (Yima) అతని అనుచరునులూ బయటిపడి జగత్తును తిరిగి ప్రజలతో నింపి వేశారని రాయబడింది - పర్షియన్ల జలప్రళయ గాధలో!

## 'వెల్ష్' (Welsh) జాతి - 'జలప్రళయ' గాథ :-

అలాగే వెల్ష్ జాతివారి ప్రాచీనగాధ (Welsh Legend) లో "ద్వైఫాన్' ' (Dwyfan) అతని భార్య "ద్వైపాక్" (Dwyfach) అనే దంపతులు మానవజాతి మూల పురుషులు జీవిస్తున్న ఆదికాలంలో బ్రిటిష్ దీవికి జరిగిన "మూడవ" జలప్రళయంగా వచ్చిందనీ, లింటియాన్ (Lynlion) అగ్ని పర్వతాలు బద్దలై పర్వతాలవంటి ఎత్తుగల అలలు లేచి "జలప్రళయం' ' జరిగిందని అందులో నుంచి ద్వైఫాన్ అతడి భార్య ఒక నౌకలో - జాయింట్లులేని నావలో - రక్షింపబడి తిరిగి బ్రిటిష్ ద్వీపాన్ని జనవంతం చేశారనీ కూడా రాయబడింది!

## 'నార్స్' (Norse) జాతి 'జలప్రళయ' గాథ :-

అలాగే నార్స్ (Norse) జాతి ఎట్టా (Etta) అనే ప్రాచీన గాధలో గొప్ప ప్రళయం జరిగిందని - అది జలప్రళయంతో మంటలు (Flood and Fires) కలిసి ప్రపంచాన్ని గడగడలాడించాయని వున్నది!

అందులో "భూమి అంతా చీకటితో అంధకారమై జలసర్పాలు విజృభించి సముద్రం ఉప్పొంగింది. పర్వతాలు కూలి శిఖరాలు ఢీకొన్నాయి! నేల సముద్రంలోకి కలిసిపోయింది! జలం ఆకాశం ఎత్తు లేచింది! వెలుగుతున్న ఉల్కాలు ఆకాశంనుండి రాలిపడ్డాయి! అగ్నిజ్వాలలు మంటగా నింగి కెగసింది...."

- అంటూ నార్స్ (Norse) జాతి వారి 'పురాణ గ్రంథం'లోని

"జలప్రళయ"గాథ వర్ణించాడు! అందులోనూ నార్స్ జాతి మూలపురుషుడు బెర్గాల్మర్ (Bergalmer) అతడి భార్యా ఒక పెద్ద నౌకలో కొందరు జీవరాసులతో రక్షింపబడ్డారనీ జలప్రళయం తగ్గాక వృద్ధిపొంది, వారి సంతానమే ప్రపంచమంతటా వ్యాపించింది అనీ వర్ణించబడి వున్నది!

## 'లిథువేలియన్ల' - జలప్రళయ గాథ :-

అలాగే ప్రాచీన రష్యాలోని లిథువేనియా మత గ్రంథాలలో (Lithuanian tradition) విపరీతమైన పెనుగాలి వీచి సముద్రాలు పొంగే 'జలప్రళయం' 12 రాత్రులు 12 పగళ్లు ఎడతెగకుండా ప్రపంచాన్ని ముంచెత్తాయని పెద్ద పర్వథ శిఖరాలుకూడా మునిగిపోయాయనీ ఆ సమయంలో సృష్టికర్త పెద్ద సైజులో పెంపుగల కాయలను పంపగా, భక్షిస్తూ దానిని పెంకుపుల్లగా కింద వదలగా దానిలో దిగి బ్రతికి బయట పడ్డవారు దానినే నేలగా చేసుకొని ప్రళయం కాగానే పాడినేలపైకి దిగారనీ వర్ణించబడింది.

## ఐర్లండు - జలప్రళయ గాథ :-

అలాగే ఐర్లండు జాతివారిది బ్రిటన్‌వారి సంస్కృతి కంటే అతి ప్రాచీనమైనది! క్రిస్టియానిటీ కంటే చాలా పాత సంప్రదాయంగల మతగ్రంథాలు 'ఐరిష్' జాతి జలప్రళయ గాథను వర్ణించాయి! 'భిజైరా' రాణి పాలించేకాలంలో ఈ -"జలప్రళయం" జరిగిందని ఒక నౌకలో బ్రతికి బయటపడ్డ ప్రాచీన ఐరిస్ జాతి (7 1/2) సంవత్సరాల వరకూ అలా సముద్రంపై ప్రయాణిస్తూనే వున్నారని వారు తిరిగి ఐర్లండు చేరనేలేదని వర్ణిస్తోంది! ఐర్లండు ఈ ప్రళయం తర్వాత 200 సంవత్సరములు వరకూ నిర్మానుషంగా ఉందని. తర్వాత క్రమంగా ప్రపంచం అంతటిలో మానవజాతి ఏర్పడిందని వర్ణించబడింది.

## చైనావారి - ప్రళయ-గాథ :-

ప్రాచీన చైనా క్రీస్తుపూర్వం 5000 (B.C.) నాటినుంచీ ప్రచారంలోవున్న పురాణ గాథలో 'యూవా' అతడితో ఇంకా ఏడుగురు "సప్త మహర్షుల" వంటి వారు 'ఫాలీ' అనే మానవజాతి మూల పురుషుడు అతడి

భార్య, పిల్లలూ ఒక నౌకలో జలప్రళయంనుంచి రక్షించబడిన గాథ - వర్ణించబడి వున్నది! అప్పుడు ప్రళయం, భూకంపాలు జలప్రళయంతో ఆరంభమై ఇలా వున్నది.

"ఆకాశానికి మూల స్థంభాలే విరిగిపడ్డాయి! భూమి పునాదులే చెడి కదలిపోయింది! సముద్రాలు కట్టలు తెంచుకొని - దేశాలను ముంచి వేశాయి! జగత్తు యొక్క 'పరిపాలనా వ్యవస్థ'యే పూర్తిగా గతి తప్పింది! (The System of the Universe is totally destroyed"- అని వర్ణించిన జలప్రళయం కాస్త సైంటిఫిక్‌గా యదార్థమైన భూగర్భశాస్త్రం యొక్క విజ్ఞానానికి దగ్గరగా వుంది! కేవలం ఏడు రోజులలో జరిగిన జలప్రళయంలాగా వర్ణించబడి లేదు!

## 'అజ్-టిక్' (Aztec, Toltec) గాథ :-

అలాగే అజ్‌టిక్ జాతివారి (Azatec toltec legends) ప్రాచీన పురాణ గాథలో గొప్ప జలప్రళయం జరిగి భూమి అంతా మునిగిపోయిందనీ, అంతేగాక, 52 సంవత్సరాలు ఈ 'జలప్రళయం' అలాగే నిలిచివుందనీ రాసివుంది.

అప్పుడీ మానవజాతి మూలపురుషుడు, అతని భార్య సంతతీ, మరికొన్ని జంతువులూ ఒక నౌకలో రక్షించబడ్డారిన ఒక సైకస్ చెట్టును చెక్కలుగా కోసి నిర్మించిన నావలో ఈ "జలప్రళయం" నుండి 'కోల్‌హకల్' పర్వతం (Colhuacal Mountain) వద్ద "తియోసి పాట్లి' ' ముందుగా కొన్ని పక్షులను డేగలను అవి చచ్చిన కళేబరాలను చీల్చి తెచ్చిన మాంసంచూసి నౌకనుండి దిగలేదు! చివరికి ఒక హమింగ్ పక్షి (Humming bird) ముక్కుతో తెచ్చిన ఆకులు చూసి, తియోసిపాట్లి ప్రళయంచివర తిరిగి భూమిని సమీపించి తన జాతిని విస్తరింపచేసాడనీ తెలుస్తోంది! ఇవి సరిగ్గా టోల్టెక్ జాతి వారి చిచినెక్ (Chechenec) పురాణాలలో వర్ణించిన నాల్గవ 'ప్రపంచ ప్రళయం'గా వర్ణించబడింది!

వీరి 'యుగాల'కు జలప్రళయ యుగం (Water Age) అగ్నియుగం (Age of Fire) అని సూర్యుని గతిని బట్టి ఈ జలప్రళయ కాలంలో

ఇవి ఎపుడెపుడు జరిగిందీ ఖగోళ శాస్త్రీయంగా (Astronomical cycles) వర్ణించాడు.

ఇలాగే మాయా (Maya) జ్యాతివారు పెద్ద పెద్ద పిరమిడ్లు నిర్మించి దేవతలు భూమిమీదే వచ్చే 'దేవతా' యుగం 5000 సంవత్సరాలు తర్వాత రాగలదని గణితంచేసి వారికి కలియుగం వంటి కాలమానం 3100 (B.C.) లోనే ప్రారంభించిందని వారిలో "జలప్రళయగాథ" కూడా ఇలాగే వర్ణించబడింది!

ఇంకా, ఇతర జాతులయొక్క జలప్రళయ వర్ణనకూడా సంగ్రహంగా ఈ అధ్యాయం చివర ఇచ్చిన పట్టికలో చూపించాను.

ఇంతవరకూ మనం గమనించిన పట్టికలో - ఎవరికైనా సరే విస్పష్టంగా - **ఎలాంటి సందేహమూ లేకుండా తెలిసే విషయం** బైబుల్‌లోని "జలప్రళయ గాథ" మోసెస్ (Moses) ప్రవక్త కాలం అంటే సుమారు **1400-1300** B.C. ప్రాంతం కంటే - ప్రాచీనమైనది కాదన్న సంగతి.

ఎందుకంటే, మోసెస్ తన బాల్యమూ, యవ్వనమూ గడిపిన ఈజిప్టులోని మతగ్రంథాల నుంచే, ఇంకా అంతకు పూర్వములైన ఛాల్డియన్, అస్సీరియస్ బాబిలోనియన్ (Babylonian) జాతుల పురాణాలలో "జలప్రళయం" గాథ నుంచే, యూదులు తమ మతగ్రంథం ఏర్పడినకాలంలో ఇది కాపీ చెయ్యబడినది - ఈనాటి బాబిలోనియన్, అస్సీరియన్ ప్రాచీన శిలాఫలకాలు మట్టి ఇటుకలు క్యూనిఫారం (Cuneiform) శాసనాలవల్లా, ఇటీవల లభించిన పురావస్తు త్రవ్వకాలలోని అంశాలూ ఋజువు చేస్తున్నాయి!

ఈ బాబిలోనియన్ (Babylonian) జాతివారి గ్రంథాలు - ఇప్పటి చారిత్రకులకు రూఢీ అయిన నిర్ణయం ప్రకారం - యూదులు (Jews) ఒక జాతిగా ఏర్పడటానికంటే ముందే - కొన్ని వేల సంవ్సరాల నాటి గ్రంథాలివి!

ఇలా నిర్ణయించడానికి కారణమేమంటే ఆ శిలాఫలకాలలో లభించిన గ్రహాల గణితాలు, నక్షత్ర, గ్రహణ, ఖగోళ గణిత వివరాలూ ఆశ్చర్యంగా ఋజువు చేస్తున్నాయి.

బెరోసస్ (Berosus) అనే యువకుడు చరిత్రకారుడు బాబిలోనియన్

మతగ్రంథాలలోని జలప్రళయ వర్ణనతో పాటు - ఆ పురాణాలలో ఇచ్చిన రాజులపేర్లు కూడా స్పష్టంగా రాశాడు. దీనితో ప్రళయానికి ముందున (Anti Deluvian Kings) పరిపాలించిన **10**మంది రాజులూ కలిసి **4,32,000** సంవత్సరాలని బెరోసస్ స్పష్టంగా పేర్కొన్నాడు.

ఇదే, పరమాశ్చర్యమైన వింత - ఎందుకంటే సరిగ్గా ఇదే సంఖ్య సంస్కృత మహాభారతంలో, విష్ణుపురాణంలో, వేదంలో "ప్రళయము", "కలియుగ మహాయుగముల" సంఖ్యలతో ఈ 'అంకెలు' **432,000** సరిగ్గా సరిపోతున్నది!! దీనిని బట్టి, ఇంకొక అంశం కూడా మహావిచిత్రపు పోలికలతో కనిపిస్తున్నది.

అదేమిటంటే - మనదేశపు హిందువుల రామాయణంలోని రాజుల పరిపాలనా కాలం పదివేల **(10,000)** సంవత్సరాలు దశరథుడి పాలన.... సంవత్సరాలు! అంటే రావణుని కాలం నమ్మశక్యంకానంత పెద్దసంఖ్యలో వాల్మీకి ఇచ్చివున్నారు. ఇది కేవలం హిందువుల అసందర్భపు అభూతకల్పన అనుకునేటంతలోకే - సరిగ్గా ఈ ఛాల్టియన్, అస్సీరియన్ రాజుల పట్టికలో కూడా ఒక్కోరాజు పరిపాలనాకాలం **28** వేల **(28,000)** సంవత్సరాలనుండి ఒక్కోరాజు పరిపాలించినట్లు బెరోసస్ (Berosus) ఇచ్చిన "రాజుల పరిపాలనా కాలం" చూస్తే తెలుస్తుంది.

ఇంతే అసందర్భంగా కనిపించే ఈజిప్టు చరిత్రలోని ప్రాచీన 'ఫారో' (Pharoh) మొదటివంశం (First Dynasty), రెండవ వంశం (Second Dynasty), రాజుల చరిత్రపట్టికను మానిథోస్(Manithos) తయారు చేశాడు. అందులోకూడా ఒక్కోరాజు పదివేల **(10,000)** నుంచి ముప్పదివేల **(30,000)** సంవత్సరాల దాకా పరిపాలించారని వ్రాశాడు!!!

కాబట్టి ఇటు అస్సీరియన్లు, ఇటు బాబిలోయన్లు, అటు ఈజిప్టియన్లు రామాయణం పురాణాలలోని "పూర్వయుగ రాజుల పరిపాలనాకాలం"లోనే విపరీతమైన సంఖ్యలతో ఏకగ్రీవంగా ఒకే పద్ధతిలో కనిపిస్తున్నాయి. కాబట్టి ఈ సంస్కృతులన్నీ ఒకే ప్రాచీన చరిత్ర - **గణితంమీద** ఆధారపడ్డ విచిత్ర రహస్యంఏదో గూడుకట్టుకొనివున్నది. దానిని ఆక్స్‌ఫర్డ్ (Oxford) పారిస్, బెర్లిన్ యూనివర్సిటీలలోని పరిశోధకులు ఈ "వేల సంవత్సరాలు

పరిపాలించిన రాజుల వింత" సమస్యను బేధించాలని విశ్వప్రయత్నం చేసి ఇంకా పరిశోధనలు సాగిస్తున్నారు.

పై ఛాల్డియన్ పురాణాలలోని అసాధారణమైన సంఖ్యలకూ వేదంలోని 'ప్రళయం' "సృష్టి" సంఖ్యలకూవున్న పోలిక యాధృచ్ఛికంగా ఎవరికైనా అనిపిస్తే ఇంకో ఆశ్చర్యకరమైన సత్యాన్ని వేదపరిశోధకులు వెలికి తీశారు.

అదేమిటంటే, "అధర్వణ వేదం"లో వర్ణించిన కొందరు దేవతలపేర్లూ గాధలు సరిగ్గా అదే పేర్లతో "ఛాల్డియన్" (Chaldean)ల పురాణాలలోని పేర్లతో యదాతధంగా సరిపోతూ లభిస్తున్నాయని లోకమాన్య బాలగంగాధర తిలక్ పండితుని ఈ క్రింది వాఖ్యాలే సాక్ష్యం!

"The Bible often refers to Chaldea and Babylonia. But no one ever dreamt that the account of Creation and Deluge in the Old Testment could have been, in the main, borrowed by the Hebrew priests from Chaldean sources.

A great sensation was therefore caused in Europe when the Chaldean cuneifrom tablets of the Creatuion legend were discovered, their translation published and the Hebrew word "Tehom", which is translated as "deep" or "Water" in the first verses of Genesis, Chpater I, was found to be no other than Assyrian "Tamtu" or the Chaldean "Tiamat"... taken as established, that the Biblical stories of Creation and Deluge... .. are all of Chaldean origin...

But, the matter does not really end at this point. "Jehova" is undoubtedly the same word as the Chaldean "Yahve".. and here we derive great help from the Vedic literature. The word "Yahu" (Zend), "Yazu", "Yahva", Yahvati" and the feminine forms of "Yahvi", and "Yahvati" - occur several times in Rig Veda;...

the word "Yaha" means water; while the adjective Yahva means great. "Yahwa" in this sense is applied in Rigveda to Soma

(R.v.IX75.1), Agni (R.V.III. 1 12)... is there addressed as "O Yahava} you are the sacrificer of the gods"

.... It is not therefore unreasonable to conclude that `Yahava' was originally a Vedic word, and though Moses may have borrowed it from the Chaldeans..."

I Have shown above that the word "Timat" occurs in the Atharva Veda..."

- (See

... "Vedic Chronology and Vedanga Jyotisha" - by Bal Gangadhar Tilak. Ch. Chaldean and Indian Vedas. (p.p 136-139)

ఏతావాతా, ఈ జలప్రళయం లెక్కలు తేల్చేదొక్కటే - బైబుల్‌లోని కాలమానం ప్రకారం ఈ జలప్రళయం రెండు వేల B.C. కి ముందు జరిగినట్లు లెక్కించిన క్రైస్తవ ఆర్చిబిషప్ అషర్ (Archi Bishop USher) లెక్కలన్నీ - అతి నవీనము, ప్రాచీన జాతుల జలప్రళయపు లెక్కల వేల ఏళ్లకంటే ఆధునికము.

'ఇందులో ఏది సత్యం?' - అని ఎవరికైనా సందేహం వస్తే బిషప్ ఉషర్ గణితం చేసిన 'సృష్టిప్రారంభం' **4004** అన్నది భూగర్భ శాస్త్ర పరిశోధనలోనే - మిలియన్ల సంవత్సరాల ప్రాచీనత గల శిలాజములు **()**, చేపలు, సరీసృపాలు **()**లు ఎంతో ప్రాచీనత కలిగి ఉండటమే - ప్రాచీన పురాణాలలోని లెక్కలు జలప్రళయగాధ కాలాన్ని సైన్సు లెక్కలతో సరిపోతున్నదని ఇంచుమించుగా స్పష్టం చేస్తున్నాయి.

ఎందుకంటే గడచిన హిమప్రళయం గత **50**వేలు, **500**వేలు సంవత్సరాల కాలం నాటిది! భారతంలో వర్ణించిన వైవస్వత మనువు జలప్రళయం బైబుల్‌ని బిషప్పుల సృష్టికాలం కంటే కొన్ని వందరెట్లు ప్రాచీనత కలిగివుంది.

భూగర్భ చరిత్ర (Geology) ఎంత ప్రాచీనమో ఊహకైనా అందని క్రైస్తవ బిషప్పుల గణితమే ఈ బైబుల్‌లోని జలప్రళయంగాధకు ఆధారం

అని పరిశోధకులు ఘంటాపదంగా తేల్చివేశారు. దీనికి సంబంధించిన కొన్ని ప్రమాణ వాక్యాలతో ఈ అన్వేషణను ముగిద్దాం :

"In the Bible, the very opeining tells us that before the sons of God saw daughter of men, the latter lived from 365 to 969 years.

But when the "Lord God" saw the iniquities of mankind, He concluded to allow them atmost 120 years of life (Geneseis vi. 3).

To account for such violent oscillation in the human mortality - table is only possible by tracing this decision of "Lord God" to its origin. Such incongruities as we meet at every step in the Bible can only be attributed to the facts that the book of Genesis and the other books fo Moses were tampered with and remodelled by more than one author; and, that in their original state they were, with the exceptionof the external form of the allegories, faithful copies from Hindu sacred books."

"How servile was this Chaldean copy, may be seen in comparing the Hindu Chronology with that of Babylonians.

According to Manu, the antedeluvian dynasties of the Prajapatis reigned 4,320,000 human years, a whole divine age of the devas in short, or that length of time which invariably occurs between life on earth and the dissolution of that life, or Pralaya. The Chaldeams, in their turn, give precisely the same figures, minus one cipher, to wit: they make their 120 saros yield a total of 4,32,000 years.

"Lamach, is not Hebrew, but Greek. Lam-ach means Lam-the father, and Ou-Lom-Ach is the father of the age; or the fater of him (Noah) who inaugurates a new era or period of creation

after the pralaya of the deluge; Noah being the symbol of the New World, the Kingdom (Malchuth) of the Sephiroth; hence his fater, corresponding to the ninth Sephiroth; is the Foundation. Further more, both father and son answer to Aquarius and Pisces in the Zodiac."

"The Allegories which, in the Hindu calculation embrace the whole stupendous sweep of the Four ages, are cunningly made in the Mosaic books, through the obliging help of the Masorah, to cram into the small period of two milleniums and a half (2513)!

"The exoteric plan of the Bible was made to answer also to "four ages." Thus, They reckon the Golden Age from Adam to Abraham; the silver, from Abraham to David; copper, from David to the Captivity; thence forward iron. But the secret computation is quite different, and does not vary at all from the Zodiacal calculation of Brahmans. We are in the iron Age, or Kali - Yug, but began with Noah, the mythical ancestor of our race."

"G. Smith Adds in his "Chaldean Account" that Sargon. I. was Babylonian monarch who reigned in the city of Akkad about 1600 B.C. The name of Sargon signifies the right, true or legitimate king. This curious story is found on the fragments of tablets from Kouyunjik, and reads as follows :

1. Sargona, the powerful king, the king of Akkad am I.

2. My Mother was a princess, my father I did not know, a brother of father ruled over the country.

3. In the city of Azupirana, which is by the side of the river Euphrates.

4. My mother the princes,, conceived me; in difficulty she

brought me forth.

5. She placed me in an ark of rushes, whith bitumen my exit she sealed up.

6. She launched me in the iver which did not drown me.,

7 The river carried me to Akki, the water carrier it brought me

8 Akki, the water carrier, in tenderness of bowels lifted me, etc., erc."

... Isis unveiled" Ch. George Smith's views of Sargon. (p. 442-443) By Madam Blavatsky

# III

ఇంతవరకు బైబుల్‌లోని జలప్రళయ గాధతో ఇతర దేశాలలో వేరువేరు మతాలలో కనిపించే జలప్రళయగాధకు గల పోలికలను గమనించాము! కాని, ఆశ్చర్యం ఏమంటే ఈ గాధలన్నిటిలోనూ ఈ జలప్రళయం జరిగినది. 4000B C. లేక 45000 B.C కంటే ప్రాచీన కాలంగా లేదు! కాని, మహాభారతంలో విష్ణుపురాణంలోనూ, గత జలప్రళయం 'వైవస్వత మనువు' కాలంలో జరిగినట్లు చెప్పబడిన జలప్రళయగాధ అత్యంత ప్రాచీనమైందని - విదేశీ పరిశోధకులే అంగీకరించారు! ఫ్రెంచి రచయిత లూయీ జెకోలియో (Bible in India) అన్న తన గ్రంథంలో బైబుల్ పాత నిబంధనలలో జలప్రళయ గాధకు ఆధారం "భారతదేశంలోని ప్రాచీన పురాణాలని, మనువు జలప్రళయ గాధయే" అని చెబుతూ ఇంకా ఇలా వ్రాసాడు:-

"The Vedas of manu those monuments of the old Asiatic thought, existed farearlier than the diluvion period. This is an incontrovertible fact, having all the value of an historical truth.

ప్రఖ్యాత రష్యన్ యోగిని, పరిశోధకురాలు మేడమ్ బ్లావెట్స్కీ (Blavatsky) ఈ జల ప్రలయ గాధల గురించి ప్రపంచ జాతుల

చరిత్రలన్నీ పరిశోధించి తన ప్రపంచ ప్రఖ్యాత రచన 'ఐసిస్ - తెర తొలగింపు' (Isis Unveiled) లో ఈ విధంగా వ్రాస్తున్నది.

"The deluge noticed in the Bible in one of the Brahmans and it Berosus Fragment relates to the partial flood about 10,000 years B.C.

According to Bunsen and according ot Brahamanical computation of the Zodiac, also changed the whole face of central Asia. Thus the Babylonians and the Chaldeans might have learned of it from their mysterious descendents in the submerged localities (Akkadians). The jews and the tale from the later as they had every thing else...

... but Egyptions whose first settlers had evidently come from Southern India, had less reason to record Catalysm.. as the flood was limited to Central Asia.

... This fable which mentions the earliest Avatar, the "Matsya" relates to another yuga, than our own, that of the first appearing of animal life.

- H.P. Blavatsky'

Isis Unveild (p. 426-427).

అలానే ప్రఖ్యాత బైబుల్ పరిశోధకుడు అబ్బీ, డ్యూబాయిస్ (Abbee Debois) ఇలా రాస్తాడు:-

"I have never seen any thing in the history of the Egyptians and the Jews that would induce me to believe that either of these Nations, (Egyptians or any other on the face of the earth have been established earlier than the Hindus and particularly the Brahmans. So I can't be thus induced to believe that the later have drawn their rites from foreign nations On the contrary I infer that they have drwn them for an original source of their

own."

- Abbe Dubois

అని!

ఇతడు క్రైస్తవ మిషనరీగా 40 సంవత్సరాలు భారతదేశంలో జీవించినవాడు! తన అనుభవం దృష్ట్యా, తనకున్న పరిశోధన ఆధారంగా ఈజలప్రళయగాధను యూదులు, బాబిలోనియా నుండి వారు ఈజిప్టు నుండి, చాయాలియన్ జలప్రళయగాధను పాత నిబంధనల సృష్టిక్రమం గాధలతో పాటు సంగ్రహించారు! ఈజిప్టుకు దక్షిణ భారతదేశం నుండి వలస వెళ్లిన బ్రాహ్మణుల పురాణ గాధలే దానికి ఆధారం! భారతీయ వేదాలు, భారతదేశ చరిత్ర ఇతర జాతులకన్నా నిశ్చయంగా ఎంతో ప్రాచీనం! అందుకని వారీ జలప్రళయ గాధను తమ పురాతన మతగ్రంథాలని నుంచే (వేదాలు) స్వీకరించారని వ్రాస్తూ తనలా వ్రాయడానికి కారనం భారతదేశం లోని బ్రాహ్మణుల ఆత్మవిశ్వాసం, అభిమానం ఇతర జాతులలో అంటరని ఎడంగా ఉండేవీరి మనస్తత్త్వం పెరిగి ఉన్నందున వీరు ఇతర జాతల నుండి జలప్రళయ గాధల నుండి తమ మత సంబంధమైన ఆచారాలు గాని స్వీకరించే ప్రసక్తే లేదు" అంటాడు. ఈ క్రైస్తవ మిషనరీ అబ్బీడ్యుబాయ్ ఈ క్రింది వాక్యాలలో!

"Whoever knows anything of the spirit and character of the Brahmans, their stateliness, their pride and extreme vanity, their distance and sovereign contempt for everything that is foreign and of which they can not boast to have been the inventors, will agree with me that such a people cannot have consented to draw their customs and rules of conduct from an alien Country."

ఇంతకీ ఇతర ప్రాచీన జాతులైన బాబిలోనియా, అస్సీరియా లేక మెసపొటేనియా హిబ్రూ జాతులకూ, వారి మత గ్రంథాలకూ మూలమైన ఈ వేదాలలోని జలప్రళయ గాధలోని సంగ్రహంగా శతపధ బ్రాహ్మణంలో ఉదహరించబడింది. ఈ గాధను పూర్తి వివరాలతో వేదవ్యాస మహర్షి సంస్కృత మహాభారతంలో అరణ్య పర్వంలో మార్కండేయ మహర్షి అందినట్లు వివరించాడు.

| నెం. | మూలగ్రంథం | జాతి | రక్షింపబడ్డవారి పేరు |
|---|---|---|---|
| 1. | టాల్టెక్ వారి | టాల్టెక్ Toltec | ఏడుగురు మిత్రులు తమ భార్యతో |
| 2. | దక్షిణ అమెరికా లోని చిచ్బా అనే గిరిజనుల పురాతన గాధలో | చిచ్బా అనే ఆటవిక జాతి | బోచికా అతని భార్య (Bochica) |
| 3. | ఉత్తర అమెరికాలో హురాన్ అనే తెగకు చెందిన వారు గాధను అనుసరించి | భారతదేశానికి చెందిన ఒక మూలపురుషుడు అతని భార్య | భారతదేశానికి చెందిన మూల పురుషుడూ అతని భార్య కుటుంబ సహితంగా జంతువులతో |
| 4. | మండన్ అనే చెంచు తెగవారికి | నుమోజ్ మోచ్‌బాక్ అనే శ్వాతజాతీయుడు | నుమోచ్ మెచ్ బాహ్ (Numoch mochbah) |
| 5. | డకోటాసియోక్స్ అనే గిరిజనుల సంప్రదాయాన్ని | ఉత్తర అమెరికాలోని గిరిజనులగాధ ననుసరించి | ఒకరిద్దరు కుటుంబాలవారు రెండేసి చొప్పున ప్రతీ జంతువు రక్షించబడ్డాయి. |
| 6. | ఉత్తర అమెరికాలోని హోపీ తెగవారి గాధననుసరించి | హిపి తెగవారు (Hopic) North America | |
| 7. | దక్షిణ అమెరికాలోని గువారిని తమాండెరే అనే ఆటవిక తెగ | అతని భార్య | |

ప్రళయవర్ణన

ప్రపంచమంతా ఒక ముంపుకి గురయి పర్వతాల శిఖరాలు 15 కాక్సీటోల్ మోల్టీ (Caxtolomolatı) ల లోతుగల నీటిలో మునిగి పోయారు.

జలప్రళయం వచ్చి భూమి అంతా జలమయం అయిపోయింది.

ఒక పెద్ద జలప్రళయం ఉప్పెనలా నుమోచ్‌మోచ్‌బాక్ వారి రాజ్యాన్నం తటినీ ముంచెత్తింది.

ఈ తెగవారి భూభాగాన్నంతటిని జలం ముంచెత్తింది. కొన్ని వారాల పాటు జలప్రళయం జరిగింది.

పర్వతాల ఎత్తుకి మించిన కెరటాలు విరుచుకుపడి భూమిని ముంచెత్తాయి ఖండాలు నీట మునిగి సముద్రం భూమిపైకి మేట వేసింది.

ఒక ఎత్తైన తాడిచెట్టు మీదకెక్కి ప్రాణాలరచేత బెట్టుకొని ఉన్నారు కూటేళ్ళుతో సహా ఆ తాళ వృక్షం

ఎలా రక్షించబడ్డారు

ఒక పెద్ద సొరంగంలో దాక్కుని ప్రళయం ముగిసాక రక్షించబడ్డవారు సుమారు 104 సంవత్సరాలు "ద్రిమ్మరులై తిరిగారు. తరువాత మెక్సికో నగరం చేరుకొని ఒక ఎత్తైన టవర్‌ను భవిష్యత్‌లో రక్షణకోసం నిర్మించుకున్నారు.

ఒంటిపైనెక్కి ఎత్తైన శిఖరం వైపుకు దౌడు తీశారు. టెక్వాన్ డామా అనే ప్రాంతంలో ఒక పెద్ద రంధ్రం చేసి ఈ జలాలు పోయేందుకు ఏర్పాటు చేశాడు.

ప్రళయ ఉధృతం తగ్గాక పశ్చిమాన క్రొత్తగా భూమి కనబడింది. అక్కడ సొరంగాలలో దాక్కున్న ప్రజలు ఒక ఎలుకను బైటికి పంపి ప్రళయం తగ్గిందని నిర్ధారించుకున్నారు.

నుమోచ్ మోచ్ బాచ్ రక్షించ బడిన వారినందరిని వెలుపలికి చేర్చాడు ప్రళయం ముగిసాక వడమడి దిక్కున భూమి బయటపడింది.

పెద్దవృక్షాల చివారున తమనితాము బంధించుకున్నవి ప్రళయం ముగిశాక ఎత్తైన పర్వత శిఖరం పైన తేలారు బ్రతికున్నవారు పెద్ద పెద్ద నగరాల, భాగ్యవంతమైన ప్రవాసాలు, పట్టువోల్టా అనే విమానాలు అన్నీ నీటి అడుగున ఉండిపోయాయి. లోకపాలకుని అభిమతాన్ని అనుసరించి మసలుకొమ్మని లేదా తదుపరి మానవజాతి కూడా ముంపుకి గురౌతారని హెచ్చరించబడ్డారు. ప్రళయం ముగిసే సమయానికి ఒక దివ్య విహంగం రెక్కలు

| | | | |
|---|---|---|---|
| | సాంప్రదాయాన్నిను గురించి రక్షించబడ్డారు | | |
| 8. | 'ఇంకా' సాంప్రదాయాలు వారు (Inca Tradition) | ఒకే ఒక వ్యక్తి రక్షించబడ్డారు | ఇలామా అనే వ్యక్తి |
| 9. | బ్రెజిల్ దేశంలోని టస్కరోరా అనే చెంచుల విశ్వాసాన్ని అనుసరించి | తమాండెరే | |
| 10. | ఆర్కిటెక్ ఖండంలోని ఎస్కిమోల పురాతన గాధననుసరించి | కొద్దిమంది ఎస్కిమోలు వారి కుటుంబాలు | |
| 11. | అలాస్కాకు చెందిన ట్లింగిట్ (Tlingit) అనే ఆటవిక జాతివారి ప్రాచీన గాధననుసరించి | ట్లింగిట్ తెగకు చెందిన వారు | పెద్ద తెప్పలతో పొంగే జలాలపై లాఘవంగా |

పెకళించబడి నీటిపై తేలియాడింది. ఆకాశాన్నంటే ఎత్తుకి ప్రళయ జలాలు ఎగిసాయి.

అరవైరోజుల పాటు జలప్రళయం జరిగింది ఇలామా ఆకాశం వంక చూస్తూ సముద్రం ఉప్పొంగి భూమిని ముంచేస్తుందని చెప్పి తన యజమాని విల్కాటోటో పర్వత శిఖరాలపైకి తీసుకెళ్ళాడు అక్కడ పశువులు పక్షులు చేరుకున్నాయి.

టపటపటాడించటం వినబడింది. దాంతో ప్రళయం ముగిసి వరదనీరు తగ్గుముఖం పట్టింది.

అండీస్ పర్వత సానువులలో రక్షించబడిన ఇలామాలు జంతువులు తిరిగి భూమ్మీదకి తిరిగి వాటి జనాభా వృద్ధి అయింది.

పెనుతుఫాను ఆ తరువాత భీకరమైన మంచుగాలులు

పెద్ద జలప్రళయం

ఒక మహాయోధుడు తన కర్ణ కుండలాలను, సముద్రంపైకి బాణంతో పాటు ఎక్కుపెట్టి "గాలి ఇంకచాలు నిలు!" అని ఆదేశించాడట! దాంతో తుఫాను, ఈదురుగాలుల ఉధృతం అదుపులోకి వచ్చి ప్రళయం నెమ్మదించింది. ఒక పెద్ద పర్వత శిఖరాన్ని ఈ తెప్పల సాయంతో చేరుకున్నారు. ఆ పర్వత శిఖరంపైకి వెళ్ళి అక్కణ్ణుంచి చెట్లూ, మృగాలు, మనుష్యుల కొట్టుకు పోతూండటం గమనించారు. ప్రళయం ముగిశాక వారంతా భూమి నాలుగు దెసలకు వెళ్లారు.

## 'మనువు' - జలప్రళయం గాథ: -

గతంలో ఇప్పటి వైవస్వత మనువు ఒక రాజుగా దక్షిణ దేశాన్ని లేక చోళ దేశంలో పరిపాలిస్తుండేవాడు! అతడు ధర్మాత్ముడు నిత్యమూ భగవంతుడైన విష్ణుదేవుని భక్తితో కొలిచేవాడు! త్వరలోనే భగవానుని అనుగ్రహం కలిగింది. ఒకనాడు చెరువులో స్నానం చేసి సంధ్య వార్చుకుని సూర్యునికి గాయత్రీ మంత్రంతో అర్ఘ్య మిద్దామని దోసెట్లో నీళ్లు తీసుకొని చూడగా అందులో ఒక చేప పిల్ల కనబడింది! అది కదలాడుతూ రాజును తనని రక్షించమని కోరింది! అతడు గనుక రక్షిస్తే భవిష్యత్తులో తానే రక్షించగలనని పలికింది. దానికి ఆ రాజు ఆశ్చర్యపోయి ఆ చేపపిల్లను కమండలంలో భద్రంగా వేఇస ఉంచాడు. మరునాటికి అది పెరిగి చోటు చాలక మరింత విశాలం కోరింది! ఆ తరువాత చెరువులోనూ ఆపైన నదిలోనూ వేయగా క్రమంగా పెరిగిపోయింది. నది కూడా పట్టనంత పెద్దదైంది! ఈ చిత్రానికి విస్తుపోతూ ఆ చేపను విశాలమైన సముద్రంలో విడిచిపెట్టాడు. దానికా మహామత్స్యం సంతోషించి 'ఓరాజా! ఈనాటి మంచి 7 రోజులలోగా జలప్రళయం వస్తుంది! ఈప్రపంచమంతా మునిగిపోగలదు. నీవు నన్ను కాపాడినందుకు ఫలితంగా నేను నిన్ను రక్షించగలను. దీనికి ముందుగా ఒక నౌకను నిర్మించు! ధృడంగా చెక్కలతో నిర్మించి ఆ నావలోకి సప్త మహర్షులు, నీవూ నీ భార్య జీవరాసులలో ఒక్కొక్క జాతికి విత్తనం వంటి దంపతులు చేర్చి ఉంచు" అని చెప్పి సముద్రంలోకి ఈదుకుంటూ వెళ్లిపోయింది.

## ప్రళయం :-

ఏడవరోజు దిక్కులు చీకట్లు కమ్మగా పెద్ద భూకంపంతో అగ్ని పర్వతాలు బ్రద్దలై పెనుగాలి వీచి నిరంతర ధారాపాతంగా వర్షం కురిసి జలప్రళయం సంభవించింది! పర్వతాల వంటి కెరటాలకు సమస్త జీవరాసులూ నశించిపోయాయి! వైవస్వత మనువు నిర్మించిన నౌకలో సప్తమహర్షులతో పాటు తను కుటుంబ సమేతంగా ఎక్కి రక్షించబడ్డాడు.

## 'మహా - మత్స్యము' :-

అలాగ రాత్రీ పగలూ తేడా తెలియని అంధాకారంలో ప్రళయ

సముద్రుని కెరటలాపై అల్లాడుతున్న నౌక ముందర ఒక బ్రహ్మాండమైన తిమింగలం వంటి సొరచే మహామత్స్యం కనిపించింది. బంగారు వంటి కాంతితో వెలుగతో ఆ చేప మనువుతో ఇలా అంది :-

"ఓ రాజా! ఒక పెద్ద త్రాటితో ఈ నౌకను నా ముక్కు మీద వున్న "సొరముల్లు'కు బంధించు!" అని చెప్పగా ఆ రాజు అలాగే చేశాడు. అప్పుడా మత్స్యం బలంగా ఈదుకుంటూ నావను ఈడ్చుకుంటూ తీసుకుపోయి ఆ "జలప్రళయం" నుంచి అందరినీ కాపాడింది!

చివరకు ప్రళయం పూర్తికాగానే ఒక్క హిమవత్పర్వత శిఖరం వద్ద ఉన్న కైలాస శిఖరం ఎవరెస్టు మాత్రమే మిగిలి పైకి కనిసిస్తున్నాయి! అపుడా చేప మనువుతో నౌకను పర్వత శిఖరానికి కట్టి వేయమని ఆజ్ఞాపించగా అతడు అలానే బంధించాడు.

"అంతట ఆయన భక్తితో ప్రార్థించగా చేప సూర్యకాంతితో వెలిగిపోతూ విష్ణుదేవుని మత్స్యావతారంగా అతడి ముందు సాక్షాత్కరించింది. మనువు మత్స్యావతారం నుండి ఉపదేశంగా పొందిన వేదాలు, శాస్త్రాలు, పురాణాలు ఈ జలప్రళయ గాధతో పాటూ సప్త ఋషులు గ్రహించి తర్వాత మానవజాతికి ఉపదేశించారు!"

"ఈ జలప్రళయం అంతరించాక క్రమంగా భారతదేశమూ ఇతర ఖండాలు బయటపడ్డాయి. ఈ నాటికీ హిమపర్వత శిఖరం (నౌకను బంధించిన పర్వత శిఖరం) అని పిలుస్తారు. ఈ ప్రాచీన జలప్రళయానికి చిహ్నంగా" - అంటూ మార్కండేయ మహర్షి మనువు యొక్క జలప్రళయగాధను మహాభారతములో వివరించాడు.

ఇంతేకాదు వేదవ్యాస మహర్షి మనువుకు యిచ్చిన ఉపదేశంగా వేరే గ్రంధస్తం చేశాడు. అది 'మత్స్య పురాణం' అన్న పేరుతో ఈ నాటికీ సంస్కృతంలో లభిస్తున్నాయి. తిరుపతి దగ్గరగా ఉన్న "నాగాలాపురం" వద్ద ఇప్పటికీ "వేదనారాయణ స్వామి ఆలయం" - అని ఈ మత్స్యావతారం జలప్రళయం సమయంలో మనువును రక్షించిన విష్ణుమూర్తి పేరిట వేదాలయం అతి ప్రాచీనమైనదిగా ఉండేది!

దీనిని శ్రీకృష్ణదేవరాయల కాలంలో మహామంత్రి తిమ్మరుసు

పునర్నిర్మాణం చేశాడు. మనదేశంలో జలప్రళయ గాథ వేదాంగ జ్యోతిష మూల సిద్ధాంతగణితం ప్రకారం ఈ జలప్రళయం - గతించిన 'కృతయుగం' చివరలో అన్ని గ్రహాలూ మీనరాశి చివర రేవతీ నక్షత్రంలో సమకూడినపుడు జరిగిందని "సూర్య సిద్ధాంతం"లో

"అస్మిన్ కృతయుగ స్యాంతే
సర్వే మధ్యగతా గ్రహాః "

## సూర్య సిద్ధాంతం

అంటూ కొన్ని లక్షల సవంత్సరాలకి పూర్వం ఈ జలప్రళయం జరిగినట్టూ జ్యోతిష గణితం ఆధారంగా లెఖ్ఖలతో సహా ఇచ్చి వున్నారు!:

బాబిలోనియా మత గ్రంథాలలో బెరోసస్(Berosus) జలప్రళయం కాలానికి (Ante-Deluvian Kings) ముందుగా పరిపాలించిన పదిమంది రాజలుకాలం మొత్తం 4,32,000 సంవత్సరాలని "బాబిలో నియా" పురాణాలలో వ్రాశారని తెలియజేశారు!!!

ఇది బైబుల్‌లోని సృష్టికాలం అని బిషప్ అషర్(Usher) లెక్కించిన 4004 బి.సి కంటే ఎంతో ప్రాచీనమైంది!

ఈనాటి సైన్సులో భూగర్భ శాస్త్రం గణితం లెక్కల ప్రకారం చార్లెస్ డార్విన్ లెక్కల ప్రకారగత హిమప్రళయం కనీసం 807000 సంవత్సరాలకు పూర్వకాలం నాటిదని తేల్చాడు!

అలానే ప్లాటో తన రిపబ్లిక్ అనే గ్రంథంలో అట్లాంటిస్ అనే పురాతన భూఖండం జలప్రళయంలో మునిగిపోయిందని 500,000 సంవత్సరాల నడుమ ఈ ప్రళయం జరిగిందని తెలిపాడు. ఇదీ సైన్సు చెప్పే జలప్రళయాల చరిత్ర! ఇది "బిషప్-అషర్" చిల్లర లెఖ్కల కంటే బహు ప్రాచీనమై నదీ, 'భూగర్భ-శాస్త్రం' (Geology) లెఖ్కలతో సరిపోయే 'మనువు ప్రళయ కాలం'.



26

# ఇండియాలో జీసస్ - చారిత్రక సాక్ష్యాలు

అలా జీసస్ జెరూసలేమ్‌నుంచి కాలినడకన బయలుదేరి ఆనాటి ప్రాచీన సిల్కు వర్తకుల బాటను (Ancient Silk Path) అనుసరించి భారత దేశాన్ని చేరుకున్నట్టు దారిలో అనేకచోట్ల ఆయన కొద్దికాలం మకాం చేస్తూ స్థానిక ప్రజలకు బోధనలను ఇస్తూ తన ప్రవచనాలను వినిపిస్తూ, భారతదేశాన్ని చేరినట్టు, ప్రస్ఫుటమైన చారిత్రక ఆధారాలు లభించాయి!

బైబుల్ పరిశోధకులు జర్మనీనుండి, స్వీడన్‌నుంచీ ఇంకా ఇతర దేశాలనుంచి "జీసస్ యొక్క రహస్య జీవితాన్నీ" ఆయన ప్రయాణం చేసిన దేశాలను కనుగొనే చారిత్రక ఆధారాలకోసం గత 60 సంవత్సరాలో విశేషమైన శ్రమ తీసుకుని చాలాకాలం మన భారతదేశంలో వుండి ఇక్కడి ఉర్దూ, కాశ్మీరీ, హిందూస్థానీ, సంస్కృతభాషలే కాక ఆనాటి ముస్లింల

భాషల్లోకూడా, నేర్చుకుని - జీసస్ ప్రవక్తను ఎలాటి పేరుపెట్టి పిలిచేవారో కూడా తరచి తరచి గాఢమైన పరిశీలనచేశారు! తత్ఫలితంగా లభించిన చారిత్రక ఆధారాల్ని చూస్తే - జీసస్ (లేక 'యోగి ఈశా')వి స్పష్టంగా **శిలువపై మరణించనే లేదనీ, అంతేగాక** ఆయన చాలా పండిపోయిన వృద్ధాప్యంవరకూ (89 సంవత్సరాలు) జీవించి ఉన్నాడనీ, చివరకు ఆయన కాశ్మీరులోనే మహాసమాధిచెందాడనే ప్రస్ఫుటంగా తెలిపే సాక్ష్యాధారాలు ఎన్నింటినో ఈ విదేశీ మిషనరీలే, త్రవ్వితీశారు; చరిత్ర పుటలలోంచి!!

అందులో కొన్ని మచ్చుకు మన భారతీయ క్రైస్తవుల ఉపయోగార్థం మన హిందువుల పరిశీలనకోసం ఇక్కడ పరిచయం చేస్తాను.

## రష్యన్ రాయబారి - 'నికోలాస్' :-

ప్రఖ్యాత రష్యన్ పరిశోధకుడు చిత్రకారుడు, యోగసాధకుడూ అయిన 'నికోలాస్ రోరిక్' (Nicholar Roerich) రాసిన 'ఆసియా హృదయం' (Heart of Asia) అన్న గ్రంథం 1930లో టిబెట్‌లోని సింకియాంగ్ రాష్ట్రంలో (ఇప్పుడు ఉత్తర చైనాలో కలిపేసుకున్నారు) 'కష్కార్' అనే నగరానికి ఆరుమైళ్ల దూరంలో జీసస్ ప్రయాణిస్తుండగా ఆయన తల్లి 'మేరీ' (Mary) మరణించిందనీ, ఆమెయొక్క సమాధి ఇప్పటికీ కాశ్మీర్‌లో కనుగొన్నాననీ తెలియజేశాడు ఆశ్చర్యంగా!

## పీటర్ సువార్త :-

బైబుల్ లోంచి తొలగించిన (క్రైస్తవ ఫాదరీలచే) "అపోక్రీఫల్" పీటర్ (Apocryphal Gospels) "సువార్త"లో క్రీస్తును శిలువపైకి ఎక్కించినతరువాత మేరీ అనే పేరుగల ముగ్గురు స్త్రీలు ఆసమీపంలోనే ఉన్నారని తెలుపబడింది! కాబట్టి దీని ప్రకారం జీసస్ పర్యటనలో ఆయన తల్లి, మరియమ్మ ఇంకా ఇద్దరు స్త్రీలు అదే పేరుతో "మేరీ మగ్దలీన్" ఇంకో మేరీ కూడా ఆయన పరివారంలో చేరి జీసస్‌తో ప్రయాణించారని స్పష్టంగా రాయబడివుంది!

## క్రైస్తవ పరిశోధకుల అన్వేషణ :-

దీనికేదైనా రూఢీపరిచే సాక్ష్యాధారాలు భారతదేశంలో లభిస్తాయా?

అని పరిశోధించిన విదేశీ పరిశోధకులకు కొన్ని ఆశ్చర్యకరమైన సాక్ష్యాధారాలు లభించాయి.

కాశ్మీరులో శ్రీనగరునుంచి ఆగ్నేయంగా 60 కి.మీ. దూరంలో బీజ్‌బిహారా అనేచోట ఒక గుహ (Ancient Silk Path) 12 కి.మీ.లు పొడుగు తగుమాత్రం ఎత్తు పర్వతాలలోకి వ్యాపించింది! ఆ గుహ వద్ద ఒక మఠం 'ఐష్ - ముఖ్యమ్' అన్న పేరు కలిగినది ప్రసిద్ధిపొందిన యోగి, ఇస్లామిక్ సద్గురువు అయిన జైనుద్దీన్ వలీ.

## మోసెస్ - దండం :-

సమాధివద్ద కాశ్మీరును పరిపాలించిన సుల్తాన్ జైనుల్ అబుద్దీన్ (1408-1461) ఆయన కాలంలో లభించిన చారిత్రక ఆధారాలను బట్టి ఒక "మంత్రదండం" వంటి సాధువులు లేక ఫకీర్లు ధరించే 'శటకా' వంటి దండం అతిపవిత్రంగా రక్షింపబడుతూ పూజాదికాలను అందుకుంటున్నది ఈనాటికీ! అది ఎవరినీ తాకనీయకుండా ఆ సమాధి కాపలాదారుడు రక్షిస్తూ వుంటారు! దీనివెనుక ఇంకా విచిత్రమైన ప్రాచీన చరిత్ర ఉంది!

ఈ దండము లేక 'శటకా' షేక్‌నూరుద్దీన్ వలీ అనే పూర్వపు సాధువు యోగిపుంగవుడు తనకు పరంపరగా పూర్వంనుంచీ అందించబడిన "పవిత్ర దండం"గా ఈ మఠం వద్ద ఇవ్వబడింది! ఇది 'మోసెస్ ప్రవక్త' (Moses Staff) చేతిలో ధరించిన మంత్రదండమని ఈనాటికీ ప్రజలు దాన్ని అతి పవిత్రంగా భావిస్తారు.

అంతేగాక దీనిని 'యోగి-ఈశా' దాన్ని చేతిలో ధరించేవాడని - ఆయన కాలినడకన భారత దేశానికి వచ్చినపుడు ఈ మంత్రదండాన్ని చేతికర్రలా పవిత్రమైన దండంలాగా ధరించి దానితో ఎన్నో మహిమలు చేశాడని కాశ్మీరీలు స్థానిక ముస్లింలు అక్కడే స్థిరపడివున్న క్రైస్తవులు యూదులూ అంతా దీన్ని దృఢంగా నమ్ముతారు!

ఇప్పటికీ అక్కడి ప్రజలకు అంటురోగాలు కాని మరేవిధమైన ఈతిబాధ సంభవించినా ఈ పురాతనమైన దండాన్ని ఆకుపచ్చని సిల్క్

షెల్లాతో కప్పి సాంబ్రాణీ అగరుబత్తి ధూపం వేసి పూజిస్తే వారి కష్టాలు మటుమాయం అవుతాయనీ అంతటి పవిత్రతతో ఈనాటికీ పూజించబడే "ఈశాదండం" రెండున్నర మీటర్ల పొడుగు వుంది. ముఖ్యమైన చారిత్రక వస్తువు.

ఈ దండం సుమారు రెండున్నర సెంటీ మీటర్లు లావుకలిగి ముదురు అగరు రంగుతో చాలాకాలం ఉపయోగించినదానిలాగ నున్నగా నిగనిగలాడుతూ ఆలివ్ చెక్కతో చేసిన శటకాలాగ కనిపిస్తుంది! స్థానికులు దీని చరిత్రను అడిగినవారికి భక్తిభావంతో ఇలా చెపుతారు!

## "యోగి-ఈశా" 'సటకా' :-

"ఇది 2000 ఏళ్లకు పూర్వం మోసెస్ (Moses) అనే యూదు ప్రవక్త తన వెంటవచ్చిన విదేశీయులైన యూదు కాందిశీకులతో వారి దేవుడు చూపిన "భూతల స్వర్గం" అనబడే కాశ్మీరుకు చేరుకున్నాడని! ఈ దండం మొదట్లో ఖాన్ వద్ద ఐస్ ముఖ్యమ్ అనే చోట శ్రీనగరులో భద్రపరచబడి ఉండేదని!



జీసస్' ఉపయోగించిన మంత్రదండం లేక శతకా! (యోగదండం) - కాశ్మీర్

విచిత్రమేమంటే ఈ పేరు 'అ-ఇష్' ముఖ్యమ్ అరబిక్ భాషలో జీసస్‌కు సంబంధించినది! ఎందుకంటే యూదుల ఉచ్చారణ ప్రకారం

**అయిష్ = 'ఈశా,' ముఖ్యామ్ = 'విశ్రాంతి స్థలం' లేక మజిలీ అని! దీనిని బట్టి జీసస్ తన పర్యటనలో తరచూ ఇక్కడకు వచ్చి విశ్రాంతి తీసుకోవడం ఒక్కడే కొంతకాలం తన జపధ్యానాలూ అనుష్టానం చేసుకోవడం జరిగేదని, అప్పుడు ఆయనకు తన లోపలి నుండి ఏ రకమైన ఆదేశాలు వస్తే దానినిబట్టి తర్వాత మజిలీ ప్రయాణం చేసేవాడని స్థానికులు చెపుతారు!**

## సొలమన్ రాజు సింహాసనం (King Solomon's Throne) : -

జీసస్ కాశ్మీరులో ప్రయాణించాడని ఋజువు చేసే మరియొక్క చారిత్రక సాక్ష్యాధారం ఒక శిలాశాసనం 'ముల్ల నాదిరి' అనే ముస్లిం చరిత్రకారుడు **1413** A.D. లో తన కాశ్మీరు దేశ చరిత్రను "తారిఖ్-ఈ-కాశ్మీరా" అన్న కాశ్మీరు చరిత్రలో సొలమన్‌రాజు (King Solomon) యూదులకు ప్రభువని ఆయన సింహాసనం కాశ్మీరులో ఉందని తెలిపే శాసనాలను ఇంకా తనకాలం వరకూ చూడవచ్చునని వ్రాశాడు!

ఇంకా కొన్ని ఆశ్చర్యకరమైన విషయాలు కూడా ముల్లా నాదిరి తన చారిత్రక గ్రంథంలో రికార్డు చేశాడు! అవి ఈ క్రింది విధంగా వున్నాయి

## 'సొలమన్ రాజు' (King Solomon) మందిరంపై శాసనాలు:-

పూర్వం కాశ్మీరును పాలించే హిందూరాజు గోపానందుడు రాజా అక్ కుమారుడు! ఇతడు గోపదత్తుడనే పేరుతో కాశ్మీరు సింహాసనాన్ని అధిష్టించాడు! ఆయన రక్షణలో ఒక పవిత్రమైన పూజామందిరం ఉండేదని అది సుమారు రెండువేల సంవత్సరాల నాటిదని ఆ మందిరం శిథిలమై పోతూంటే గోపదత్త మహారాజు, మంచి తాపీవారిచే దానిని వ్రాయించాడని రాసి వుంది! ఆ సొల్‌మన్ రాజు మందిరం అని చెప్పబడే కట్టడం మెట్లమీద పర్షియన్ భాషలో నాలుగు శిలాశాసనాలు చిత్రించాడు - ఆనాటికి ఆయన వరకూ లభించిన ప్రాచీన చరిత్ర నశించిపోకుండావుండే నిమిత్తం ఇలా ఆ శాసనాలను వ్రాయించాడు! అవి ఇలా వున్నాయి.

## సొలమన్ మందిరంపై శాసనాలు :-

1. ఈ కట్టడంలోని స్థంభాలు నిర్మాణం చేసినవాడు వినయపూర్వకమైన యుధిష్టిజాగర్; సంవత్సరం - 54.

2. ఖ్వాజా రుక్న్ (Qwaza Rukn) అనేవాడు ముర్జాన్ కుమారుడు ఈ స్తంభాలను కట్టించాడు.

3. ఈనాటి కాలంలో యూజ్ అసఫ్ (Yuz Asaph) (జీసస్ ప్రవక్త) తానే భగవంతుని దూతను, అని ప్రకటించుకున్నాడు. సంవత్సరం - 54.

4. ఆయన పేరు "జీసస్." ఇజ్రాయిల్ నుంచి వచ్చిన ప్రవక్త యోగి ('అయిషాన్ ఏషు' (ఈశా) పైగంబర్ --ఈ-బాని ఇజ్రాయిల్ అస్త్')

పై నాలుగు మెట్లమీద చెక్కిన పర్షియన్ శాసనాలు శిలాఫలకాన్ని ఈనాటికీ చూడవచ్చు! దీని నమూనాను ఒక పంక్తి యొక్క ఫోటోకాపీ ఈ క్రింద ప్రచురిస్తున్నాము.

(ఈశాయోగి గురించిన పర్షియన్ శిలాశాసనం సాల్మన్ సింహాసనం మెట్లపై చెక్కినది!)

ముస్లిం చరిత్రకారుడు ముల్లానాజిరీపై ఆశ్చర్యకరమైన విషయాలను తన చరిత్రలో రికార్డుచెయ్యడమే కాక ఇంకా ఇలా వ్రాశాడు.

ఈనాటి కాలంలో పరిపాలించే గోపదత్త మహారాజు టైములో "యూజ్ ఆసఫ్" అనే సాధువు (పైగంబర్) యూదుల పవిత్రభూమినుండి యాత్రికుడుగా కాశ్మీరు లోయకు రావడం జరిగింది. ఆయన రావడమేకాక తానొక భగవంతుని దూత (మసీహా = Messiah) అని ప్రకటించుకున్నాడు (తనకు తానే). ఆయన జీవించేపద్ధతి ఎంతో పవిత్రంగానూ ఆధ్యాత్మిక మార్గాన్ని అనుసరించే యోగులను పోలి ఉన్నది!

అతడు తానే ఒక సందేశాన్ని ఇచ్చే నిమిత్తం వచ్చానని తాను రాత్రి, పగలు (అహర్నిశలు) దైవధ్యానంలో మునిగివుంటానని సామాన్య ప్రజలకుకూడా భగవంతుని 'శక్తి'ని అందుబాటులోకి తెచ్చేందుకే వారి మధ్యనే పర్యటిస్తున్నానని ప్రకటించాడు!"

ఇతడు కాశ్మీరులోని పాటక జనాన్ని తనవద్దకు పిలిచేవాడు! చాలా మందికి ఈయనమీద విశ్వాసం కుదిరింది! ఇతని బోధనలు ఇక్కడి స్థానిక ప్రజల మతానికి విభేదంగా వుండటంవల్ల 'గోపదత్త' మహారాజు వద్దకు ఫిర్యాదులు వెళ్లాయి ఇతడిని శిక్షించమని కోరుతూ!

కాని, ఆయనేమీ 'ఈశా'ను బాధించలేదు! నేనింకా హిందువుల పురాతన గ్రంథం ఒకదాంట్లో చూశాను! ఇతడు నిజంగా 'హజరత్ ఈశా' అనే (దేవుని 'కళ,' లేక 'అంశ' తనలో మోసే యోగి అని) అతడిపేరు 'యూజ్ అసఫ్' (Yuz Asaph) అని నిజమైన సత్యం దేవునిలోనే ఉంటుందని (సత్యలోకం బ్రహ్మలోక బ్రహ్మజ్ఞానం) అంటూ ఆయన కాశ్మీరు లోయలో కొంతకాలం ప్రజల మధ్య జీవించాడు!"

అంటూ ముల్లా నాదిరి *(Mulla Nadiri)* కాశ్మీరులో తన చరిత్రలో రాశాడు!

## జీసస్ మరణం :-

అరబ్బీ భాషలోని బలుహర్ బుడాసఫ్ గ్రంథం (The Book of Baluhar

and Budasaf) అనే గ్రంథంలో **జీస్ మరణం** ఇలాగ వర్ణించబడి వున్నది ఈక్రింది మాటలలో -

"ఆయన కాశ్మీరు చేరుకున్నాడు! అది ఆయన ప్రయాణించిన దేశాలలోకల్లా సుదూరమైన సరిహద్దు! అక్కడే ఆయన శరీరాన్ని వదిలిపెట్టాడు!

జీసస్ మరణించినపుడు తనకి చెందిన వస్తువులన్నీ తనను నమ్మకంగా సేవించిన శిష్యుడు అబాబిద్ (Ababid), అనే వానికి దానంచేశాడు!

జీసస్ చేసిన ప్రతిపనీ నిర్దుష్టంగా చేశాడు! తన శిష్యుడిని దగ్గరకి పిలిచి తన ఆఖరి ఉపదేశాన్ని ఈవిధంగా అతడికి వినిపించాడు!

## జీసస్ ఆఖరి ఉపదేశం :-

"నేనొక పవిత్ర మందిరాన్ని మరింత అలంకరించి దీపాలతో నింపి ఉద్ధరించాను! మరణించే వారికి వెలుగు చూపాను! సత్యాన్ని గ్రహించే నా వారయిన జీవులను నేర్పుగా పోగుచేశాను! ఎవరైతే నారాకకు ముందు ప్రపంచం అంతటా వెదజల్లబడి వున్నారో (Scattered) వారందరినీ ఒకచోటకి (Gathered) చేర్చాను!

ఇప్పుడు నేను నా ఆఖరి శ్వాసతోపాటు నా ఆత్మను ఈ ప్రపంచం నుండి ఉపసంహరించి శరీరాన్ని పరిత్యజిస్తాను (మరణిస్తాను)!! అబాబిద్ నీకిచ్చిన ఉపదేశాలను నీవు శ్రద్ధగా పాటించాలి! సత్యమార్గం నుంచి ఎప్పుడూ వైదొలగరాదు! విశ్వాసము, నమ్మకము సత్యమునందు నిష్ఠ వదలక కృతజ్ఞతతో మరువక జీవించాలి!

ఓ ప్రియశిష్యుడైన అబాబిద్! ఓ అబాబిద్! వీటిలో నీవు తక్కినవారందరికి మార్గదర్శిగా వుండాలి!

అంటూ - ఈవిధంగా ప్రవచనం చేసిన తరువాత జీసస్ ఈశా అబాబిద్‌తో తనకు దగ్గరలో భూమిని చదును చేసి నేలను బాగుచేయమని ఆజ్ఞాపించాడు! ఆ తరువాత కాళ్లుజాపుకొని కిందనే శయనించాడు! తన

శిరస్సును ఉత్తరదిక్కుగా పెట్టి తన ముఖాన్ని తూర్పువైపు చూస్తూ తన తుదిశ్వాసను విడిచాడు! (కాశ్మీరులోని - "జీసస్ - సమాధి", సరిగ్గా ఇలానే ఉంది.)

"యూజ్ అసఫ్" (Yuz Asaph) అన్న పేరుతో "ఈశా నబీ" సద్గురువు 'ఈశా' అని జనం పిలిచే సమాధి మందిరం శ్రీనగర్‌లో 'కాంజార్' అనే ఒక పేట ప్రాంతంలో ఇప్పటికీ చూడవచ్చు!



'జీసస్ సమాధి' - శ్రీనగర్

## జీసస్ సమాధిపై "శాసనము" :-

"జీసస్ సమాధి" చుట్టూ తర్వాత కాలంలో ఒక మందిరం నిర్మించబడింది! దాన్ని "రోజా బల్" (Rozabal) అని ఈనాటికీ పిలుస్తారు! మనభాషలో 'రోజా' అంటే ఒక సద్గురువు సమాధి లేక ఒక 'ప్రవక్త సమాధి' అని అర్థం!

సమాధి మందిరంలోకి ప్రవేశించగానే కుడివైపున ఒక 'శాసనం' రాయబడివున్నది. ఈ విధంగా...

"యూజ్ అసఫ్ (Yuz Asaph) అనే యోగి కాశ్మీరుకు చేరుకొని చాలా శతాబ్దాలకు పూర్వం సత్యాన్వేషణకై తన జీవితాన్ని అంకితంచేసి ఇక్కడ

జీవించాడు! ఇతడు విదేశీయుడైన ఉత్తమజాతి (Prince) వాడు!"

## సయ్యద్ నాసరుద్దీన్ :-

జీసస్ సమాధి పక్కనే 15వ శతాబ్దంలో ఇంకొక ముస్లిం సద్గురువైన సయ్యద్ నాసరుద్దీన్ కూడా సమాధి చేయబడ్డాడు! ఇతడి 'దర్గా' ముస్లింల ఆచారం ప్రకారం-ఉత్తర దక్షిణాలుగా సమాధి చేయబడివున్నది! జీసస్ సమాధి మాత్రం ముస్లిం సాంప్రదాయానికి వ్యతిరేకంగా తూర్పు నుండి పడమర వేపుకు దిక్కుగా ఏర్పడివున్నది యూదుల మతాచారం ప్రకారం!!

దీన్నిబట్టి యూజ్ అసఫ్ అనే యోగి ఈశా-ముస్లిం సాధువూ కాదు, హైందవ యోగీ కాదని చెపుతోంది. ఈయన యూదుల జాతికి చెందినవాడని ఈ సమాధి నిర్మాణం ఋజువు చేస్తున్నది! సమాధి పక్కనేవున్న జీసస్ పాదముద్రలు మరొక్క ఆశ్చర్యకరమైన సాక్ష్యాధారం!

## పాద - ముద్రలు :-

ఈ పాదాలు శిలాఫలకంపై చెక్కబడి వున్నాయి! పాదం అడుగున స్పష్టంగా మేకులుకొట్టిన మచ్చలు, గుంటలుగా శిలువ వేయబడ్డ జీసస్ పాదాలపైన వున్న గాయాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి! ఆసియాలో శిలువ వేసే శిక్షలేదు గనుక కాశ్మీరులో ఈ సమాధికి చెందినవాడు **'యూదుల ప్రవక్త'** అయిన జీసస్ యోగివేనని చారిత్రక పరిశోధకులు నిర్ణయించారు! ఈ క్రింది మాటలే అందుకు సాక్ష్యాధారం :-

"The footprints were meant to prove the identity of the rather like finger prints. As with the swastika of Buddhas foot prints characteristics can be seen in "Yuz Asaph" footprints ."

" .. The sculptor clearly illustrated this scars of the Crucifixion wounds..."

"... The position of the wounds even indicates that the left



'జీసస్ పాదముద్రలు'

foot has been nailed over the right."

". . Because Crucifixion was unknown as punitive in Asia, one could conclude this is the place of burial of Jesus. There are numerous historical sources in Kashmir that confirm that Yuz Asaf and Jesus were one and the same ....

".... An old manuscript describes the Memorial as the grave of "Isa Rooh - U - llah" Each year thousands of pious believers make pilgrimages to the tomb, not just Moslems, but also Hindus, Buddhists and Christians. The descendants of the old Israelites have remembered the true significance of the modest monument. They call the shrine "The tomb of "Hazrat Isa Sahib" i.e. the tomb of the 'Lord (Master) Jesus.' Ancient documents state that a protective building was constructed around the grave as long as ago as 112 A.D."

పై సాక్ష్యాధారాలే కాక ముఫ్తీ రహ్మాన్ (Mufti Rahman) మీద వ్రాయించిన శాసనంలో ఇలా వున్నది -

"ఇక్కడనే యూజ్ అసఫ్ సమాధి సొల్మన్ రాజు (King Solomon) మందిరాన్ని పునరుద్ధరించినవాడు గోపదత్త మహారాజు! ఆయన పరిపాలన కాలంలో కాశ్మీరుకు ఒక గొప్ప ఆధ్యాత్మిక ప్రచారకునిగా వచ్చాడు! ఈ నిధిని సర్వులూ గౌరవిస్తారు, చిన్నా పెద్దా అందరూ!"

"Here lies 'Yuz Asaf ' who reestablished the temple of Solomon at the time of 'King Gopadatta,' and who came as a Prophet to Kashmir.

He ministered to the people declared his unity with God and was a Law (preacher) giver to the people. Since then his tomb has been honoured by Kings, state officials, high dignitaries and

the common people."

## జీసస్ నిర్యాణం-మరణం :-

ఈ ముస్లిం చరిత్రకారుడు "యూదు జాతుల ప్రవక్త" ("Isha the Prophet of Jesus) "ఈశా" జీవిత విశేషాలను కాశ్మీరుకు సంబంధించినంత వరకూ వ్రాసి "తారిఖ్ - ఈ - కాశ్మీరా" గ్రంథంలో యోగి జీసస్ నిర్యాణాన్ని యధాతథంగా అక్కడ చూసిన ప్రత్యక్షసాక్షుల కథనం ప్రకారం జరిగినది ఇలా తెలిపాడు.

"యూజ్ ఆసఫ్ ప్రక్త తన జీవితంలో చివరి కాలాన్ని కాశ్మీరులోయలో పర్యటిస్తూ గడిపాడు! ఆయన నిర్యాణం తర్వాత అతడి కళేబరం 'మొహల్లా అంజిమరహా' (Mohalla Anzimarah) అనే చోట సమాధి చేయబడిందని ఇప్పటికీ స్థానిక ప్రజలు భక్తితో ఆయన దర్గాకు వెళ్లి సాంబ్రాణి అగరుబత్తుల వెలిగించి ధ్యానం చేస్తే ఈశాప్రవక్త అనుగ్రహం లభిస్తుందని అది ఒక పవిత్రస్థలంగా ముస్లింలు హిందువులు యూదులు కూడా దర్శిస్తారు" అని రాశాడు!

ఇలా జీసస్ నిర్యాణం జరిగిన కాలంలో కాశ్మీరును గోపదత్త మహారాజు కుమారుడు గోకర్ణుడు పరిపాలిస్తుండగా 58 సంవత్సరంలో జరిగినవి రాశాడు **(తారిఖ్ - ఈ - కాశ్మీరే** (Taiq-e-Kashmire) **పేజి 69).**

పై చారిత్రక ఆధారం గొప్ప సంచలనాన్ని యూరప్‌లోని క్రైస్తవ ప్రపంచాన్ని కుదిపివేసే ఆశ్చర్యకరమైన పరిశోధనాద్భుతం (Wonder Discovery) గా భావించబడింది. ఇందులో చెప్పబడిన గోపదత్త మహారాజు కాలం 78 A.D. నుండీ **107** A.D. వరకూ మధ్యకాలంలో జీసస్ కాశ్మీర్‌లో జీవించి మరణించినట్లు ఆయన ధృవపరిచే చారిత్రక సాక్ష్యాధారంగా బైబుల్ చరిత్రకారులు భావిస్తున్నారు.

విదేశాలలో అయితే ముల్లానాదిరీ (Mulla Naziri) ఉదహరించిన చారిత్రక విషయాలు జరిగే నాటికి అంటే గోపదత్త మహారాజు మరణించే

నాటికి, సొల్‌మన్‌రాజు సింహాసనంపైన పర్షియన్ శాసనం లిఖించిననాటికి జీసస్ ప్రవక్త ఇంకా జీవించివున్నదీ లేనిదీ వివరించలేదు!!

## శాలివాహన చక్రవర్తి తో జీసస్

శాలివాహన చక్రవర్తి భారతదేశాన్ని పరిపాలించిన ఆఖరి హిందూ సామ్రాట్టు. ఈయన పేరున 'శాలివాహన శకం' 78 A.D. లో స్థాపించబడింది. ఈనాటికీ మన భారతీయ పంచాంగాలు ఈ శాలివాహన శకాన్నే వ్రాస్తాయి. విక్రమశకంతో పాటు!

ఈయన జీవితకాలంలోనే "యోగి ఈశా" హిమాలయ పర్వతాలకు వచ్చినట్టూ ఆయన జపం చేసుకుంటూవుంటే మంచు కొండల మధ్య నుంచి తన సైన్యాన్ని తీసుకొని మ్లేచ్ఛదేశాలపై దండయాత్ర చేసి వస్తున్న శాలివాహన చక్రవర్తి జీసస్‌ను చూశాడనీ, వారిద్దరి మధ్యా జరిగిన సంవాదం గురించి కూడా కాశ్మీరు చరిత్రకారులు ఉదహరించారు!

## జర్మన్ పరిశోధకుడు:-

జర్మన్ పరిశోధకుడు "హోల్గర్ కెర్స్టన్" (Holger Kersten) క్రీస్తు జీవితం మీద రచించిన గ్రంథం "Jesus in India"లోని వ్రాసిన ఈ క్రింది వాక్యాలు ప్రత్యేకంగా గమనించాల్సి వుంది!

"I read in a book of the Hindus that the Prophet was really Hazrat Isa, the spirit of God (God's peace and good will be with him) and he adopted the name "Yuz Asaf". True knowledge is with God He spent his life in this Kashmir valley.

"After his demise, he was buried in Mohalla Anzimazah. It is said that the light of Prophecy emanates from the tomb of this prophet. King Gopadatta ruled sixty years and two months before he died. After his death, his son Gokaran mounted the

throne and ruled for the span of fifty eight years."

"At that time when Jesus lived in Kashmir, the "Happy Valley" was the centre of an enormous religious cultural intellectual and political ferment."

"The Rajatarangini text provided a further clue about the residence of Jesus in ancient Kashmir.

In Raja Tarangini there is an account of a God man who performed miracles very similar to those of Jesus. The saint's name was "Isana" Isana is said to have saved the influential statesman "Vazir from crucifixion and to have brought him back to life. The vazir subsequently becapme the ruler of India and Governed for 47 years.

Kalhana writes that the God-man "Isana" was Kashmir's last reformer and was influential in the first century A.D. It seems likely that saint "Isana" was none other than "Isa" or "Jesus."

మధ్యకాలపు చరిత్రకులలో మర్లాన్ జోసెఫట్ అనే వాడు 700 A.D. ప్రాంతంలో భారతదేశంలోని "ఒక రాజు - యోగి కథ" అంటూ కొద్ది మార్పులతో గౌతమ బుద్ధుని కథను రికార్డు చేశాడు.

**16**వ శతాబ్దం దాకా బైబుల్ పరిశోధకులకు ఈ కథ "వర్లాన్ జోసఫట్" కథకు మూలం బుద్ధదేవుడి యవ్వనంలో సిద్ధార్థునిగా వున్నప్పుడు ఆయన చూసిన వృద్ధుడు, మరణించిన కళేబరం, సన్యాసి ఎలా జ్ఞానోదయానికి దారి తీశాయో - సరిగ్గా అదే గాథ క్రైస్తవ ఫాదరీలు **700** A.D. ప్రాంతంలో అరబ్బు క్రైస్తవుల నుండి **1583**లో రోమన్ కేథలిక్ చర్చి వారి సెయింట్‌ల గాథలలో చేర్చారు. నిజానికి జోసఫట్ అనే పేరు గ్రీకులోని జోసాఫ్ (Joasaph) అన్న మూలము నుండి అరబ్బి భాషలోని తద్భవం అని అసలు మూలనామం జుడాసఫ్ (Judasaf) అదే

సరిగ్గా కాశ్మీరీ చరిత్రకారుల "యూసఫ్" (Yusaph) క్రమంగా "యూష్ అసఫ్" (Yus - Asaph) అన్న జీసస్ నామాంతరాన్ని చెందిందని!

అంటే సూటిగా చెప్పాలంటే జీసస్ మహిమలుగా చోటు చేసుకున్న గాథలు నిజానికి బౌద్ధమత జాతక కథల నుండి, నీతి కథల నుండి సంగ్రహించబడినవేనని తన పరిశోధనలో బుజువైన అంశాలని జర్మన్ పరిశోధకుడు హోల్గర్ కెర్స్టన్ (Holger Kerston) వ్రాసిన ~~ఈ~~ క్రింది వాక్యాలే ప్రమాణం!

"The charming tale is moving and so full of profound truth that both and were canonised by the Roman Catholic church in 1583, and placed in calendar of martyrs. Under November 27, one can read, "In India near the borders of Persia, Saints Barloam and Joasaph, their wonderful deeds, have been portrayed by St. John of Damascus".

Until the sixteenth Cetury, it probably did not occur to any one that the story was precisely the same as the legend of prince Siddartha who left his family and lived without shelter in order to become the Buddha. The name Josafat affre Josuphat sounds Jewish that no doubts ever arose as to its origin. But in fact the name can be traced back without difficulty to the Greek name, Josaps, further to the Arabic name, Judasaph; and finally to the Kashimiri name Yus Asaph. If one knows that the letters 'J' and 'B' are nearly identical in Syrian, Arabic and Persian, and can recognise the name Budas of in the word Judasaf and Budasaf means nothing other than "Bodhi sathva" or a Buddha in the making (sanskrit root Budh = to know, Sathva = Truth, purity, Buddha = enlightened)

"The exotic sounding name Barlaam can also be traced back

to its original meaning via the bridge of language. In Arabic Balanhar means the same as the sanskrit word Bhagavan. "The exalted Divine one" The etymology of J (B) udasaf is a clear indication that the Islamic prophet Yuz Asaf was really a Buddist Bodhisattva.

ఇంకొక ముఖ్యమైన చారిత్రక సాక్ష్యాధారం హాజరత్ ఫతామా అల్‌జహ్రా మహమ్మద్ ప్రవక్త యొక్క దగ్గర బంధువు! ఆయనచే జీసస్ **120** సంవత్సరాల వరకూ జీవించినట్టు తెలుపబడివున్నది!

ఇంకొక ముస్లిం చరిత్రకారుడు షేక్ అల్‌సైద్ ఉస్ సారిక్ Shaik Ali - Said - Us Sariq (962 A.D.). ఇతడు తన చరిత్రలో ఇక్మాలూద్దీన్ అన్న చరిత్ర గ్రంథంలో జీసస్ రెండుసార్లు భారతదేశానికి పాదయాత్ర చేశాడని అతడు యూజ్-అసఫ్ అన్న పేరుతో కాశ్మీరులో సమాధి చెందాడని వ్రాశాడు.

ఈ పుస్తకాన్ని **1882**లో జర్మన్ పరిశోధకుడు మాక్స్ ముల్లర్ (Max Mueller) జర్మన్ భాషలోకి అనువదించి ప్రచురించాడు.

ఇంకా ఎన్నో ఇలాంటి చారిత్రక సాక్ష్యాలున్నాయి. అవన్నీ వ్రాస్తే ఇదే ఓ పెద్ద గ్రంథమే అవుతుంది!



# 27

# చివరకి ఏం తేలింది?

గత అధ్యాయాలలో బైబుల్ పరిశోధనయొక్క "చరిత్ర" ఎలా ప్రారంభించిందో-సంక్షేపంగా సమీక్షించాం! దీనివల్ల ఒక ముఖ్య విషయం తెలుసుకుంటాము. అదేమిటంటే ఈనాడు మనదేశంలో చాలామందికి అనుకున్నట్టు బైబుల్ దేవుని వాక్యంగా రాయబడ్డ ఒకే గ్రంథం కాదు!

ఇది, వేరు వేరు కాలాలకు చెందిన అనేక భాషలలోని రచనల సంకలనాలు (Library) చోటుచేసుకున్నాయి!

అందులో హీబ్రూ భాషలోని యూదుల మతగ్రంథాలు మాతృకగా ఏర్పడ్డ పాత నిబంధనలు ఒక భాగం - ఇవి కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నాయి!

మిగతా బైబుల్ భాగాల నుంచి వేరుగా! ఇక పోతే ఈజిప్టులో అతి పురాతనమైన ఫేరోల (Pharoahs) మతంనుండి మోసెస్ ప్రవక్త కాలంలో సంగ్రహించబడ్డ పాత నిబంధనలలోని భాగాలు - ఇవి స్పష్టంగా విడిగా కనిపిస్తాయి!

ఇంక మూడో విభాగం జీసెస్ క్రీస్తు వ్యక్తిగత **జీవితానికి** సంబంధించిన- ఆశ్చర్యకరమైన విశేషాలు ముఖ్యమైనవి.

అలాగే 'కొత్త నిబంధనలల్లోని 'సువార్త' ('Gospels') లకు సంబంధించిన విదేశీయుల పరిశోధన ఎంతో లోతుగానూ, చారిత్రక విశ్లేషణతో చేశారు!

ఇందులో కూడా మనకి స్పష్టంగా కనిపించే అంశం 'బిషప్‌ల మహాసభ'లు నిర్వహించి అనేక సార్లు బైబుల్‌నుంచి తొలగించబడిన భాగాలూ, చేర్చబడిన భాగాలూ, ఇంకా మూలసిద్ధాంతాలలో చేయబడిన మార్పులూ ఇవన్నీ ఆసభలలో తీసుకున్న నిర్ణయాల పూర్తి రికార్డు (Minutes of the Council for Constantinople, Council at Nice etc.) ఈ నాటికీ "పోప్"ల రికార్డులో లభిస్తున్నాయి, రాతపూర్వకంగా!

ఇవన్నీ చూస్తే - అవి ప్రత్యక్షంగా నిరూపించేది ఒకే ఒక్క యదార్థ **సత్యం!** అదేమిటంటే 'కొత్త నిబంధనలు' (New Testament) అన్న బైబుల్‌కు ఒకే ప్రాచీన మూల గ్రంథం (Original Text) అంటూ ఏదీ లేదు! అన్నదే మహాశ్చర్యకరమైన నిజం!

ఇవన్నీ ఒక ఎత్తు ఐతే జీసస్ జీవితం గురించి పరిశోధనలో తెలిపే **మహాశ్చర్యకర వింతలు మరొక ఎత్తు!** బైబుల్‌లో ఈనాడు "భగవంతుని వాక్యం" అన్న భావనతో యదార్థసత్యంగా నమ్మి చదివే భాగమంతా - **జీసస్ తర్వాత దాదాపు ఒక శతాబ్దం కాలం** గడిచిపోయాక తయారైన **రచనల సముదాయం'** (Anthology) నుండి ఎలా ఏర్పడిందో గత అధ్యాయాలలో గమనించినట్టు సంకలనం చేసి వ్రాయబడ్డ జీసస్ **జీవితానికీ**, సంకలనం కాని, యదార్థ చారిత్రక పరిశోధనలలో సాక్ష్యాల ఆధారంగా లభించిన విషయాలకూ చూస్తే - కొండంత తేడా!

జీసస్ జీవితానికి సంబంధించిన అంశాలన్నీ ఒకచోట వ్రాసుకుంటే ఈనాటి కొత్త నిబంధనల గ్రంథంప్రకారం లభించే ముఖ్యాంశాలు -

(a) జీసస్ జననం 25-5-4 B.C.

(b) మేరీకి కన్యగా ఉన్నప్పుడే జన్మించాడని.

(c) తన 13వ సంవత్సరం నుంచే 32వ సంవత్సరం దాకా ఆయన జీవిత చరిత్రలో ఏం జరిగిందో అంతుపట్టని 'గండి' లేక లోటు వున్నది.

(d) జీసస్‌ను 'శిలువ వేసి' శిక్షించగా ఆయన మరణించాడని

(e) అలా ఆయన పూర్తిగా మరణించిన తర్వాత 7 రోజుల అనంతరం మృత్యువుని జయించి "పునరుత్థానం" (Resurrection) పొందాడని!

(f) ఆ తర్వాత శరీరంతో స్వర్గంలోకి ఒక వెలుగుతో అంతర్థానమై వెళ్లిపోయాడని బైబుల్ ముఖ్యాంశాలు !

## ముఖ్యాంశాలు :-

ఇందులో పైన చూపిన ప్రతీ ఒక అంశానికీ పూర్తిగా వ్యతిరేకమైన చారిత్రక సాక్ష్యాధారాలు లభించడం అనేది క్రైస్తవులు తట్టుకోలేనంత ఆశ్చర్యకరమైన వింత!

అందులోనూ ఈ పరిశోధకులు కూడా పూర్తిగా బైబుల్‌ను నమ్మే విదేశీ క్రైస్తవులకే లభించడం మరొక వింత!

నాలుగవది యూరప్‌లోనూ, అమెరికాలోనూ ఇంకా ఫ్రెంచి, జర్మన్ పరిశోధకులు జీసస్ భారతదేశం వచ్చాడనీ, ఇక్కడ చాలాకాలం సంచారం చేశాడనీ, చివరకు జీసెస్ సమాధి కూడా కాశ్మీరులో లభిస్తున్నదనీ!

అలాగే ఆయన తల్లి మేరీ సమాధి కూడా ఈనాటి పాకిస్తాన్‌లోని ఒక గ్రామంలో లభిస్తుందనీ!!

అంతేకాదు జీసస్ అసలు శిలువపై మరణించలేదనీ! ఇలా - ఆయన శిలువపై మరణించలేదన్న దానికి ముఖ్య సాక్ష్యాధారం బైబుల్ లోని కొత్త నిబంధనలు "సువార్త" లోనే లభిస్తున్నాయన్నది ఇంకా గొప్ప ఆశ్చర్యం!!

అన్నిటికన్నా ఆశ్చర్యం! జీసస్ ప్రవక్త చాలా కాలం జీవించాడని ఆయన 70 సం॥పైగా సుమారు 80వ పడిలో మరణించాడనీ ~~ఈనాటి~~ కాశ్మీరులో సమాధి చేయబడ్డాడని!!

ఇవి చారిత్రకంగా లభించిన ప్రత్యక్ష సాక్ష్యాధారాలు !

ఇవిగాక ప్రాచీన బౌద్ధ సన్యాసుల ఆశ్రమంలో లభించే ప్రాచీన తాళపత్ర గ్రంథంలో "యోగి-ఈశా" యొక్క అసలైన "సంపూర్ణ జీవిత చరిత్ర" రహస్యంగా నేటికీ రక్షించబడుతూ వున్నదని దానిని జన్మతః క్రైస్తవుడూ, రష్యన్ రాయబారి అలెగ్జాండర్ నోటోవిచ్ స్వయంగా చూశాడనీ అంతేకాదు దాని కాపీని అనువాదాన్నీ సంపాదించి ప్రచురించగా అది ప్రపంచ వ్యాప్తమైన సంచలనం సంక్షోభం చెలరేగించింది!

తరువాత జర్మన్ పరిశోధకులు కెర్స్టన్ Jesus lived in India అన్న నిశితమైన చారిత్రక పరిశోధనా గ్రంథంలో అనేక అంశాలను సూక్ష్మంగా విమర్శించి జీసస్ భారతదేశంలో జీవించాడనీ, శిలువ మీద మరణించనేలేదని ఆయన తల్లి సమాధి, మేరీ సమాధి కూడా కాశ్మీరు పరిసరాల్లోనే లభిస్తున్నాయని-నిర్ధారణ చేశాడు! ఆయన గ్రంథంలో అనేక అపూర్వమైన ఫోటోలను రేఖాచిత్రాలను ప్రాచీన వ్రాతప్రతుల నమూనాలను కూడా ప్రచురించాడు!

ఇవన్నీ ఒక ఎత్తు! వీరందరూ పుట్టకముందు - సంస్కృతంలో వేదవ్యాస మహర్షి రచించిన "భవిష్యపురాణం"లో కలియుగంలో జరగబోయే భవిష్యత్తుకు సంబంధించిన మహాపురుషుల పేర్లు వారి జీవిత విశేషాలు

ఒక "నాడీ గ్రంథం"లో రాసిన కాలజ్ఞానం లాంటి భాగంలో 'ఈశపుత్రుడు' అన్న పేరుతో ఒక మ్లేచ్ఛదేశంలో జన్మించిన మతగురువు (ప్రవక్త) భారతదేశానికి వస్తాడనీ అతడిని హిమాలయాలలో శాలివాహనుడు అనే చక్రవర్తి 78 A.D. ప్రాంతంలో కలుసుకుంటాడని ఆ తర్వాత జీసస్ కాశ్మీరులో పండు వృద్ధాప్యంతో యోగమార్గంతో శరీరాన్ని విడిచి పెట్టాడనీ రాసి వున్నది!

అలాగే మహ్మద్ ప్రవక్త జీవితం కూడా భవిష్య పురాణంలో లభించిన శ్లోకాలతోసహా నేను **"1999 కలియుగాంతం"** అన్న నా గ్రంథంలో ప్రచురించాను!

వీటన్నింటినీ ఒక్కొక్క అంశాన్నిగనక జాగ్రత్తగా పరిశీలిస్తే ఎన్నో ఆశ్చర్యకరమైన వింతలు చారిత్రకమైన సత్యాలు మత ఛాందసులైన బిషప్‌ల చేత తగుల పెట్టబడి, మార్పులు చేర్పులు చేయబడిన జీసస్ జీవిత చరిత్రలోని యదార్థమైన చారిత్రక అంశాలు ఇప్పుడిప్పుడే మన భారతీయుల దృష్టికి వస్తున్నాయి!

ఇవన్నీ ఒక్కొక్క అంశమే పరిశోధనా వివరాలతో మీ ముందు పెడతాను - బైబుల్‌పై పరిశోధన ఒక మహా సముద్రం వంటిది! ఇంకా ఎంతో వున్నది సముద్రంలా!!!

